ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
వారి బహుమతి నందిన గ్రంథము

తెలుగులో

# ఛందోరీతులు

రచన
డా. గిడుగు వేంకట సీతాపతి

విశాలా పబ్లికేషన్సు
ఖైరతాబాద్, హైదరాబాద్-4



వెల: రూ. 6-00

# విషయసూచిక

## మూడవ ప్రకరణము - మాత్రాగణవిబద్ధములయిన ఛందోరీతులు 114-155.



## నాల్గవ ప్రకరణము - తెలుగులో పద్యరచనా ప్రారంభము - ఉపజాతి లక్షణము 156-212.



## ఐదవ ప్రకరణము - వడి; ప్రాస 213-240.



## ఆఱవ ప్రకరణము - దేశిచ్ఛందము 240-256





# విజ్ఞప్తి

డా॥ గిడుగు వేంకట సీతాపతిగారి బహుముఖ ప్రజ్ఞాపాటవము, సాహిత్య సేవ, ఆంధ్ర మహాజనులకు అందరికీ తెలిసిన విషయములే.

అజన్మ సాహితీవేత్తలైన డా సీతాపతిగారు క్రీ. శ. 1885, జనవరి 28వ తేదీని జన్మించారు.

వ్యావహారిక భాషా పితామహులైన రామమూర్తి పంతులు గారు భాషా చరిత్రలో ఒక మహాయుగానికే కర్తలైనట్టివారు. పితృపాదుల సహృదయాన్ని, కృషిని ముందుకు నడిపించుకొని తెలుగు భాషా మతల్లికి అనన్య సామాన్యమైన నిత్య సేవ చేస్తూ ఇప్పుడు మన ముందున్నవారు డా. గిడుగు వేంకట సీతాపతిగారు.

ఆదిమవాసులైన సవరులకు ఒక లిపి, ఒక నిఘంటువు, ఒక వ్యాకరణం లభించాయంటే అందుకు ఈ తండ్రీ కొడుకుల కృషే సంపూర్ణ కారణం.

వీరి సవర భాషా కృషికి మెచ్చి వాషింగ్టన్ ఇంటర్నేషనల్ అకాడమీ వారు వీరికి డాక్టరేటు బిరుదు నిచ్చి సమ్మానించారు.

తెలుగులో వీరే ప్రప్రథమ మానవశాస్త్ర పరిశోధకులు (ఆంత్రోపోలజిస్ట్); సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల, సవర భాషలలో పండితులు, విమర్శకులు, కవులు; వ్యాకరణ ఛందశ్శాస్త్రాలలో వీరి కృషి చాలా గొప్పది.

ఆంధ్ర సర్వస్వ గ్రంథ నిర్మాణాన్ని కొనసాగిస్తున్న తెలుగు భాషా సమితి మూల పురుషులలో వీరు ఒకరు. దానికి వీరు చాలా కాలం ప్రధాన సంపాదకులు. అందు చరిత్ర సంపుటం వీరి కృషి ఫలితమే. మద్రాసు యూనివర్శిటీ సెనేటు సభ్యులుగాను, తెలుగు బోర్డుకు అధ్యక్షులుగాను పనిచేశారు.

ఇంతటి సర్వతోముఖ ప్రజ్ఞాశాలికి ప్రతి విషయమూ అభిమాన విషయమే అయినా బాల సాహిత్యాన్ని మరీ హృదయానికి చేర్చు కొని భావిపౌరుల అభ్యుదయాభివృద్ధుల కోసం వీరు పునాదులు వేశారు. 1909 నుంచికూడా ఈ రంగంలో వీరు కృషి చేస్తూ వస్తు న్నారు. "చిలుకమ్మ పెండ్లి" "రైలుబండి" "ఎలుక-పిల్లి" మొదలైన వీరి పాటలు అర్ధ శతాబ్దంపైగా ఆంధ్ర దేశంలో పిల్లలు పాడుకుంటు న్నారు. బాల వాఙ్మయంలో రెండు సార్లు ప్రభుత్వంవారి బహు మతులు పొందినవారు. బాల సాహిత్య రచనాలయమునకు రెండు తడవులు డైరక్టరుగా ఉండి నవ రచయితలకు మార్గ దర్శకులైనారు.

1929 నుంచి 1936 వరకు వీరి పాత్ర ఆంధ్రదేశ చరిత్రలో అమూల్యమైనట్టిది. తెలుగువారికి ఒరిస్సా గుప్పిటనుంచి పర్లాకిమిడి పట్టణం రాకపోయినా కనీసం పాతపట్టణం తాలూకా అయినా దక్కిందంటే అది కేవలం సీతాపతిగారి పోరాట-ఫలితమే అనాలి.

77 సంవత్సరాల వయో భారంతో కూడా ఒక ఆంధ్రలోనే కాకుండా బొంబాయి, శాంతి నికేతనం లాంటి రాష్ట్రేతర ప్రాంతా లలో రవీంద్ర శత జయంతి ఉత్సవాలలో పాల్గొని, నిర్విరామ సాహితీ సేవ చేస్తున్న స్థిత ప్రజ్ఞులు, బహుముఖ దార్ఢ్య సంపన్నులు

అగు డా. సీతాపతిగారు తమ యావజ్జీవిత ఛందశ్శాస్త్ర పరిశ్రమకు ప్రతిబింబమైన యీ ఛందో రీతులు గ్రంథాన్ని ఇటీవల రచించారు. ఈ మహోత్కృష్ట గ్రంథం తెలుగు ఛందశ్శాస్త్ర గగనపథంలో ధ్రువ తారగా నిలిచి పోతుందనడం నిర్వివాదమైన విషయం. అప్పకవీయం, ఆనంద రంగరాట్ఛందం. సర్వలక్షణ సారసంగ్రహం, ఇత్యాది లక్షణ గ్రంథాల తరువాత దాదాపు నూటయాభై సంవత్సరముల అనంతరం వెలసిన పరిశోధ నాత్మకమైన ఛందో గ్రంథం ఇది ఒక్కటే. వెయ్యి సంవత్సరాల మన సాహిత్య చరిత్రలో మకుటాయమాన మైన ఛందశ్శాస్త్ర శాఖలో ఇటువంటి అపూర్వ గ్రంథం అవతరించనే లేదు. డా. సీతాపతిగారి ప్రామాణికమైన పరిశోధ నాత్మకమైన యీ గ్రంథాన్ని ఆంధ్రుల కందిస్తున్నందుకు సంతోషిస్తున్నాము. వ్యావహారిక భాషోద్యమంలో ప్రముఖపాత్ర వహిస్తున్న డా. సీతాపతి గారు ఈ గ్రంథరచనలోనూ, శ్రీ గోపాల కృష్ణయ్యగారు గ్రంథ పరిచయంలోను, గ్రాంథిక భాషను ఉపయోగించడం, దానిపట్ల విద్వేషం లేదని తెలియ జేయడానికే.

ఇకముందు డా. సీతాపతిగారి చిరకాల పరిశ్రమకు ఫలిత మైన మరికొన్ని అమూల్య గ్రంథాలను క్రమంగా ఆంధ్రుల కందించ గలమని మనవి చేస్తున్నాము.

ఇట్లు
ప్రకాశకులు

---

# మున్నుడి

ఛందస్సును గూర్చి నేను క్రొత్తగా తెలిసికొన్న విషయములు కొన్ని 1919 నుండియును వ్యాస రూపమున వివిధ పత్రికల యందు ప్రకటితములగుచు వచ్చినవి. 1919-20 లో మా తండ్రిగారు, వేంకటరామమూర్తి పంతులుగారు సంపాదకులుగా నడపిన 'తెలుగు' పత్రికలో "ఛందో రహస్యములు"అను పేరను పద్యముల నడక, తెలుగు పదములలో గల ఊత (Accent), నన్నయ సీసములందు గల వడిప్రాస నియమములు, అఖండవడి మొదలయిన విషయములను గూర్చి నేను రచించిన వ్యాసములు ప్రకటితము లయినవి. 1921లో వావిళ్ళ వేంకటేశ్వరులుగారి కోరిక ననుసరించి వారు తొలి సారి ముద్రించిన అనంతుని ఛందము (ఛందో దర్పణము)నకు సుమారు 80 పుటల ఉపోద్ఘాతము రచించినాను. ఛందో దర్పణ గ్రంథము ముద్రితమయిన పత్రములను జూచి నేను ఉపోద్ఘాతమును రచింపవలసి వచ్చుటవలన అందలి గ్రంథపాతములకు గాని అపపాఠ ములకుగాని నేను బాధ్యుడను కాను. ముద్రిత మయిన గ్రంథమునే ఆధారముగా పెట్టుకొని అందులో గల విషయములకును అప్పకవీ యాది- ఇతర లక్షణ గ్రంథములలో గల విషయములకును ఐక్యము లను, మతభేదములను, తారతమ్యములను తెలియ జేసినాను. అంతే కాని గ్రంథమందలి అపపాఠములను దిద్దుటకు పూనుకొనలేదు. ఆర్యాగీతులు లక్షణ విరుద్ధముగా కందములవలె ముద్రితములైనవని చూపించి తినే కాని ఇతర దోషములపై నా దృష్టిపడలేదు. ఇప్పుడు వాఙ్మయ మహోధ్యక్షు వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు వాటిలో

కొన్నిటిని నా దృష్టికి తెచ్చిరి. ఉ· "చపలార్య—వరుసన్ ద్వితీయ తుర్యస్వరగ్గ మధ్యగ జకార-ములుదగరెం। డరలన్ దనర్చు నేనిన్ హారీ మురారి చప-లార్యయగున్" అని యుండవలెను. అప్పుడిది "చపలాద్వితీయ చతుర్థౌగ్మధ్యేజౌ" అను పింగళ సూత్రమున కను గుణముగా నుండును" అని తెలియ జేసినారు. 1921 లోనే ఆంధ్ర పత్రిక- ఉగాది సంచికలో ఛందో విషయములను గూర్చి నేను రచించిన ఒక పెద్ద వ్యాసము ప్రకటిత మయినది.

ఆ రోజులలో వ్యావహారిక భాషా ప్రయోజన వాదమును సాగించు చుండిన మా తండ్రిగారికిని, వారికి తోడుగా ఉండి తాళ పత్ర గ్రంథ పరిశోధనము చేయుచుండిన నాకును పూర్వకాలమందలి వచన రచనా సంప్రదాయ విషయములలో గల ఒక రహస్యము తెలిసినది. ప్రబంధములలోని వచనములు మాత్రమే కావ్యభాషలో రచితములగు చుండెను గాని, వ్యాఖ్యానములలోను ఇతర వచనము లందును శిష్టజన వ్యావహారిక భాషను పండితులు యథేచ్ఛగా ప్రయోగించు చుండుటయే సంప్రదాయ సిద్ధమైనది. అప్పకవి కూడ ఆ సంప్రదాయమునే అనుసరించి తెలివిడి మొదలయిన వచన రచనలు తన వాడుక భాషలోనే రచించెనన్న విషయము మా పరి శీలన వలన స్పష్టమయినది. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తమ కీ రహస్య మదివఱకే తెలిసినదని మాకు తెలియజేసిరి. మేము చూచిన ప్రతులన్నిటను తెలివిడి మొదలయిన వచనములు వాడుక భాషలోనే ఉన్నవి. అప్పుడు, అనగా 1923 లో వావిళ్ళ వేంకటేశ్వరులుగారు వ్రాత ప్రతులందున్న రీతిగా అప్పకవీయమును ముద్రింతుమని మాటయిచ్చి దాని కొక పీఠిక వ్రాయవలసిన దని

మమ్ము కోరినారు గ్రంథము 1924 లో మేము సంప్రతించిన రీతిగా మా పీఠికతో ముద్రిత మయినది ఉపోద్ఘాతములో తెలియ జేసినట్లు "వ్రాత ప్రతులు సంగ్రహించుటలోను పాఠములు సంప్రతించుటలోను విషయ విచారణలోను మా తండ్రిగారు నాకు సహాయులుగా ఉన్నందున ఈ పీఠిక నేనే వ్రాసినా 'మేము' అని బహువచనము వాడినాను. (గి వేం సీ)" అప్పుడు ముద్రిత మయిన గ్రంథము మా పీఠికలో మేము తెలియ జేసిన విషయములకు అనుగుణముగా నున్నదని మాకు వారు పంపిన ప్రతులను బట్టి యనుకొని ఆనందించినాము. కాని, మా కపకారము జరిగినది. కొలది ప్రతులు మాత్రమే మేము కోరిన రీతిగా ముద్రితము లయినవి. పెక్కు ప్రతులు పూర్వ ముద్రణము లందున్న రీతిగానే ముద్రితము లయినవి. ఆ పిమ్మట ముద్రితము లయిన ప్రతులలో మేము పీఠికలో తెలియ జేసిన విషయములకు విరుద్ధము లయిన పాఠములు కూడ చేరినవి కొన్నిటను మా పీఠిక మాత్రము ప్రకటితమైనది అందుచేత విమర్శకుల ఆక్షేపణలకు మేము అన్యాయముగా గురి కావలసి వచ్చినది

ఛందోదర్పణ ప్రథమ ముద్రణమున ఉపోద్ఘాతమునందు నన్నయ మధ్యాక్కరలను గూర్చి నేను వ్రాసినదానిలో కొంత భాగము రెండవ ముద్రణమందు మాయమయినది అందులో బ్ర (శ్రీ) వజ్ఝల చిన సీతారామ శాస్త్రిగారు చెప్పిన అంశములను నేను విమర్శించితిని 1924–5 నాటి భారతిలో ఈ మధ్యాక్కరలను గూర్చి నేను రచించిన పెద్ద వ్యాసములు ప్రకటితము లయినవి

1931 లో Linguistic Survey of India సంప్రతించి ప్రకటించిన Sir George Grierson పండితుని 80-వ జన్మదిన మహోత్సవ

సందర్భమున అతనికి సమర్పించిన సమ్మాన సంచికలో Accent in Telugu Speech and metre అను పేర నే నాంగ్లభాషను రచించిన పెద్ద వ్యాసమొకటి ప్రకటితమయినది దానిని చదివి మెచ్చుకొని అతడు నాకొక లేఖ వ్రాసి పంపినాడు 1933 లో నేను లండన్ వెళ్లినప్పుడు అతనిని కలిసికొని Accent విషయమై అతనితో చర్చించి నా యభిప్రాయములను దృఢపఱచుకొన్నాను.

పైని సూచించిన వ్యాసములలోని విషయములు పత్రికల లోను ఉపోద్ఘాతములలోను చెదరి యుండుటవలన ఛందస్సును గూర్చి నేను వ్రాసినది తెలిసికొనగోరువారికి సులువుగా లభ్యములు కాక పోవుటచేత నాకు కొద్దిగా అపకారము కూడ జరిగినది

పైని పేర్కొన్న విషయములనే కాక మఱికొన్ని ఛందో విషయములను చేర్చి ఒక గ్రంథము రచించవలెనన్న సంకల్పము నాలుగైదు సంవత్సరముల క్రిందటనే కలిగినది కాని, ఇతర సాహిత్య విషయములలో నిమగ్నుడనై ఉండుటచేత నా సంకల్పము నెఱవేఱలేదు. 1960 లో నా యదృష్టవశమున ఆంధ్ర సాహిత్య అకాడెమీ కార్యదర్శులయిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు "తెలుగులో ఛందోరీతులు" అనే విషయమును గూర్చి గ్రంథ మొకటి కావలెననియు ఉత్తమ గ్రంథమునకు అకాడెమీవారు రూ. 2000/- బహుమతి ఇచ్చెదరనియు, 1961 జనవరి 31-వ తేదీ వరికి పోటీ గ్రంథములు తమ కార్యాలయమునకు చేరవలెననియు ప్రకటించినారు నే నీ గ్రంథము రచింపవలెనను సంకల్పము ఆ ప్రకటన చూడగానే కలిగినది కాని, 1960 డిసెంబరు వఱకును రచన ప్రారంభించుటకే అవకాశము చిక్కినది కాదు ఢిల్లీ సాహిత్య

అకాడెమీవారు కోరిన "తెలుగు సాహిత్య చరిత్ర" యను గ్రంథము ముగించి ముద్రణమునకు కావలసిన వ్రాతప్రతి పంపించి ఈ ఛందో గ్రంథమును వ్రాయుటకు పూనుకొన్న వెంటనే మఱి యొక రచన సాగించవలసి వచ్చినది 1961 జనవరి మొదటి వారములో బొంబాయి నగరమున జరుగనున్న రవీంద్రనాథ శతవార్షిక మహోత్సవ సభలో నేను ప్రసంగించుటకు సమ్మతించిన Tagore's message to the world అను విషయమును గూర్చి కొన్ని గ్రంథములు పరిశీలించు పని తగిలినది అంతేకాక లోగడ నేను వ్రాసిన నా వ్యాసముల ప్రతులలో కొన్ని నావద్దను లేవు. వాటిని సంపాదించుటకు కొంత శ్రమ పడవలసి వచ్చినది నూతన విషయములను గూర్చి ఆలోచింపవలసి యుండెను లయ గుప్తముగా నుండు వృత్తప ల నెట్లు రచింపనగునో తెలియజేయుటకు కొన్ని క్రొత్త వృత్తములను రచింపవలసి వచ్చినది.

ఈ నా గ్రంథములో ఉదాహృత గ్రంథముల పేళ్లు ఆయా సందర్భములలోనే వివరించితిని పు 33 లో పేర్కొన్న బాలబోధచ్ఛందము అముద్రితము. లింగమగుంట తిమ్మకవి విరచిత సులక్షణసార బాలబోధచ్ఛందముల వ్రాత ప్రతి వాఙ్మయ మహోధ్యక్షు వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్యగారి వద్దనున్నది.

పైని చెప్పిన కారణములవలన 1961 జనవరి 7-వ తేదీని ఈ గ్రంథరచన ప్రారంభించి 30-వ తేదీ సరికి ముగించితిని వ్రాసిన కాగితములు సరిచూచుకొనుటకయినను అవకాశము లేకపోయినది. ఎప్పటికప్పుడు నేను వ్రాసిన కాగితముల నందుకొని నా మనుమడు (నా పెద్దబ్బాయి కొడుకు) చి॥ వేంకట రామకృష్ణారావు కార్బను

కాగితము పెట్టుకొని మూడేసి ప్రతులు వచ్చునట్లు వ్రాయుచుండెను. అతని తోడ్పాటువలన 31-వ తేదీని అకాడెమీవారికి రెండు ప్రతులు అందజేయ గలిగితిని. అతనికి నా ఆశీర్వాదములు

అకాడెమీవారికి పంపిన గ్రంథము వారు కోరినమేరకు పూర్తిగానున్నదే కాని గ్రంథాంతమున ఒక సూచన చేసినాను. ఇప్పుడున్న లక్షణ గ్రంథములు 'మార్గ' (కవితా) చ్ఛందమునకే కాని దేశిచ్ఛందమునకు అనుగుణముగా లేవనియు, అనుగుణముగా నుండు ఛందోగ్రంథము క్రొత్తగా రచింపవలసి యున్నదనియు ఈ గ్రంథమందు నేను తెలియజేసిన విషయములనుబట్టి పెద్ద లెవరయినను అది రచింప గలరనియు నా ఆశయమును వెల్లడించినాను ఆ దేశిచ్ఛంద గ్రంథము నేనే రచించుట మంచిదనియు అది యెట్లుండవలెనో ఈ గ్రంథములో మార్గదర్శకముగా నైనను సంగ్రహించి వ్రాయవలెననియు మిత్రులు కోరినందున దేశిచ్ఛందమను పేర ఆఱవ ప్రకరణము రచించి చేర్చితిని. అనుకూల పరిస్థితులు లభించినయెడల దేశిచ్ఛందమను పేర నొక పెద్ద గ్రంథము రచింపగలను

ఈ గ్రంథము బహుమతి పొందదగిన గ్రంథమని తెలియజేసిన పరీక్షకులకును బహుమతి నొసంగిన అకాడెమీవారికిని, ' గ్రంథ పరిచయము "వ్రాసిన వాఙ్మయమహోధ్యక్షు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య గారికిని గ్రంథము చక్కగా ముద్రించిన దక్షిణ భారత ప్రెస్ వారికిని "విజ్ఞప్తి" రచించిన ప్రకాశకులను నా కృతజ్ఞతాభివందనములు ప్రూఫులు దిద్దుటలోను గ్రంథము రమ్యముగా సమకూర్చుట (get up) లోను నా రెండవ కుమారుడు చి॥ రామమూర్తి నా కెక్కువగా తోడ్పడెను అతనికినా యాశీర్వాదములు.

హైదరాబాదు
1-8-1961

గిడుగు వేంకట సీతాపతి

# గ్రంథ పరిచయము

ఆహ్లాదార్థకమైన 'చది" ధాతువు తొలి చకారమునకు "చన్దే రాదేశ్చఛః" (4-వ పాదము—658 సూ ) అన్న ఉణాది సూత్రము చేత "ఛ"కారము వచ్చి "ఛంద"శ్శబ్ద మేర్పడుచున్నది. "వాగాత్మకో భవే చ్ఛందస్స వాపి ద్వివిధ స్మృతః" అన్న భరతుడు ఛంద మును స్వరాత్మక వాగాత్మకములుగా విభజించినాడు భరతుడు పేర్కొన్న స్వరాత్మకమాతోద్యవిషయికమైన దైనను కేవల లాక్షణికమైనదిగా సైతము గ్రహింపవచ్చును 'ఛందో హీనో న శబ్దోస్తి న చ్ఛందశ్శబ్ద వర్జితమ్" అని భాషకు ఛందస్సుకు అవినాభావ సంబంధమును చాటిన భరతుడే ఛందము వాగాత్మకమనుట ఛంద స్సును మించి భాషకున్న స్థానమును భాషలేని దే ఛందస్సు లేదను టను సూచించుచున్నాడు. అనగా ఎటువంటి గీతము వెలువడినను అది వాగాత్మకముగానే వెలువడు ననుట ఛందమనగా నేమో, లయ తాళము లేమో యెరుగని పామరులు తమకై తాము ఏవో పదములను లయబద్ధములుగానే అల్లుకొనుట లోకములో గమనించు చునే అన్నాము. కావుననే ఛందస్సునకు శబ్దమునకును భరతు డవినాభావ సంబంధమును చాటినాడనిపించును.

ఇటువంటి పవిత్రమైన ప్రమోదకారకమైన ఛందమును తొలుత మహేశ్వరుడు సృష్టించినాడని ఛందశ్శాస్త్రములు చెప్పు చున్నవి. చతుర్ముఖుని వేదసృష్టిని దృష్టిలో పెట్టుకొని చూచినచో ఛందసృష్టి కర్తృత్వము బ్రహ్మాపరమగును. భరతుని దృష్టిలో మార్గ-దేశి పరమైన నృత్యములకువలెనే మార్గ—దేశి ఛందస్సులకు

సైతము బ్రహ్మ మహేశ్వరులు సృష్టికర్త లగుదురు మార్గదేశీ పరమైన యీ నృత్య ఛందశ్శాస్త్రాదుల సృష్టిలో ఆదిత్వము అనిర్ణీత మైనది ఏది యెట్లున్నను ఇప్పటికి లభ్యమైన సంస్కృత ఛందము లలో పింగళ సూత్రచ్ఛంద మతి ప్రాచీనమైనది. తెలుగునకు సంబం ధించినంతవరకు కర్తృత్వ విషయమున నభిప్రాయ భేదము లున్నను 'కవిజనాశ్రయము" తొల్తటిది. ప్రసిద్ధమైనది. తరువాత వెలసిన వానిలో "అనంతుని ఛందము" — "బాలబోధ చ్ఛందము" (ఇది 'సులక్షణసారము పేరుతోచెలామణి అయిపోయినది. సులక్షణసారము గణయతి ప్రాసవృత్త లక్షణములు చెప్పు ఛందోగ్రంథము కాదు.) "అప్పకవీయము"లు ప్రసిద్ధములు — ఛందశ్శాస్త్ర పరముగా అప్పకవీయము విపులగ్రంథమే అయినను ఛందోరీతుల విషయికముగా కవిజనాశ్రయ - బాలబోధ చ్ఛందస్సుల వంటిది కానేరదు. కనీసము అనంతుని ఛందము వంటిదైనను కానేరదు కవిజ నాశ్రయ —బాలబోధ ఛందో గ్రంథకర్తలు ఛందోరీతుల వివరణలో వృత్తాదుల లక్షణ నిర్వచనా పద్ధతిలో అర్థ పద్యాలనే స్వీకరించి నను లయ గుప్తముగా వ్యక్తముగా ఆ యా పద్యములకు ప్రాణప్రతిష్ఠ చేసినారు కవిజనాశ్రయ — బాలబోధ చ్ఛంద ములలోని వృత్తాలలోఉన్న శయ్యాసౌభాగ్యము అనంతుని ఛందము లోనే కొంత కొరవడగా అప్పకవీయములో మూడు వంతులు కొర వడినది. దేశీ ఛందోరీతులను 26 అక్షరాలు పాదమునకు మించి ఉన్న తదితర ఉద్ధురమాలా వృత్తములను విడిచి పుచ్చగా వివిధా లుగా సమ-అర్థసమ—విషమ భేదాలతో నున్న వృత్తముల సంఖ్య 135 108 273, 989 272 314— నిజమున కివి కల్పనా రూప మైన వృత్తములే అయినను కోటాను కోట్లుగానున్న యీ ఛందో రీతులలో—ముఖ్యముగా వీనిలోని విషమ వృత్తాలలో— ఎన్నెన్నో

మాత్రాచ్ఛందస్సులు అంతర్లీన మగును. కోట్ల కొలదిగా ఉన్న యీ ఛందోరీతులలో అప్పకవి కంటె పూర్వమే అతడు చెప్పినవాని కంటె నెక్కువగా ఛందోరీతులు చెప్పినవాడు చిత్రకవి పెద్దన—263 వృత్తాలను పెద్దన తన లక్షణసార సంగ్రహములో చెప్పగా అప్పకవి 227 వృత్తాలను మాత్రమే చెప్పినాడు. ఎన్నెన్నో అంద చందాలను విరజిమ్ముచు కోట్ల కొలదిగా ఉన్న వృత్తాలలో మన కవులు లాక్షణికులు కొన్నిటినే గ్రహించుటలో కారణమున్నది. కవితనల్ల గలప్రతి కవికిని లయజ్ఞానము ఉండవలెనను నియమములేదు. ఆ జ్ఞానములేని వారు క్రొత్త వృత్తములను రచించుటలో వాని నడకను చక్కగా తీర్చిదిద్ది శ్రవణ పేయముగా లయాను గుణముగా యతి స్థానములను నిర్ణయించి సరియైన రూపు కల్పించ సమర్థులు కారు. ఈసామర్థ్యము ఏ కొలది మందికోగాని ఉండదు. ప్రాచీనులైన కవులు లాక్షణికులు నూతన వృత్తాలను వేటిని రచించిరో వాటకేమని పేర్లుపెట్టినారోనని పరిశీలించి వాటి స్వరూపమును ఆ తరువాతి వారు గ్రహింపలేని కారణముచేత కూడా బహు వృత్త వైశద్యము విస్తృతి కాంచ లేదు. క్రొత్త వృత్తములు వ్రాయవలెనని ప్రయత్నించిన వారుకూడ తమకు పూర్వము వినిర్మితాలైన వృత్తాల వ్యవస్థను గుర్తింపక పోవుటవల్ల ప్రాచీనులు వ్రాసిన వృత్తాలనే మారుపేర్లతో అర్వాచీనులు వ్రాసినారు. ఈ రూపముగా "ఉపస్థిత" వృత్తమునకు శిఖండివిరుతము శ్రీవృత్తము స్త్రీవృత్తము అని బహునామములు సిద్ధించినవి ఇట్లే క్షమకు క్షప అని పరాంతిక అని చంద్రిక అని సుగంధికి శాలిని చామర, ప్రశాంతులని పేర్లు వచ్చినవి ఇటువంటి దుర్వ్యవస్థ ఆంధ్రసంస్కృత ప్రాకృతాలన్నిటిలోను ప్రాచీనకాలము లోనే నెలకొన్నది వినూత్నములైన ఛందోరీతులను ఉపయోగము

లోనికి తెచ్చుకొన వలెనన్న చక్కని లయజ్ఞానము, లయాను గుణమైన పదబంధ జ్ఞానము నుండి తీర వలెను. ఇటువంటి జ్ఞానము మన ప్రాచీనుల కంతగా లేని కారణము చేతనే వివిధ చ్ఛందో రీతులను సృజింపలేక పోయిరి. సంపూర్ణమైన లయ జ్ఞానము సంగీత శాస్త్ర పరిజ్ఞానము, ప్రత్యేకమైన లయలతో వివిధ గతులతో బహుళ పద్ధతులలో వృత్త గీతాది రచనలు చేయగల కవితా శక్తి, సామర్థ్యము శ్రీ గిడుగు వెంకట సీతాపతిగారిలో మూర్తీభవించి ఉన్నవి. కావుననే బహు భాషా వేత్తలు పండిత పరిశోధక విమర్శకులు, కవులు ఛందో వ్యాకరణాది శాస్త్రవేత్తలు వ్యావహారిక భాషోద్యమ పునరుజ్జీవన కారకులు నయిన డాక్టర్ సీతాపతిగారు ఆంధ్రచ్ఛందో రీతులను గురించి చక్కని సునిశితమైన విమర్శనా గ్రంథమును రచియింప గలిగినారు. గణ ప్రస్తారాదులు, వళిప్రాసల చరిత్ర- వృత్త లక్షణాదులు తెలిసికొన్నంత మాత్రము చేత ఇట్టి రచన చేయుట సాధ్యము కాదు చక్కని లయలతో నడకలతో శ్రవణ పేయముగా వెలసిన వృత్తములు మాలిని భుజంగ ప్రయాతము, ఇంద్రవజ్ర- విద్యున్మాలవంటివి కొన్ని ఉన్నవి ఒక వృత్తమును ఒక విధమైన పదముల కూర్పుతో ఒక పద్ధతితో ఒక కవి నడిపించినా డనుకొందము ఆశయ్య మాత్రమే ఆ వృత్తమున కున్నదనుకొనరాదు అది పదముల కూర్పుతో నేర్పడుశయ్య మాత్రమే. ఆ కూర్పును మార్చి ద్విత్ర్యాది మాత్రా పరిమితములైన ఆ పదముల కూర్పును కుదించియు పెంచియు నడకను మార్చ వచ్చును. ఆ కూర్పు ఒక రీతిగానే కాక పెక్కు రీతులలో చూప వచ్చును. ఒకే ఒక వృత్తమును భిన్నమాత్రాకములైన పదములతో భిన్న గతులలో నడిపించ వచ్చును. ఈ విషయమును శ్రీ సీతాపతి

గ [illegible] రే [illegible] ద పద్య [illegible] ం పోకడలు [illegible] ప్రచు నిరూపించి [illegible] ఇటువంటి నులువులు మెళుకువలు అన్నియు ఆమూలాగ్రముగా నెరిగిననే కాని ఛందో రీతులను గురించి సృజనాత్మకమైన గ్రంథము వ్రాయుట సాధ్యము కాదు శ్రీ సీతాపతిగారు ఛందోరీతులకు సంబంధించిన విషయములన్నిటిలోను తలస్పర్శిగా పరిశ్రమ చేసిన వారు కావునసే యీ గ్రంథ రచనలో కృతకృత్యులై ఆంధ్రసాహిత్య ప్రపంచమునకు మహోపకారము చేసినారు ఆంధ్రదేశమున శ్రీ సీతాపతిగారివలె ఛందశ్శాస్త్రములో సర్వతోముఖమైన పరిశ్రమ చేసినవారు నలుగురు కాదు ముగ్గురైనను లేరు. కొన్ని కొన్ని భాగాలలో పరిశ్రమ చేసిన వారుండనగు గాక- ఆరు ప్రకరణములుగల యీ గ్రంథములో ఛందోరీతులకు సంబంధించిన పెక్కు విషయములను సాకల్యముగా చర్చించినారు. వానిలో కొన్నిటిని పర్యాలోచింతము. మొదటి ప్రకరణమున షట్ప్రత్యయములలో అధ్వమును విడిచి తక్కిన వానిని లక్ష్యములతో శ్రీ సీతాపతిగారు వివరించినారు వీనిని బట్టి సూత్ర పద్ధతి నిలక్షణములను గ్రహించు కొనవలెను మొదటి ప్రకరణము 2–21–22 పుటలలో అర్ధసమ విషమ వృత్తాల ప్రసక్తి ఉన్నది–అర్ధసమవృత్తములు స్వస్థాన పరస్థాన భేదములతో రెండు విధములు-ఒక పద్యములోని ఏ పాదములైనను రెండు పాదములు ఒక వృత్త లక్షణముకలవై తక్కిన పాదములు రెండును వేరొక వృత్త లక్షణము కలవై యీ వృత్తములు ఒకే ఛందములోనివైన స్వస్థాన అర్ధసమములు– భిన్న ఛందములలోనివైన పరస్థానార్ధసమ వృత్తములు– అగును–విషమ వృత్తాలు స్వస్థాన [illegible]స్థాన సర్వపరస్థాన భేదములతో మూడు విధములని ప్రాచీనులు చెప్పిరి. సర్వస్వస్థాన విషమ వృత్త

ములని ఒ.° భేదమును చేర్చవలసినదని ల్పోగడ సందర్భమున నేను వ్రాసినాను. వృత్తము నాల్గు పాదములలోను ఏదేని ఒక పాదము ఒక వృత్త లక్షణము కలదై తక్కిన పాదములు మూడును వేరొక వృత్త లక్షణములు కలవైన విషమ వృత్తము. ఈ వృత్త లక్షణములు ఏకచ్ఛందోగతములైన స్వస్థాన విషమములును భిన్నచ్ఛందోగతములైన పరస్థాన విషమములు ననబడును. నాల్గు పాదములును భిన్న భిన్న వృత్త లక్షణములు కలవై అవి ఏకచ్ఛందోగతములైన సర్వస్వస్థాన విషమములు-భిన్నచ్ఛందోగతములైన సర్వపరస్థాన విషమములు నగును

సంయుక్త వర్ణమునకు పూర్వమునందున్న అక్షరము గురువుగా రూపొందు విషయమున "రాముడు స్వామిధాత్రి కనగ" అన్నప్పుడు గురువగునని అనంతుడు చెప్పినాడుగాని శ్రీ సీతాపతిగారన్నట్లు వ్యస్తవ్యవస్థలో తెలుగులో (చూ-24-పు.) సంయుక్తమునకు పూర్వాక్షరము గురువు కానేరదు అనంతుని వచనము సమర్థనీయము కాదు. ఉచ్చారణ విధి ననుసరించి" అ ఆ ఐ ఔలకు మఱి, ఇ ఈ లు ఋకార సహిత" మిత్యాదులలో హ్రస్వాచ్చు గురువగుటను శ్రీ సీతాపతిగారు ప్రతిభా పూర్వకముగా విమర్శించినారు. "పా ఫా బా భా మాలను పాపాక్షర సంజ్ఞ లేను"అని కవిజనాశ్రయ కర్త ప్రయోగించుట చూడగా కారప్రత్యాయాభావమున హ్రస్వము దీర్ఘమగునని చెప్పనగును. మొదటి ప్రకరణములో వైదిక చ్ఛందోరీతులను గురించి అరటిపండు ఒలిచి చేతిలోపెట్టినట్లుగా శ్రీ సీతాపతిగారు వివరించిరి. పద్యరచన పుట్టుపూర్వోత్తరముల వివరించుటలోను జానపద గేయముల వివిధ గతులను తెల్పుటలోను అనేక నూతన

విషయములను లోకమున కందించినారు. మాత్రాగణ బద్ధములైన ఛందోరీతులను వివరించిన భాగము శ్రీ సీతాపతిగారి శాస్త్ర పరిజ్ఞానమును పరిశోధనా పాటవమును వేనోళ్ళ చాటు చున్నది. తెలుగులోనున్న సూర్యచంద్ర గణములను తదితర గణములను తమిళ కన్నడ గణస్వరూపములను తులనాత్మకముగా విమర్శించి, వీనికున్న పరస్పర వ్యత్యాసములను సంబంధములను వివరించిన తీరు మన కాశ్చర్యము కలిగించును. వివిధ విధములుగా చిత్రగతులలో నడచిన కందములను శ్రీ సీతాపతిగారు సూక్ష్మముగా వివరించినారు తలకట్లు గుడులు కొమ్ములు పెట్టి తొలుత కందములు నడిపించిన వాడు విన్నకోట పెద్దన కావ్యా చూ.6 ఉల్లా-60-61-62 (గుడులకు సంబంధించిన పద్యములో తత్రువసుడిగల పదమును ఒక దానిని ఇత్వరేఫకలదిగా ప్రయోగించినాడు పెద్దన). సంగీత స్వరములతో శ్రీ సీతాపతిగారు స్వయముగా రచియించి చూపిన కందము చక్కగా ఉన్నది ఇటువంటి పద్యమును నీ సరిదని నీ సరిదని ఇత్యాదిగా.

నీ సరిపని నీ సరిదని
నీ సరిమాదారి గరిమ నీ సరిగారి
నీ సరిగాని నిగమాగమ
గోపారులునుంబకుక్యకుల విశ్వేశా!

(కావ్యా-చూ-6-ఉల్లా-63 ప)

అని విన్నకోట పెద్దన ఒక పద్యము వ్రాసినాడు. పెద్దన పద్యములో చతుర్థపాదము సరిగమ పదనులకు భిన్నముగా నున్నది.

3 పాదములు మాత్రమే సరిగమలతో కూర్చబడినది. కాని శ్రీ సీతాపతిగారు వ్రాసిన పద్యములో ఇటువంటి భిన్నత్వము కానరాదు— కావున పెద్దనకన్న శ్రీ సీతాపతిగారే అధిక నైపుణ్యము చూపినారని చెప్పనగును.

సీస భేదములను గురించియు నన్నయ వాడిన సీసములను గూర్చియు 1919—1920 సంవత్సరాల 'తెలుగు' పత్రికలలో ప్రత్యేకమైన వ్యాసములు తొలుత వ్రాసిన వారు శ్రీ సీతాపతిగారే. అయినను శ్రీ సీతాపతిగారి పేరైనను నెత్తక ఆ సీసముల విషయములను 'టేబుల్'తో సహా తమ 'తెలుగు కవుల చరిత్ర'లోనికి (126—127—128 పుటలు) శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తెక్కించుకొనుటలో ఔచిత్యము కొరవడుచున్నది. శ్రీ వెంకటరావుగారి పద్ధతి నవలంబించినను ఈ ఛందోరీతులలో సందర్భము వచ్చినప్పుడల్ల శ్రీ వెంకటరావుగారి పేరును వారి గ్రంథములును ఉటంకింప బడుట శ్రీ సీతాపతిగారి సత్యాన్వేషణ - ఆవిష్కరణ పరతత్త్వమును తెలుపు చున్నది. శ్రీ సీతాపతిగారు సీస భేదములకు సంబంధించిన విషయములను మరింత విపులముగా నీ ఛందోరీతులలో చేర్చుట ప్రత్యేకముగా గుర్తింప వలసిన విషయము — సర్వలఘు సీసమునకు లాక్షణికు లందరును పై సీస పాదములనే లఘు యుక్తములుగా కూర్చవలెనని చెప్పినారు- కాని కొందరు అర్వాచీన కావ్యకర్తలు మాత్రము సీసపాదములకు క్రిందనుండు తేటగీతి ఆటవెలదులను నైతము సర్వలఘు యుక్తములుగానే రచియించినారు. ఉదాహరణకు కూచిమంచి తిమ్మకవి రచించిన యీ క్రింది పద్యమును గ్రహింప వచ్చును.

తరుణ శశిధరణ సువితరణ భయహరణా
యరుణ సరసిరుహానిద చరణ యుగళ
మదన మదమథన ఘనకదన తలవిజయగిరి
వదన జగదవన కరివదన జనక
వనజ భవదమన పురదనుజ కులశమన ముని
మనుజ సురవరద ప్రతిదిన విలసిత
బహుళ తరవిభవ రిపుగహన దవదహన పటు
విహగపతి గమననుత మహితచరిత

ధరణిరథ తరణిశత సదృశహార త్రినయన
గరళగళ ధనదాసఖ శుభదగగన చికుర
వరసుగుణ నికర మృదుహృదయ శరధి శరధి
యురగ వరభరణ ధరవరమ పురుష గిరిశ॥

(రాజశేఖర విలాసము, అవతారిక-17ప)

ఇందులో గమనింప వలసిన ప్రత్యేకత యేమనగా సీసపాదము లలోవలెనే క్రింది తేటగీతిలో సైతము ఇంద్రగణములకు మారుగా పంచ లఘుగణములనే ప్రయోగించుట. నిజమునకు సీసపాదములకు క్రింద గీతపద్య మున్ననే గాని సీసపద్యము పరిపూర్ణ స్వరూపము దాల్చదు. కాగా గీత పద్యము సైతము సర్వలఘు యుక్తమగుట యే సమంజసము పై పద్యమున ప్రతి సీసపాదములోను ఒకే ఒక విధమైన ప్రాసయతిని ప్రయోగించుట గమనింపదగిన విషయము. ద్విపద, రగడ, తరువోజాది దేశి పద్యములవలె సీసపద్యము కూడ తొలుత దేశి గేయమునకు సంబంధించినదె. రెండు ఇంద్రగణముల వంతున మూడేసి చరణములును రెండు సూర్యగణముల వంతున

నాల్గవ చరణమును కలిగి రూపొందిన పెద్ద చరణముగల గేయ స్వరూపములోని చరణము ఒక సీసపాదముగా సంస్కరింపబడి పద్యత్వము నొందినది

దక్షుడు యజ్ఞంబు హాశ్శరభ శరభ
తలపెట్టినంతలో హాశ్శరభ శరభ
బ్రహ్మదేవునిగుండె హాశ్శరభ శరభ
భగ్గుమనియే ఏ ఏ హాశ్శరభ శరభ—

వింటిరా సురలార హాశ్శరభ శరభ
విన్నపంబొక్కటి హాశ్శరభ శరభ
కలగంటి నీరాత్రి హాశ్శరభ శరభ
కల్లగాదూ ఊ ఊ హాశ్శరభ శరభ—

ఇత్యాదిగా నేటికిని వీరశైవులు వీరభద్ర పళ్ళెము పట్టి అన కట్టు విడుపుల సందర్భములలో పాడుట కలదు. హాశ్శరభ శరభ అన్న దరువు పదములను తొలగించినచో నవి సీసపాదములుగా రూపొందును.

దక్షుడు యజ్ఞంబు తలపెట్టినంతలో
బ్రహ్మదేవునిగుండె భగ్గుమనియె—
వింటిరా సురలార విన్నపంబొక్కటి
కలగంటి నీరాత్రి కల్లగాదు—

ద్విపద రగడల నడకలను రీతులను గురించి శ్రీ సీతాపతిగారు అతి సూక్ష్మముగా వివరించినారు. ద్విపదను సోమన సృష్టించిన

ఛందస్సుగా పరిశోధన పత్రికలో శ్రీ నిడుదవోలు వెంకటరావు గారు వివరించినారు గాని అది సరికాదు ద్విపద సోమనాథునికి పూర్వమే కావ్యములలో కెక్కినదనియు లక్షణవంత మైనదనియు కవిజనాశ్రియములోని ద్విపద లక్షణము చెప్పకయె చెప్పుచున్నది సోమనాథుడు ప్రాచీన సాంప్రదాయమును ఉల్లంఘించి ద్విపద యతి విషయములో విప్లవము తెచ్చినాడు ప్రాసగల ద్విపదలో ప్రాస యతిని ప్రయోగించెదనని ప్రతిజ్ఞ పట్టి ప్రయోగించినాడు. పూర్వోత్తర పాదములను తెగనీయక కొన్ని యెడల ఏకైక పద ప్రయోగ ములతో కలిపివేసినాడు. ఇది ద్విపద రచనలో సోమన తెచ్చిన విప్లవము నిజమున కిది తరువాత అనేక కావ్యములలో వ్యవహృత మైనదే అయినను లాక్షణికము మాత్రము కాలేదు. ప్రాసలేని ద్విపదగా మంజరీ ద్విపదను ప్రాసయతి కవకాశమిచ్చి లాక్షణికులు సృష్టించిరి గాని ప్రాస ఉండియు ప్రాసయతి నుపయోగింపదగు ద్విపద లక్షణము నే లక్షణ కర్తయును చెప్పలేదు.

తెలుగు ఛందస్సునకె కాదు తెలుగు కవితకె కాదు తెలుగు భాషకే వడిప్రాసలు పుంస్త్రీకి మంగళ సూత్రముల వంటివి. ఈ వడిప్రాసముల గురించి లోతుగా పరిశ్రమ కావించిన శ్రీ సీతాపతి గారు స్థల సంకోచముచేత విషయమును సంగ్రహించినారు. 'వడి' శబ్దమునకు మూల స్వరూపముగు ప్రాచీన ద్రావిడ పదమును సత్య సన్నిహితముగా గుర్తించినారు. తమిళములో తెలుగు ఛంద మును "వడుగు ఛంద"మని ప్రాచీన కాలమున వ్యవహరించెడివారు. అనగా వడులు (అక్షర మైత్రికల యతులు) గల ఛందమని వారు వ్యవరించెడివారన్నమాట. క్రీ॥ శ॥ 12వ శతాబ్దికి పూర్వమే వెలసిన

తమిళ ఛందమైన 'యాప్పిరుంగళమ్ కారిక్కై' లో కవిజనాశ్రయ మును 'రేచియార్ శెయ్ద వడుగచ్ఛందం' అని తత్కర్త పేర్కొన్నాడు. (ఈ విషయమును శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు నన్నయ్యకు పూర్వపు ఛందస్సు అన్న వ్యాసములో తెల్పినారు. రాజ రాజ-పట్టాభిషేక సంచిక) వడుగ ఛందమనగా వడులు గల ఛందమని అనగా తెలుగు ఛందమని భావము. వడులు తెలుగులో తప్ప మరే భాషలోను లేవు గదా! కాగా 'వడి' శబ్దమునకు మూలము ప్రాచీన ద్రావిడ పదమైన 'వడు' శబ్దమని సీతాపతిగా రనుట ముమ్మాటికిని సత్యము. మన లాక్షణికులు పాదాద్యక్షర మును 'వడి'గా పేర్కొన్నను కొన్ని యెడల పాదమధ్యయతి నుద్దేశించియు 'వడి' శబ్దమును ప్రయోగించినారు.

> నెలవెలిగినిడుదపాదం
> బులవాలవగణము మొదలఁబొందఁగనిడఁగా
> వలయునువల్లాపాదం
> బులతుదగురువమరఁ గందమునకిడవలయున్
>
> (కవిజ-జాత్యధికారము.)

ఇత్యాదులుగా పాదమధ్యవడి ప్రయోగమునకు ఉదాహరణములు పెక్కులు చూపవచ్చును కాని శ్రీ సీతాపతిగారన్నట్లు పాదాద్యక్ష రనిర్దేశకముగా ప్రాచీన లాక్షణికులు వడి శబ్దమును మాత్రమే ప్రయోగించినారు యతి శబ్దమునుగాని తత్పర్యాయ పదములను గాని యేలాక్షణికుడును ప్రయోగింపలేదు. యతిస్థానము లందున్న అక్షరముకంటె పాదాద్యక్షరమునకు ప్రాముఖ్యమున్నది. పాదాదిని

ఏ అక్షరము ప్రయుక్తమగునో దానికి మైత్రి గల అక్షరమునే తరువాతి యతినిర్ణయస్థానములో ప్రయోగింపవలెను. అక్షర మైత్రితో కూడిన యీ పాదమధ్య యతి స్వరూపము ఎట్లుండవలెనో పాదాద్యక్షరమును బట్టియే నిర్ణయమగును. కాగా పాదముల మధ్యలో రూపొందు యత్యక్షరములకన్న పాదాద్యక్షరము ప్రాముఖ్యమును పొందుచున్నది. తమిళమున వడు అనగా మార్గమని అర్థమున్నది. తరువాత నుపయోగించవలసిన యతి మైత్ర్యక్షర ప్రయోగమునకు (దేని నుపయోగింపవలెనో) "వడు"ను చూపునది అనగా మార్గదర్శకమగునది పాదాద్యక్షరము. కావుననే అది "వడి"యైనది "పాదాద్యక్షరమేవడి" అని ప్రాచీనులనుటలో పాదాద్యక్షరమే మైత్రియుక్తమైన యతి ప్రయోగమునకు మార్గదర్శకమగునన్న భావము వెల్లడి యగుచున్నది క్రమముగానిది దీని ప్రత్యేకతనుకోల్పోయి యతి పర్యాయ పదముగా రూపొందినది.

వల్లు కవి జనాశ్రయము మొదలుకొని అప్పకవీయము వరకును క్రమముగా పెరిగినవి అప్పకవి కొంతవరకు శాస్త్రీయమైన చారిత్రికమైన దృక్పథము కలవాడగుటను యతులను ఆ దృష్టితో బహువిధములుగా విభజించి పెంచినాడు. శ్రీ సీతాపతిగారు కవిజనాశ్రయము కావ్యాలంకార చూడామణి, అనంతుని ఛందము, అప్పకవీయములలోని యతుల పట్టికలను చూపి క్రమానుతముగా ఆ యతుల విషయమును సంగ్రహముగా వివరించినారు. అ ఆ ఐ ఔ లకు హాయలకు యతి మైత్రి చెల్లును. కాని యిది స్వర వళులలో చేరిన మైత్రీవిధి కానేరదు. సరస యతికి సంబంధించినది, 15-వ నెంబరు గాగల యతిలో చేరినవి స్వర యతులలో ప్రమాదవశమున

ముద్రింపబడిన వనుకొందును. (2–8–20) ఋకారమున కేవిధ ముగా నెన్ని రూపములుగా యతి చెల్లునో ఌకారమునకును నదే విధముగా నన్ని రూపములుగా యతి చెల్లును. ర ల ల యతి నంగీక రించినందువల్ల ఋ ఌ లకు మైత్రి ఏర్పడదు. ఋ ఌ లు అన్యోన్య మిత్రములు కావుననే ర ల లకు మైత్రి చెల్లినది. ఋఌ వర్ణయో ర్మిథస్సా వర్ణ్యంవాచ్య"మన్న వాక్యము ననుసరించి ఋకారము చేత ఌకారమును గ్రాహ్యమగునన్న తలంపుతోనే ఌకారమునకు ప్రాచీ నులు పెక్కుమంది ప్రత్యేకముగా యతిని విధింపలేదు. ఈ ఋ ఌ ల సవర్ణత్వమే ర ల ల సవర్ణత్వమునకు దారితీసినది (10) ≮ంయ్ = మ్ ఈ యతి శాస్త్రీయమే. ≮ంవ్ = మ్ ఈ యతియు లాక్షణిక మే. గాని ≮ంవ్ = ≮ంయ్ లకు సైతము యతి చెల్లునని పాఠకులు గ్రహింపరాదు ≮ంవ్ = ≮ంయ్ = ఇవి రెండును మ్ కారముతో యతి చెల్లుటకే చూపబడినవి గాని తమలోతాము పరస్పరము చెల్లు నని కాదు. (11) ఉకార ఒకారములతో కూడినప్పుడు మాత్రమే ప మ లు యతి మైత్రికి చెల్లుట ప్రత్యేకతగా గుర్తింపనగును. (8) న ణ లకు సరస యతి పేరుతో మైత్రి ఉన్నది గాన ≮ంత్ = ణ్, ≮ంట్ = న్ లకు అప్పకవి ప్రత్యేక యతిని చెప్ప నవసరములేదని సీతాపతిగారనుట సరియైనదె ≮ంత్ = ≮ంట్ లకు మైత్రిని ప్రత్యేక ముగా చెప్పనిచో బిందు మాత్ర ప్రయోగమున సమస్త హల్లులును సాజాత్యము లనవలసివచ్చును–కాగా ≮ంక్ = ≮ంచ్ ఇత్యాదులకు సైతము యతి మైత్రి నంగీకరించవలసివచ్చును ఇది అవాంఛనీ యము. అలాక్షణికమును. (13) క్ష = ≮క్ ల మైత్రి క్ష = న్ ల మైత్రి తిక్కనకంటె ప్రాచీనమైనది. జ్ఞకారములో గ, న ల ఉచ్చా రణ అత్యంత ప్రాచీనకాలములోనే ప్రవేశించినది. (చూ. ధ్వని –

లిపి – పరిణామం – సంయుక్తాలు.) పాల్కురికి సోమనాథాదులు
క్ష = క్క్ ల మైత్రి పాటించినారు (12) అప్పకవి వ బ ల కభే
దము చెప్పినాడు కాని వేదమునకున్న "వ బ యో రభేదః" అన్న
తత్త్వమును తెలుగు యతికి కారణముగా చెప్పుటలో ఔచిత్యము
లేదు ప్రథమ మీది వకారము తెలుగున వకారమగును – కావుననే
తొల్త ప వ లకు యతి చెల్లి క్రమముగా ఫ బ భ లకు వ్యాపించినది.
దీనిని దృష్టిలో నుంచుకొనియే అనంతుడు, లింగముగుంట తిమ్మకవి
ప్రభృతులు తమ లక్షణ గ్రంథములలో ప వ ల కభేదమును చాటి
వారు (16) గూఢస్వర యతిలో అనంతాదులు ఓకార పరకమైన
అత్వమునే గ్రహించినారు గాని ఏకార పరకమైన అత్వమును
సైతము గ్రహింపవలసి యున్నది ఇది "ఏఙః పదాన్తాదతి" అన్న
పాణిని సూత్రముచేత ప్రవర్తితమైన గూఢ స్వరమునకు యతి. ఏఙ్ –
అనగా ఏ ఓ లు కావున అనంతాదులు ఒక్క ఓకారమును మాత్రమే
గ్రహించుటలో ఔచిత్యము లేదు ఏకారము మీద గూఢమైన అత్వ
యతి ప్రయోగమునకు నాచన సోముని ఉత్తర హరివంశములోని
"ఆద్యరూపాయ విశ్వకర్త్రేఽక్షరాయ" (ఉత్త – హ – 8
ఆ. 219 వ దీని నొకప్పుడు రావూరి దొరస్వామిశర్మగారు చూపిరి.)
అన్న పద్యపాదమును లక్ష్యముగా గ్రహింపనగును ఏకారముపై
అత్వము గూఢము కాగా హల్లునకు సైతము ఉభయ వడిగా యతి
వేయుటయు కలదు, దీని కుదాహరణముగా "నిక్కమగు సుప్ర
యోగము ధిక్కృత దురితాయ భగవతేఽస్తు నమోయం
చక్కడ" ఇత్యాది (అనం ఛం-4 ఆ 29 ప) అనంతుని ప్రయోగ
మును గ్రహింపవచ్చును ఇది 'అన్యోన్య"లోని "న్యో"కారమునకు
యతి వేయుట వంటిది. వాగ్ఝరి వంటి రూపములకు వాగ్ఘరి వంటి
వికల్ప రూపములున్నవి ఇట్టివే జగన్మాత – జగద్మాత వంటివి.

ఇటువంటిచోట్ల వికల్పరూపము లుండగా హల్లులకు సంబంధించిన ఉభయ యతులు అనంతాదులు చెప్పుటలో ఔచిత్యము లేదు (చూ॰ ధ్వని-లిపి-పరిణామం సంయుక్తాలు) జగజ్జనకుడు-విస్మయము వంటి నిత్యరూపములు వెలయువానిలో గూఢ హల్లుకు యతి మైత్రి చెప్పుటలో ఔచిత్య మున్నదనిపించును గాని వాస్తవమునకు లేదు. ఇట్టి యతు లంగీకరించుచో రాముడతడు అన్నప్పుడు డ''తో సంధి వశాన గూఢమైన ఉత్వమునకు యతి నేల అంగీకరింపరాదన్న ప్రశ్న పొడమును. జగజ్జనకు డన్నప్పుడు చకారమునకు జకారాదేశము రాగా ఇక్కడ ఉకారమునకు అకారాదేశము వచ్చినది ఈ ఆదేశములో అజ్ఝల్లులను భేదముతప్ప మరెట్టి భేదమునులేదు రెండింటను గూఢత్వము సమానమే. పోనీ హల్లుల విషయముగా చూచుచో జూదము-జూజము పగలు-పవలు ఇత్యాదులలో జవలాదేశము కాగా గూఢమైన దగలకు యతి నంగీకరింపవలసివచ్చును. దానోఽహ మిత్యాదులలో స్వరము గూఢమైనను ప్రశ్లిష్టమై స్పష్టముగా కనిపించును కావుననే అట్టిచోట్ల యతి చెల్లుచున్నది (17) నిజమునకిది ప్రత్యేక యతి కానేకాదు ఈ బహుయతి నియతిని అనంతుడు సైతము చెప్పినాడు గాని తానే రెండుచోట్ల తన ఛందములోనే యీ నియమము నుల్లంఘించినాడు. బహుయతి నియతి సంయుక్తములకే గాని అజ్ఝల్లులకు పట్టదనుటలో ఔచిత్య ముండదుగదా!

> వృత్తములతోడఁ దరుణీమణులు గాన రుచు
>
> లింపుగను మంగళమహశ్రీ

(అనం. ఛం. 2 ఆ. 115 ప)

వా కౌకసుల వేలు నముచిసూదను పూజ

నతడు దా గైకొన్న నందగోపాత్మజుడు-

(అనం. ఛం. 3 ఆ. 57 ప.)

రెండవదానిలో "నతడు" అఖండ వళి యని త్రోసిపుచ్చ వచ్చును గాని మొదటిది త్రోసిపుచ్చుట కవకాశములేని ప్రయోగము. ఇంక సంయుక్త వర్ణములలో భిన్న యతులు కల ప్రయోగములు కోకొల్లలుగా లభింపగలవు. ప్రసిద్ధములైన అఖండవళు లను శ్రావ్యములైన వానిని నంగీకరింపక తప్పదన్న శ్రీ సీతాపతి గారి భావము శిరోధార్యము. చారిత్రకముగా పరిశీలించి ధ్వని పరిణతుల ననుసరించి ఋ-రు లకు - ఉ-వు లకును చెల్లు ఇత్యాది నూతన యతులకు లక్షణములు సృష్టింపవలసియున్నది.

యతుల విశేషములను గురించి సూక్ష్మముగా చర్చించిన అనంతరము శ్రీ సీతాపతిగారు లాక్షణికులు చెప్పిన ప్రాసలను గురించియు ప్రాస యతులను గురించియు సంగ్రహముగా వివరించినారు. అనంతునికంటె విశేషముగా అప్పకవి చెప్పిన ప్రాసము లేదు కలవని ప్రత్యేకముగా చూపించినారు. (1) "వేడుకొనియెద నంద్రాక బండ్లు దినుము" అన్న (అప్ప. 3 ఆ. 315 ప.) పాఠమును అంతకు పూర్వమున్న "పాండి......తంద్రి కృష్ణ" అన్న పాఠమును సరియైనవి కావు. "వేండు-పాండి" అన్న పూర్ణ బిందురూపములే గ్రాహ్యములు. ర ల సంయుక్త దకారములకును ర లు లేని దకారమునకును ప్రాస చెల్లునని చెప్పుటయే అప్పకవి ఆశయము. అర్థ బిందు

పూర్ణ బిందువులు ప్రాస మైత్రికి చెల్లునన్న భావముతో నది వ్రాయ లేదు. 314 వ. ప. గా నున్న "ర ల లు దమక్రింద జడ్డలై గ్రాలు వ్రాలు । ప్రాస వర్ణంబులై వాని బాసియైన । బాడియైనను...... నిలచు" నన్నదే లక్షణము. ఇక్కడ పూర్ణానుస్వారబిందువుల ప్రసక్తి లేదు. ఇట్టి ప్రాసను అనంతుడును ఉభయ ప్రాస అను పేరున (అనం.ఛం. 1 అ. 53-54 వ.) పేర్కొన్నాడు. "చూడగ లకార రేఫలు గూడు డకారంబు..." ఇత్యాది లక్షణ పద్యమునకు లక్ష్యముగా "పాండి మరగి ... వాండ్రిల వ్రేతలు... కృష్ణుండ నీకు ... పండ్లు నిచట" ఇత్యాది పద్యమిచ్చినాడు. ఈ ప్రాసను లింగమగుంట తిమ్మకవి చిత్ర కవి పెద్దన ప్రభృతులు కూడ చెప్పినారు. (2) "లోక, (భా) పాక్లి ప్తకు" అని ముద్రణస్ఖలిత్యము దొర్లినది. "లోక, (భా) పాక్ల్ప్త"కు అన్నది సరైన పాఠము – వాస్తవమున కప్పకవి దీనిని ప్రత్యేకముగా పేర్కొనవలసిన అవశ్యకత లేదు. ఋ ఌ వర్ణముల కున్న సవర్ణత్వముచేత ఋ ప్రాస విధిలోనే అంతర్భూతమైనది. "అమరు నన్యోన్యమును ఋయుతాయుతము" లన్న అనంతాదుల లక్షణము ఌయుతాయుతములకును గాను నన్వయించును. ఇట్టి ప్రాసములన్నియు శబ్దస్వరూప స్పష్టప్రతిపత్తికి తప్ప మరెందుకును నుపయోగపడవు. (4) తమ్ములు...(భ)క్తిమ్మర (భక్తిన్ + మురు) లకు చెల్లు ఈ ప్రాససైతము అప్పకవి ప్రత్యేకముగా చెప్పవలసిన పనిలేదు. భక్తిన్ + మురు అన్నప్పుడు నకారమునకు మకారాదేశము వచ్చుట వ్యాకరణ సంధివిశేషముగాని ప్రాసవిశేషముగా దీనిని చెప్పుట కవకా శము లేనేలేదు. సహజ మకారమునకు నకారాదేశ మకారమున కును ప్రాస చెప్పుట విశేషమన్నచో సంధివశమున ఆదేశముగ వచ్చు గజ డద బాదులకును సహజ శాబ్దిక వర్ణములకును ప్రాస చెల్లునని

ప్రత్యేకముగా చెప్పుకొనవలసివచ్చును. ఆంధ్ర చ్ఛందో గ్రంథములను తరచి చూచి ఈ విధముగా యతి ప్రాసములకు సంబంధించిన విశేష ములను చారిత్రకమైన పరిశీలనతో త్రిలిఙ్గ, ఆంధ్రప్రభ, ఆంధ్ర సాహిత్యపరిష త్పత్రిక – సుభాషిణి పత్రికలలో 1950–1951–1952 సంవత్సరములలో దాదాపు అరవది వ్యాసములు వ్రాసినాను. కొన్ని విషయములు నా ధ్వని–లిపి–పరిణామములో సందర్భ వశ మున తెల్పినాను. అనేక వృత్త విశేషములను గూడ కొన్ని వ్యాస ములలో ఇటీవలనైతము తెల్పినాను. వాటి నన్నిటిని ఇక్కడ వివ రించుటకు అవకాశము లేదు.

యతి ప్రాసములు తెలుగు భాషకెంతటి అలంకారములో దేశి చ్ఛందోరీతులును తెలుగు భాషకంతటి అలంకారములు. ప్రాచీన చ్ఛందోగ్రంథములలో దేశిపద్యములు లక్షణ లక్ష్యములతో వివరింప బడినవి. కానిసరియైన సమగ్రమైన సశాస్త్రీయమైన పద్ధతిలో దేశిఛంద శ్శాస్త్రమును ముందెవ్వరునురచింపనేలేదు. మాత్రాబద్ధముగా వివిధ గతులలో విశ్వరూపముదాల్చగల యిటువంటి దేశిఛ్ఛందోరీతులను వివ రింపబూనుట సర్వసామాన్యమైన విషయముకాదు. ద్విత్ర్యాది మాత్రా బద్ధ పదప్రయోగాది పరిపూర్ణానుభవ జ్ఞాన మామూలాగ్రముగా నుండవలెను. లయగతిజ్ఞానమతి వేలముగా నుండవలెను. అప్పుడు గాని దేశి ఛందోరీతులను వివరించు శక్తి యేర్పడదు. శ్రీ సీతాపతి గారు ఛందోరీతులకు కావలసినంతగా లయగతిజ్ఞానము నలవరచు కొన్నవారు. సినీమా నాటకాదిరంగములలో చిన్నతనముననే అనుభ వము గడించినవారు. కాగాసహజముగనే వీరికిసంగీత జ్ఞానమలవడినది. దేశి ఛ్ఛందోరీతులకు ప్రాధాన్యమిచ్చి మార్గ వృత్తాలు సైతము ఈ

రీతులలో అంతర్భూతములగు నంతటి బృహత్తరమైన నూతన ఛందోగ్రంథము వ్రాయవల'న్నది ఇటువంటి పద్ధతిలో గ్రంథము వ్రాయవలెనని చాల కాలముగా నేను ఆలోచించుచుంటిని. ఈ ఆలోచన తొలుత నాకు కలిగించిన వారు కీ॥ శే॥ శ్రీ గాడిచర్లహరి సర్వోత్తమరావుగారు. ఇటువంటి ఛందము వ్రాయవలెనని తరచుగా శ్రీ చిలుకూరి నారాయణగారు, శ్రీ గాడిచర్ల వారితో అనుచుండెడి వారట. ఆ విషయము చెప్పి దానిని నీవు చేబట్టుమని శ్రీ హరి సర్వోత్తమరావుగారు హెచ్చరించి నాబుర్రలో ఒక మెరుపుతీగను పడవేసినారు. లక్షణ సృష్టికి ముందు లక్ష్యసృష్టి చేయవలెగదా అని నేను వివిధ దేశి ఛ్ఛందోరీతులలో "పర్జానీతి" వ్రాసినాను. ఇందులో అనేక గతులు సృష్టించినాను. తరువాత "వేదనాదము"లన్న పేరఋగ్వేదము చాలవరకు వివిధలయయుక్తాలైన వృత్తములలోను కేవల నూత్న దేశి ఛ్ఛందములలోను వ్రాసినాను. ఇంకను వ్రాయుచున్నాను. ఇట్లుండగా 10 నెలల నాడు సాహిత్యాభిమాని నివురు గప్పిన నిప్పు వంటి రచయితయునగు శ్రీ పి. రాజగోపాలనాయుడు (చిత్తూరు) M. L. A.గారు మా యింటికి వచ్చి నా రచనలు చూచినారు. భిన్న భిన్న గతులలోనే చేయుచున్న రచనలు చూచి వారు దేశి ఛ్ఛందోగ్రంథరచన ఆవశ్యకత గురించి తమలో ఉన్న తలంపును దానికై ఛందశ్శాస్త్ర పరిచయము లేకున్నను - భిన్నమాత్రకములైన గేయములు తాము సేకరించిన తీరును వివరించినారు. ఆ ఛందోగ్రంథము రచించవలసినదిగా నన్ను ప్రోత్సాహపరిచినారు. కొద్దికాలముననే శ్రీ సీతాపతిగారి ఛందోరీతులు గ్రంథమునకు సాహిత్య ఎకాడమీ వారు బహుమతి ప్రకటించినారు. ప్లవ ఉగాది సాహిత్య గోష్ఠి సందర్భముగా శ్రీసీతాపతిగారు ఆలిండియా రేడియో స్టేషనుకువచ్చినారు.

అప్పుడు నాతో శ్రీసీతాపతిగారు 'మనదేశంలో ఛందస్సులో ప్రత్యేక పరిశ్రమచేసిన వాళ్లులేరు. మీరుచాలా పరిశ్రమచేశారు. నిడదవోలు వెంకటరావు రావూరి దొరసామిశర్మ గార్లున్నారు. కాని వారు యతి ప్రాసలలో తప్ప తక్కిన వాటిలో లోతుగా పరిశ్రమ చెయ్యలేదు. ఈ పోటీకి మీరు వ్రాస్తారేమో అనుకున్నాను నా పుస్తకం మీరు ఆమూలాగ్రంచూడాలి. మీది రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిది అభిప్రాయం తీసుకొనదలచాను'. అన్నారు. దానిపై "మీ పోటి వారిని ప్రధాన సంపాదకులుగా పెట్టి మా పోటి వాళ్ళను కలిపి సంఘంగా వేసి బృహత్తరమైన ఛందోగ్రంథం సమగ్రంగా వ్రాయించి ఉంటే బాగుండేది." అని నేను అన్నాను. ఆ తరువాత శ్రీ సీతాపతిగారి గ్రంథము వ్రాత ప్రతి చూచినాను. అందులో నూతన దేశిచ్ఛందస్సును నిర్మింపవలసిన అవశ్యకత గురించి వారు వ్రాయుట చూచిన నాకుచాల ఆశ్చర్యమును సంతోషమును కలిగినవి, దేశిఛ్ఛందమును ఏ పద్ధతులలో రచింపవలెనో తెల్పుచు శ్రీ సీతాపతిగారు ఆరవ ప్రకరణము వ్రాసినారు. అత్యంత సూక్ష్మములైన సూత్రములు కొన్ని యీ దేశిచ్ఛందోరీతుల లక్షణములు సృష్టించుటలో నున్నవి. మార్గఛ్ఛందములో ఉద్ధురమాలా వృత్తాదులు కాక పుట్టిన సమ-అర్ధ సమ విషమ వృత్తాలన్నియు 185108273989 272314-అని గదా తేలినది. కాని యీ సంఖ్యకు రెట్టింపుగా-మార్గ ఛ్ఛందములన్నియు నంతరుభూతములగునట్లుగా- దేశిమాత్రాఛ్ఛందములను సృష్టించుటకు అవకాశము లున్నవి. కోటాను కోట్లుగా రూపొందగల యీ దేశిఛ్ఛందోరీతులను మామూలు త్ర్యస్ర చతురస్ర-ఖండ-మిశ్రగతులలోనే భిన్న భిన్నములుగా సృష్టింపవచ్చును. దేశిచ్ఛంద ప్రస్తారమును

శ్రీ సీతాపతిగారు లఘువులతో ప్రారంభించినారు. మార్గ ఛ్ఛంద స్సంద్రైనను మహేశ్వరుని మూడవకంటి నుండి ఉద్భవించినదన్న కారణముగా మగణమునకును తత్కారణముగా గురువునకును ప్రాముఖ్యమిచ్చి గురువు క్రింద లఘువుగా ప్రస్తారమును ప్రాచీనులుసృష్టించినారే గానిఅట్లే చేయవలెననువిధిలేదు. లఘువులాదినుంచి మార్గఛ్ఛందములో గూడ ప్రస్తరించవచ్చును. ఇది ప్రస్తారమునకె పరిమితము. తక్కిన వృత్త సంఖ్యాది ప్రత్యయములకు మారుగా - దేశిఛ్ఛంద సంఖ్యాది ప్రత్యయములను (నూతనఉద్దిష్టాదులు) సృష్టింపవలసిన అవసరమున్నది. ఈ సృష్టి అతిక్లిష్టమైనదైనను అసాధ్యమైనది మాత్రము కాదు. ఈ ప్రత్యయముల సృష్టిలోని క్లిష్టత్వము దేశిఛ్ఛందోరీతులలోని వైశాల్యమును బట్టియేర్పడును. ఏదియేమైనను ఈ ఛందోరీతులలో దేశిఛ్ఛందోరీతుల విషయమై శ్రీ సీతాపతిగారు ఆరవ ప్రకరణము రచించి నా గుండెలలో కొండంత ఉత్సాహమును-ఆశను-కలిగించినారు. శ్రీ సీతాపతిగారు భగవంతుని దయవల్ల దీర్ఘాయుష్మంతులై యిటువంటి ఛందోగ్రంథము వ్రాయవలెనని హృదయ పూర్వకముగా ప్రార్థించుచున్నాను. శ్రీ సీతాపతిగారే వ్రాయుచో నెంతటి గ్రంథము వ్రాయుదురో గాని నాకు మాత్రము బృహత్తరమైన గ్రంథమును నేనే నిర్మింపగలనన్న ధైర్యముకలిగినది. ఇటువంటి దేశిఛ్ఛందో గ్రంథసృష్టి జరుగుచో తెలుగుజాతి జీవము, రాగము, తెలుగుతనము, తెలుగు వెలుగు కలకాలము నిలుచునని చెప్పవచ్చును.

శ్రీ సీతాపతిగారన్నట్లుఆంధ్రదేశములో ఛందశ్శాస్త్రములో సమగ్రమైన పరిశ్రమచేసినవారు ముప్వురైననుతేరు కొన్ని కొన్ని భాగములలో పరిశ్రమచేసిన వారు ఇద్దరు ముగ్గురున్నారు. సమగ్ర

మైన పరిశోధన కావించిన వారిలో వయస్సు చేత నేకాక అనుభవము చేత కూడ శ్రీ సీతాపతిగారగ్రగణ్యులనుట పరమసత్యము. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారు ఆంధ్రఛందోరీతులపై గ్రంథ రచనకు పోటీ పెట్టి 2,000రు। బహుమానమును ప్రకటించుటయు శ్రీ సీతాపతిగారు గ్రంథరచన చేసి పోటీకి పంపుటయు సాహిత్య ఎకాడమీ వారు బహుమతి ప్రకటించుటయు గొప్పగా చెప్పుకొనవలసినవి కావు. శ్రీ సీతాపతిగారిచే ఛందోరీతుల గ్రంథరచనకు ఎకాడమీ వారు నియమించి యింతకన్న బృహత్తరమైన గ్రంథ రచన కుపక్రమింపజేసియున్నచో చాల ప్రశంసనీయముగా నుండెడిది. దేశములోనున్న నలుగురైదుగురు ఛందశ్శాస్త్ర పరిశోధకులను కలిపి ఒక సంఘముగా నియమించి శ్రీ సీతాపతిగారి ప్రధాన సంపాదకత్వము క్రింద బృహత్తరమైన సమగ్రఛందోగ్రంథమును వెలయింపచేసి యున్నచో మరింత బాగుగానుండెడిది. బహుమతులు పోటీ సాహిత్యాభిరుచిని-గ్రంథపరిశీలనాభిలాషను–పెంపొందించుటకే గాని సృజనాత్మకములును, పరిశోధనాత్మకములును, మౌలికములునగు గ్రంథములను రచింపజేయుటకు కాదు. పోటీకైనను సిద్ధపడి శ్రీ సీతాపతిగారు ఈ "ఛందోరీతులు" గ్రంథము రచించినారనగా అది ఎకాడమీవారి అదృష్టము ఆంధ్రసాహితీ పిపాసువుల మహాభాగ్యము. 44సంవత్సరముల కాలముతో అనుభవముతో నాకంటె ప్రవృద్ధులైయున్న శ్రీసీతాపతిగారు యువతరములోనున్న నన్ను ఈ ఛందోరీతులు గ్రంథమునకు "పరిచయము" వ్రాయుడని కోరి గౌరవించినందుకు కృతజ్ఞుడను. X వ పుట 15 పంక్తి-అన్నాడు కాదు- ఉన్నాడు- XVవ పుట. 12 పంక్తి. 'డు' గురువగునని– అని సవరించు కొనదగు. XXviiవ పుట 18వ పంక్తిలో 'ఆవశ్యకత లేదు' అన్న దాని తరువాత

'ఋ ఌ యుక్త అయుక్తములను సంయుతాసంయుత ప్రాసలో చేర్చుట అనావశ్యకము' అన్న వాక్యము చేర్చుకొన వలెను. సత్యాన్వేషణ పరులైన సీతాపతిగారి విశాల హృదయములో సంకుచిత భావములకును ఈర్ష్యాద్వేషములకును అసహనమునకును తావులేదని చెప్పుటకు నా చేత గ్రంథపరిచయము వ్రాయించుట కన్న నా ప్రత్యక్షస్వానుభవముకన్న మరేమిసాక్ష్యము కావలెను? 1950లో నేను అనంతుని ఛందమునకు శ్రీసీతాపతిగారు వ్రాసిన ఉపోద్ఘాతముపై కొన్ని విమర్శన వ్యాసములు వ్రాసినాను ఆ వ్యాసములు ప్రచురితములవుచున్నప్పుడు మద్రాసులో నున్న కొందరు పండితులు శ్రీ సీతాపతిగారి వద్దకువెళ్ళి "మీ ఉపోద్ఘాతంమీద గోపాలకృష్ణయ్యగారు విమర్శలు వ్రాస్తున్నారు. మీరు ఊరుకున్నారేం?" అని ప్రశ్నించినారట. "అవును నన్నేంచెయ్యమంటారు? ఆయన వ్రాస్తున్న విషయాలు సరైనవే, ఉన్నవిషయాన్ని ఒప్పుకుంటే తప్పేముంది?" అని సీతాపతిగారు సమాధానము చెప్పినారట. ఇంతకు మించి సీతాపతిగారి నిష్పాక్షికమైన తులనాత్మకమైన సత్యాన్వేషణ పరతత్త్వమునకు సాక్ష్యము మరేమి కావలయును? అమృతహృదయులైన శ్రీ సీతాపతిగారి సత్యాన్వేషణ ఫలితమై బహుళపరిశ్రమ ప్రతిబింబమైన యీ ఛందోరీతులనేతుల గుబాళింపులను ఇంక చవి చూడుడు.

ప్లవ ఆషాఢము<br>వ్యాసపూర్ణిమ

వాఙ్మయమహోధ్యక్ష<br>వడ్లమూడి గోపాలకృష్ణయ్య.

—:o(o)o·—

# శుభవార్త



దాదాపు యాభై సంవత్సరాలనుంచీ శ్రీ గిడుగు సీతాపతి గారి "ఛందోరీతుల" ప్రసంగాలు వింటూ వచ్చాము. ఎప్పటికప్పుడు వారు సంగ్రహించిన విషయాలకు ఆశ్చర్యపడుతూ ఉండేవారము. ఇంత విషయమూ ఏవో కొన్ని వ్యాసాల రూపంగానూ ఈ ప్రసంగాల రూపంగానూ ఉండిపోవలసిందేనా అని విచారించుకుంటూ ఉండేవారము. ఎందుచేతనంటే వారు చేసిన పరిశ్రమ కేవల సారస్వత పరిశోధకులు చేయజాలినది కాదు; సాహిత్య సంగీతాలలో చక్కని ప్రవేశమున్న కుశాగ్రబుద్ధులు మాత్రము చేయగలిగినది. అటువంటివారు మనలో చాల అరుదు శ్రీ వాఙ్మయ మహోధ్యాకులు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు ఏ ముగ్గురో నలుగురో ఉంటారు. వారయినా ఆర్థికంగా లాభదాయకము కాని ఈలాంటి గ్రంథరచనకు గాని ప్రచురణకు గాని పూనుకోజాలరు.

కీర్తిశేషులు బంకుపల్లె మల్లయ్య శాస్త్రిగారు మన కావ్యాలలోని పద్యాలను లయబద్ధంగా (తాళం వేస్తూ) చదివేవారు. పిఠాపుర వాస్తవ్యులొకరు (పేరు మరచిపోయాను) వసుచరిత్ర అంతా సంగీతశాస్త్రముకోసము వ్రాసినదే అని రుజువు చేయడానికి పరిశ్రమ చేశారు. అదంతా ఒక 'సర్కస్' అన్న భావంతోనే చూచి ఆనందించేవారము.

శ్రీ సీతాపతిగారి పరిశ్రమ అలాంటిది కాదు. ఛందోరీతులకూ సంగీతానికి అవినాభావ సంబంధ ముందనీ, ఆ రెంటి సమ్మేళనము కలిగినప్పుడే పద్యము శ్రావ్యంగా ప్రచారంలోనికి వస్తుందనీ, శాస్త్రరీత్యా నిర్ధారణచేసి చూపించారు. దీనిలో తమకు గల బహు భాషా పాండిత్యమూ, గణితశాస్త్ర పరిచయమూ, సంగీత విజ్ఞానమూ అన్నిటిని రంగమునకు తెచ్చి వారు ఈ మహాకార్యము సాధించారు, కృతకృత్యులయి ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులయారు, ఇటువంటి గ్రంథము ఆంధ్ర సరస్వతీ భాండాగారము నలంకరించినట్టి అవకాశము కలుగజేసిన ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీవారు అభినందనీయులు.

దీనిలోని గ్రంథపరిచయమువల్ల వాఙ్మయ మహాధ్యక్షులు గూడ ఈ విషయములో గట్టి పరిశ్రమ చేసినట్టు తెలుస్తున్నది. ఇప్పుడీ గ్రంథమున కెక్కని కొన్ని విషయాలు వారి దగ్గరున్నట్టు గ్రహించవచ్చును. ఇట్టి విషయాలు ఇంకా వారు చెప్పిన యితర "ఇద్దరు ముగ్గురు" దగ్గరగూడ ఉండవచ్చును. అందుచేత, శ్రీ సీతాపతిగారూ మహాధ్యక్షులూ ఆ యితరులూ సంప్రతించుకొని ఈ గ్రంథానికి అనుబంధ రూపంగా తమ క్రొత్త విషయాలను ప్రచురించడం మంచిదనుకుంటాను. అప్పుడు "తెలుగులో ఛందోరీతులు" సర్వాంకషంగా ఉండగలదు. లేదా, సాహిత్య ఎకాడెమీవారే ఈ ముగ్గురు నలుగురను ఒక కమిటీగా వేసి, వీరందరిదగ్గర నున్న విషయాలతోనూ సిద్ధాంతాలతోనూ ఒక సమగ్రమయిన ఛందోరీతుల గ్రంథాన్ని దేశీ ఛందోలక్షణ గ్రంథాన్ని సిద్ధము చేయించడం సమంజసము. ఈ కార్య

నిర్వహణకు కావలసిన ఆర్థికాది సాహాయ్యము సాహిత్య ఎకాడెమీ వారు చేసినప్పటికీ అది వ్యర్థ వ్యయము కానేరదు.

ఛందస్సన్నది ఎంత అగాధమైన విషయమో మన సాహిత్య పరులకు సాధారణంగా తెలియదు. మన కవులకు తెలిసినది గూడ అత్యల్పము. ఈనాటి గేయ రచయితలు గూడ - చాల మంది - ఏదో వరుస ననుసరించి వ్రాస్తారు. వాటిలో అనేక రచనలు చాలా మనోహరంగా ఉన్నాయి. కాని, వారికి ఈ ఛందశ్శాస్త్ర దృష్టి ఉన్నదని చెప్పలేము. అటువంటివారు గూడా ఈ విజ్ఞానము సమకూర్చుకుంటే, ఇంతకంటే మనోహరంగా ఉండగల ఏ 'రత్నాల సరాల' నో నిర్మించగలుగుతారని ఆశిస్తాను. ముత్యాల సరాల సృష్టికి ముందు మహాకవి గురుజాడ ఈ ఛందస్సముద్రాన్ని ఎంతగా మథించాడో ఆ మహాత్ముడికే తెలియును. ఎన్ని ప్రస్తారులు చేసి, ఎన్నింటికి మాటలు కూర్చి పరీక్షచేసి, తుదకా నిర్ణయానికి వచ్చాడో చెప్పలేము.

స్వానుభవమొకటి: బి. ఏ. ప్యాసయి కళ్లికోట కాలేజీలో ఉపాధ్యాయుడుగా ఉన్నప్పుడు '60 ఏండ్లక్రితం' ఇంగ్లీషులో ఉన్న **Blank Verse** లాంటిది తెలుగులో ఉంటే పద్య కథలు వ్రాసి విద్యార్థులకు పరీక్షలో ఇవ్వవచ్చుగదా అని నేనూ, కీ. శే. వేమూరి నరసింహశాస్త్రిగారూ ఈ ప్రస్తారాలలో వేలు పెట్టాము. రెండు నెలలు అదే పనిగా గడిపాము. ప్రయోజనము లేకపోయింది. బహుశా మాకు సంగీత పరిచయము తక్కువవడంచేతనే అనుకుంటాను. అప్పుడు తెలిసింది ఈ 'కీకారణ్యా' భయంకర రూపము. వేలు చూపితే మని

షినే మింగివేసే మొసలిలాగ కనిపించింది. దీనితో వేగలేమని ఆ ప్రయత్నం విరమించుకున్నాము. (చిత్ర గీతమాలిక అని ఆటవెలది తేటగీతలు అవసరప్రకారం మార్చి రోకటి పాటలాగుండకుండా చేసి పద్యకథలు వ్రాసుకున్నాము.) అంత విసుగును కలుగజేసే ఈ ఛందో విషయాన్ని ఇన్నేళ్లూ ఎడతెగని పరిశ్రమచేసి, ఇంత విషయాన్ని సంగ్రహించి, సమన్వయానికి అనుకూలమయిన సిద్ధాంతాలు చేసి, ఈ రూపంగా " తెలుగులో ఛందోరీతులు " ఆంధ్ర సారస్వతానికి ప్రసాదించిన శ్రీ సీతాపతిగారికి ధన్యవాదాలు.

హైదరాబాద్<br>17-8-61

తాపీ ధర్మారావు.



# ఛందోరీతులు

" ఛందోహీనో న శబ్దోఽస్తి నచ్ఛందశ్శబ్దవర్జితమ్॥ "

అనగా, ఛందస్సునకు కట్టుపడని శబ్ద ముండదు; శబ్దము లేకున్న ఛంద స్సుండదు అని అర్థము.

విస్పృతార్థద్యోతక మయిన పదబంధము రెండు విధములుగా నుండును: (1) పద్యము; (2) గద్యము. పద్యము ఛందోబద్ధము. అక్షరసంఖ్యానియమము గాని, గురులఘునివేశనియమము గాని లేక కేవలము అర్థాపేక్ష మాత్రమే కల పదబంధము గద్యము. భరతుడు తన నాట్యశాస్త్రములో పద్యముగా నున్నది నిబద్ధమనియును గద్యముగా నున్నది చూర్ణ మనియును పేర్కొనెను.

పద్యలక్షణమును తెలియజేయునది ఛందశ్శాస్త్రము. ఇది వేదాంగములలో నొకటిగా పేర్కొనబడినది. వేదపురుషుడు ఆఱు ప్రధానాంగములతో ప్రకాశించును. శిక్ష నాసగాను, నిరుక్తము చెవులుగాను, ఛందము చరణయుగముగాను, కల్పము కరయుగ్మముగాను, జ్యోతిషము నేత్రయుగళముగాను, వ్యాకరణము వదనముగాను వేదపురుషునకు అమరి యున్నవి. "పురుషుఁ డఖిలాంగయుతుఁ డయ్యుఁ జరణయుగము లేక నడవ సమర్థుఁడే లోకమునను?" కనుక "వేదమునకుఁ బాదంబులై వెలయుకతన ఛంద మన్నిటలో నవశ్యంబు గాదె?" అని అప్పకవి నుడివెను.

" ఛందాంసి ఛాదనాత్ " — ఇది యాస్కుని నిర్వచనము. అనగా భావాలకు ఛందస్సు తొడుగువంటి దని అర్థము. 'ఛద్' అను ధాతువుతో సంబంధము గలదిగా యాస్కుడు నిర్వచించెను. కాని సంతసిల్లు, సంతసింపజేయు అను నర్థము గల 'ఛంద్' ధాతువుతో

సంబంధము గలదిగా ఛందశ్శబ్దము నిర్వచనీయ మని వా యభి ప్రాయము.

పద్యము గురులఘ్వక్షర నిబద్ధము. ఏక మాత్ర గలది లఘువు; ద్విమాత్రాయుతము గురువు. ఒక గురువు రెండు లఘువు లకు సమానము. గురులఘుభేదము ఉచ్చరించుటకు పట్టు కాలమును తెలియజేయుటకయి చెప్పబడెను. గురువునకు గుర్తు చిహ్నవలయము లోని క్రింది యర్ధభాగము ( ᑌ ). లఘువునకు గుర్తు చిహ్న నిలువు గీత ( | ).

'వృత్తము' ఒక ప్రత్యేకలక్షణము గల పద్యము. ఇందు అక్షరసంఖ్యానియమము ప్రధాన మయినది. దానితోపాటు గురు లఘ్వక్షరనియమము కూడ గలదు. వృత్తములు మూడు విధము లయినవి: 1. సమవృత్తములు, 2. అర్ధసమవృత్తములు, 3. విషమ వృత్తములు. ప్రతి వృత్తమందును నాలుగు పాదములు గలవు. సమవృత్తములలో నాలుగు పాదములును అక్షర సంఖ్యావిషయము లోను, గురులఘ్వక్షరక్రమములోను ఒకే విధమున నుండును. అర్ధసమవృత్తములలో మొదటి పాదము మూడవ పాదము ఒక తీరుగాను, ఇందుకు భిన్నమైన రీతిగా రెండవ పాదము, నాల్గవ పాదము ఉండును. విషమ వృత్తములలో నాలుగు పాదములును నాలుగు భిన్న మయినరీతుల నుండును. ఇంకను ఈ వృత్తములకు సంబంధించిన అంశములు వృత్తప్రకరణమున తెలియజేసెదను.

పద్యములలో వృత్తములే కాక జాతులు, ఉపజాతులు గలవు. కందాదులు జాతులు; గీతాదులు ఉపజాతులు. వీటిలో అక్షర సంఖ్యానియమము లేదు. గురు లఘ్వక్షరక్రమనియమము లేదు. కాని, పద్యము లన్నిటికిని గణనియమ మున్నది. వృత్తములకు

కావలసిన గణములు త్రికములు. త్రికమనగా మూడేసి అక్షరములు గల గణము. జాత్యుపజాతులకు కావలసినవి ఈ త్రికములలో కొన్ని మాత్రమే కాక మరి కొన్నియును కావలెను. వాటికి ఉపగణము అని పేరు. త్రికము లయిన గణములు ఎనిమిది సరిగా ఎనిమిదే కాని అంతకెక్కువయు కాదు, తక్కువయు కాదని లెక్కించి తెలిసికొనగలము. ఎట్లనగా: త్రిక మనగా మూ డక్షరములు గలది గదా? అందులో ప్రతియొక అక్షరమును గురువో లఘువో కాగలదు. అనగా మొదటి అక్షరము రెండు విధము లయినది. రెండవ అక్షరమును రెండు విధము లయినది. అట్లే మూడవ అక్షరమును రెండు విధములయినది.కనుక 2 × 2 × 2=౮ విధముల త్రికము లేర్పడినవి. బీజగణితసూత్రమును బట్టి కూడ ఈ విషయము గుర్తించవచ్చును;-

(గు + ల) = 1 గు$^3$ + 3 గు$^2$ ల$^1$ + 3 గు$^1$ ల$^2$ + ల$^3$

గు=గురువు; ల=లఘువు; 3 త్రికము; గు$^3$ అనగా మూడక్షరములును గురువులుగా నుండిన గణము ఒక్కటి; 3 గు$^2$ ల$^1$ అనగా రెండు గురువులును ఒక లఘువును చేరిన గణములు 3; 3 గు$^1$ ల$^2$ అనగా ఒక గురువును రెండు లఘువులును చేరిన గణములు 3; 1 ల$^3$ అనగా మూడక్షరములును లఘువులుగా నుండిన గణము ఒక్కటి– వెరసి (1+3+3+1) 8.

గణప్రస్తారము చేసి కూడ ఈ విషయమును తెలిసికొనవచ్చును.

ప్రస్తార విధానము:

మొదటి చాలున మూడు గురువుల గుర్తులుంచవలెను- UUU

రెండవ చాలున మొదటి గురువు క్రింద లఘువు గుర్తు;
తర్వాత మీది నున్నట్లే- IUU

మూడవ చాలున లఘువుక్రింద గురువు గుర్తు, గురువు క్రింద లఘువు గుర్తు. లఘువు కనబడగానే ఆ తర్వాత మీద నున్నట్లే— U U

నాల్గవ చాలున గురువు క్రింద లఘువు; లఘువు రాగానే మీదనున్నట్లే— I I U

అయిదవ చాలున లఘువు క్రింద గురువు, లఘువు క్రింద గురువు; గురువు క్రింద లఘువు— U U I

ఆఱవ చాలున గురువు క్రింద లఘువు ఆ తర్వాత మీద నున్నట్లే— I U I

ఏడవ చాలున లఘువు క్రింద గురువు; గురువు క్రింద లఘువు ఆ తర్వాత మీద నున్నట్లే— U I

ఎనిమిదవ చాలున గురువు క్రిందను లఘువు ఆ తర్వాత మీద నున్నట్లే— I

## ప్రస్తరించుటలో చూడ దగిన అంశములు :-

ఏ చాలు నందైనను లఘువు గుర్తు పెట్టిన తర్వాత తక్కిన స్థలములందు మీద నున్నవే పెట్టవలెను గాని మరి మార్చరాదు. మొదటి అక్షరస్థానములో ఒక గురువు క్రిందను ఒక లఘువు చొప్పున మారు చుండును; రెండవ అక్షరస్థానములో రెండు గురువులక్రిందను రెండు లఘువులచొప్పున మారుచుండును మూడవ అక్షరస్థానములో 4 గురువుల క్రిందను 4 లఘువులు చొప్పున మార్పు కనబడును. బీజ గణిత సూత్రములో చెప్పినట్లు మూ డక్షరములున్నూ గురువులయిన గణము ఒక్కటే. దానికి మగణ మని పేరు. అది ప్రస్తార పంక్తులలో మొదటిది. రెం డక్షరములు గురువులుగాను ఒక అక్షరము లఘువుగాను ఉన్న గణములు మూడు; అవి ప్రస్తారక్రమ

ములో రెండవది — IUU — దీని పేరు యగణము; మూడవది- UIU - దీని పేరు ర గణము; అయిదవది - UU - దీని పేరు 'త'గణము. ఒకక్షరము గురువు గాను రెండక్షరములు లఘువులు గాను ఉన్న గణములు మూడు; అవి ప్రస్తారక్రమములో నాల్గవది — U- దీని పేరు 'స'గణము; ఆఱవది— IU - దీని పేరు 'జ'గణము; ఏడవది- U దీని పేరు భగణము. ఇక మూడక్షరములున్ను లఘువులయిన గణము ఒక్కటే;. -దానికి 'న'గణమని పేరు; అది ఎనిమిదవది. ఈ గణముల పేళ్లకు మొదటి అక్షరములే సాంకేతికములు : మ, య, ర, స. త, జ, భ, న.

ఈ ఎనిమిది గణముల తీరును జ్ఞప్తియందుంచుకొనుటకు ఒక శ్లోకము గలదు :-

"ఆదిమధ్యావసానేషు 'య' 'ర' 'తా' యాన్తి లాఘవమ్ ।
'భ' 'జ' 'సా' గౌరవం యాన్తి 'మ' 'నౌ' తు గురు లాఘవమ్"

అనగా 'య' గణమునకు మొదటి అక్షరము, 'ర' గణమునకు రెండవది, 'త' గణమునకు మూడవది లఘువుగా నుండును; తక్కినవి రెండును గురువు లన్నమాట, 'భ' గణమునకు మొదటి అక్షరము, 'జ' గణమునకు రెండవది, 'స' గణమునకు మూడవది గురువుగా నుండును; తక్కిన రెండక్షరములును లఘువు లన్నమాట. 'మ' గణము మూడు గురువులు గలది; 'న' గణము మూడు లఘువులు గలది.

ఈ ఎనిమిది గణములును గాక మఱి నాలుగు గణములు గలవు; అవి రెండు అక్షరములు మాత్రమే కలవి :-

UU — 'గగ'; సంస్కృతములో 'గా'.

IU — 'లగ'ము; 'వ' గణము.

U I – 'గల'ము; 'హ' గణము.

I I – 'లల'; సంస్కృతములో 'న్ల'.

వృత్తములు అక్షరసంఖ్యానిబద్ధములు కనుకను, పాదమునకు 1 మొదలు 26 వఱకును అక్షరములు గల వృత్తము లుండును గనుకను వృత్తములను 26 తరగతుల క్రిందను పేర్కొన వలసి యున్నది. ఆ తరగతులకు ఛందము లని పేరు. ఆ 26 ఛందముల కును నిర్దిష్టము లయిన పేళ్లు గలవు.

అది ఎన్నవ ఛందమో అన్ని యక్షరములే ఆ ఛందమున బుట్టిన సమవృత్తము లందలి ప్రతిపాదమందును ఉండునని గ్రహించ వలెను.

ఉదా॥ శార్దూల విక్రీడిత 19వ ఛంద మయిన అతిధృతి యందు పుట్టినది కనుక అందలి ప్రతిపాదమునకును పందొమ్మిదేసి అక్షరము లుండును:-

కస్తూరీ తిలకం లలాట ఫ ల కే వ క్ష స్థ లే కౌస్తుభమ్
1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19

తెలుగు భాషలో రచించిన శార్దూల విక్రీడితలో కూడ 19 అక్షరములే కలవు:-

అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యని ధి నే న జ్ఞాన నై పల్కితిన్।
1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19

ఏ ఛందమున నెన్ని సమవృత్తములు పుట్టునో తెలిసికొనుటకు 4 మార్గములు గలవు.

ఉ॥ ఆఱవ ఛంద మైన గాయత్రిలో ఎన్ని సమవృత్తము లుండును?

(1) $(\text{గు}+\text{ల})^6 = \underline{1}\ \text{గు}^6 + \underline{6}\ \text{గు}^5\ \text{ల}^1 + \underline{15}\ \text{గు}^4\ \text{ల}^2 + \underline{20}\ \text{గు}^3\ \text{ల}^3 + \underline{15}\ \text{గు}^2\ \text{ల}^4 + \underline{6}\ \text{గు}^1\ \text{ల}^5 + \underline{1}\ \text{ల}^6$. క్రింద గీట్లున్న సంఖ్యలు కలుపగా $1+6+15+20+15+6+1=64$ సమవృత్తములు పుట్టు నని తెలిసికోగలము. ఇది బీజగణితమును బట్టి తెలిసికొన గల మార్గము.

(2) ఒకటి మొదలు రెట్టింపు చేయుచు ఆఱు సంఖ్యలు వేసి మొత్తము చేసి ఆ సంఖ్యకు ఒకటి కలుపగా 64 అయెను.

$$1+2+4+8+16+32=63+1=64$$

(3) $2^6=2\times2\times2\times2\times2\times2=64$

(4) త్రికములో గల గణములను ప్రస్తరించి 8 అని తెలిసికొన్నట్లు ఈ 6 వ ఛందమందలి సమవృత్తముల సంఖ్య 64 అని తెలిసికొనగలము:-

| 1 | | 2 | |
|---|---|---|---|
| 1) | U U U U U U | 9) | U U U \| U U |
| 2) | \| U U U U U | 10) | \| U U \| U U |
| 3) | U \| U U U U | 11) | U \| U \| U U |
| 4) | \| \| U U U U | 12) | \| \| U \| U U |
| 5) | U U \| U U U | 13) | U U \| \| U U |
| 6) | \| U \| U U U | 14) | \| U \| \| U U |
| 7) | U \| \| U U U | 15) | U \| \| \| U U |
| 8) | \| \| \| U U U | 16) | \| \| \| \| U U |

### 3

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 17) | ∪ | ∪ | ∪ | ∪ | \| | ∪ |
| 18) | \| | ∪ | ∪ | ∪ | \| | ∪ |
| 19) | ∪ | \| | ∪ | ∪ | \| | ∪ |
| 20) | \| | \| | ∪ | ∪ | \| | ∪ |
| 21) | ∪ | ∪ | \| | ∪ | \| | ∪ |
| 22) | \| | ∪ | \| | ∪ | | ∪ |
| 23) | ∪ | \| | \| | ∪ | \| | ∪ |
| 24) | \| | \| | \| | ∪ | \| | ∪ |

### 4

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 25) | ∪ | ∪ | ∪ | \| | \| | ∪ |
| 26) | \| | ∪ | ∪ | \| | \| | ∪ |
| 27) | ∪ | \| | ∪ | \| | \| | ∪ |
| 28) | \| | \| | ∪ | \| | \| | ∪ |
| 29) | ∪ | ∪ | \| | \| | \| | ∪ |
| 30) | \| | ∪ | \| | \| | \| | ∪ |
| 31) | ∪ | \| | \| | \| | \| | ∪ |
| 32) | \| | \| | \| | \| | \| | ∪ |

### 5

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 33) | ∪ | ∪ | ∪ | ∪ | ∪ | \| |
| 34) | \| | ∪ | ∪ | ∪ | ∪ | \| |
| 35) | ∪ | \| | ∪ | ∪ | ∪ | \| |
| 36) | | \| | ∪ | ∪ | ∪ | \| |
| 37) | ∪ | ∪ | \| | ∪ | ∪ | \| |
| 38) | \| | ∪ | \| | ∪ | ∪ | \| |
| 39) | ∪ | \| | \| | ∪ | ∪ | \| |
| 40) | \| | \| | \| | ∪ | ∪ | \| |

### 6

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 41) | ∪ | ∪ | ∪ | \| | ∪ | \| |
| 42) | \| | ∪ | ∪ | \| | ∪ | \| |
| 43) | ∪ | \| | ∪ | \| | ∪ | \| |
| 44) | \| | \| | ∪ | \| | ∪ | \| |
| 45) | ∪ | ∪ | \| | \| | ∪ | \| |
| 46) | \| | ∪ | | \| | ∪ | \| |
| 47) | ∪ | \| | \| | \| | ∪ | \| |
| 48) | \| | \| | \| | \| | ∪ | \| |

### 7

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 49) | ∪ | ∪ | ∪ | ∪ | \| | \| |
| 50) | \| | ∪ | ∪ | ∪ | \| | \| |
| 51) | ∪ | \| | ∪ | ∪ | \| | \| |
| 52) | \| | | ∪ | ∪ | \| | \| |
| 53) | ∪ | ∪ | \| | ∪ | \| | \| |
| 54) | \| | ∪ | \| | ∪ | | \| |
| 55) | ∪ | | \| | ∪ | \| | \| |
| 56) | \| | \| | \| | ∪ | \| | \| |

### 8

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 57) | ∪ | ∪ | ∪ | \| | \| | \| |
| 58) | \| | ∪ | ∪ | \| | \| | \| |
| 59) | ∪ | \| | ∪ | \| | \| | \| |
| 60) | \| | \| | ∪ | \| | \| | \| |
| 61) | ∪ | ∪ | \| | \| | \| | \| |
| 62) | \| | ∪ | \| | \| | \| | \| |
| 63) | ∪ | \| | \| | \| | \| | \| |
| 64) | \| | \| | \| | \| | \| | \| |

పైని చూపిన పట్టికలో గ్రహింప దగిన విశేషము లున్నవి: ప్రతి వృత్తమందును 2 గణములు గలవు. మొదటి ఎనిమిదింటను 'మ' 'య' 'ర' 'స' 'త' 'జ' 'భ' 'న' గణములు పూర్వభాగములందు నిలిచి యున్నవి. ఉత్తరభాగములందు ఈ ఎనిమిదింటికిని మొదటిదైన 'మ' గణమే చేరి యున్నది. రెండవ ఎనిమిదింటను పైని పేర్కొన్న 'మ' 'య' 'ర' 'స' 'త' 'జ' 'భ' 'న' గణములే పూర్వార్థములందు గలవు. ఉత్తరార్థములందు ఈ గణములలోని రెండవది అనగా 'య' గణము చేరి యున్నది. ఈ విధముగానే మూడవ, నాల్గవ, ఐదవ, ఆఱవ, ఏడవ, ఎనిమిదవ ఎనిమిదింటను పూర్వార్థములందు ఈ గణములే ఉండి ఉత్తరార్థములందు 3 వ ఎనిమిదింటికిని 'ర' గణము, 4 వ ఎనిమిదింటికిని 'స' గణము, 5 వ ఎనిమిదింటికిని 'త' గణము, 6 వ ఎనిమిదింటికిని 'జ' గణము, 7 వ ఎనిమిదింటికిని 'భ' గణము, 8 వ ఎనిమిదింటికిని 'న' గణము చేరి యున్నవి. మొత్తము 8 × 8 = 64 వృత్తములు.

పైని ప్రదర్శించిన నాలుగు మార్గములలోను మొదటి మార్గమును బట్టి ఆఱు అక్షరములున్ను గురువులుగా నున్నది ఒకటి అనియు, ఆఱు అక్షరములున్ను లఘువులుగా నున్నది ఒకటి అనియు, 5 గురువులు 1 లఘువు గలవి 6 అనియు, 4 గురువులు 2 లఘువులు గలవి 15 అనియు, 3 గురువులు 3 లఘువులు గలవి 20 అనియు, 2 గురువులు 4 లఘువులు గలవి 15 అనియు, ఒక గురువు 5 లఘువులు గలవి 6 అనియు తెలిసికొనగలము. ఈ వివరణమును అప్పకవి మొదలయిన లాక్షణికులు మేరు చక్రమునందు తెలియజేసిరి.

## మేరు చక్రము

$$
\begin{array}{c}
1 + 1 \\
1 + 2 + 1 \\
1 + 3 + 3 + 1 \\
1 + 4 + 6 + 4 + 1 \\
1 + 5 + 10 + 10 + 5 + 1 \\
1 + 6 + 15 + 20 + 15 + 6 + 1
\end{array}
$$

ఈ మేరు చక్రము వలన తెలియగల విషయములు పైని చెప్పిన బీజ గణిత సూత్రమువలన తెలియగలవు. కాని ఏ ఛందమును గూర్చి యడుగుదుమో దానికి సంబంధించిన యీ విషయములను బీజగణిత సూత్రము సూటిగా తెలియజేయగలదు. ఈ మేరు చక్రము అట్లుగాక మొదటినుండియు లెక్కించినగాని తెలియజేయ జాలదు. తొమ్మిది తొమ్మిదు లెంత ? అనిన తొమ్మిది దొకట్లు తొమ్మిది, తొమ్మిది రెండ్లు 18, ... తొమ్మిది తొమ్మిదులు 81 అను రీతిని తెలియజేయును.

ఇక నీ మేరు చక్రముగాని, ఈ సూత్రముగాని తెలియజేయ లేని అంశములను — అనగా, ఉదా॥ ఆఱవ ఛందమందు 3 గురువులు, 3 లఘువులు గల వృత్తములు 20 అని తెలిసినది; గాని, అవి యేవి ? ఎన్నవ ఎన్నవ వృత్తములం దుండును ? అను అంశములను శకట చక్రము తెలియజేయును.

## శకట చక్రము

6గు 1

5గు + 1ల (6) 2 3 5 9 17 33

4గు + 2ల (15) 4 7 13 25 49 6 11 21 41 10 19 37 18 35 34

3గు + 3ల (20) 8 15 29 57 14 27 53 26 51 50 12 23 45 22 43 42 20 39 38 36

2గు + 4ల (15) 16 31 61 30 59 58 28 55 54 52 24 47 46 44 40

1గు + 5ల (6) 32 63 62 60 56 48

6ల 64

ఈ చక్రములోని సంఖ్యలు ఎట్లు వేయవలె ననగా :- మొట్ట మొదట నిలువు చాలులో గల 7 గళ్లలోను మీది గడిలో 1 ఉంచి ఆ సంఖ్య రెట్టించుచు 2, 4, 8, 16, 32, 64 ఒకదాని క్రింద నొక టిగా వేయవలెను. ఆ పిమ్మట అడ్డు చాళ్లు పూర్తి చేయవలెను. ఎట్లనగా, 2ను రెట్టించి ఒకటి తీసిచి 3, దానిని రెట్టించి ఒకటి తీసిచి 5, దానిని రెట్టించి ఒకటి తీసిచి 9, దానిని రెట్టించి ఒకటి తీసిచి 17, దానిని రెట్టించి ఒకటి తీసిచి 33 గురువు లయిదు లఘు వొకటి గలవి అగు కనుక ఈ అడ్డును అనగా 2, 3, 5, 9, 17, 33 గా వేయుట జరిగినది. కనుక, ఈ చాలు పూర్తి అయినది. మూడవ అడ్డు చాలులో 4 గురువులు 2 లఘువులు గలవి 15 కనుక 15 గళ్లున్ను పూర్తి చేయవలెను. ఎట్లనగా 4ను రెట్టించి ఒకటి తీసిచి 7, దానిని రెట్టించి ఒకటి తీసిచి 13, దానిని రెట్టించి ఒకటి తీసిచి 25, దానిని రెట్టించి ఒకటి తీసిచి 49 ఇక దానిని రెట్టించి ఒకటి తీసిన యెడల 64 కంటె ఎక్కువగును గనుక పై చాలులో ఉన్న 3ను రెట్టించి 6 వేయవలెను. ఆ 6ను రెట్టించి ఒకటి తీసిచి 11 వేయవలెను. దానిని రెట్టించి ఒకటి తీసిచి 21, దానిని రెట్టించి ఒకటి తీసిచి 41 వేయవలెను. ఇక దానిని రెట్టించి ఒకటి తీసిచిన ప్రయోజనము లేదు కనుక పై చాలులో గల 8ను రెట్టించి 16 వేయవలెను. ఈ విధముగా ఈ శకటచక్ర మందలి సంఖ్యలు పూర్తిగా వ్రాయనగును.

## నష్ట వృత్త ప్రస్తారము

ఈ గాయత్రీ ఛందమున 59వ సమవృత్తమునకు ఏ యే గణము లుండును ? దీనికి సమాధాన మేమనగా : 59ని 2చే భాగించవలెను.

59 బేసి సంఖ్య గనుక తెగదు. అందుచేత 1 కలిపి 60 చేసి భాగించ వలెను. $\frac{60}{2}=30$ ఇట్లు 1 చేర్చవలసివచ్చినది గనుక మొదటి అక్షరము గురువు అని గ్రహించవలెను. 30ని 2 చేత భాగించగా 15 అయినది. కనుక రెండవ అక్షరము లఘువు. 15 బేసి సంఖ్య కనుక 1 చేర్చి 16 చేసి 2 చేత భాగించగా 8 అయినది. 1 చేర్చవలసి వచ్చినది కనుక మూడవ అక్షరము గురువు. 8ని 2 చేత భాగించగా 4 అయినది కనుక నాల్గవ అక్షరము లఘువు. 4ను 2 చేత భాగించగా 2 వచ్చినది కనుక ఐదవ అక్షరము లఘువు. 2ను 2 చేత భాగించగా 1 వచ్చినది కనుక ఆఱవ అక్షరము లఘువు. ఇవి వరుసగా ఉంచిన యెడల U U అయినవి; అనగా రగణ నగణములు ఈ 59వ సమవృత్తములో గలవని చెప్పగలము.

$59 + 1 \div 2 = 30$ — U గు

$30 \div 2 = 15$ — ల

$15 + 1 \div 2 = 8$ — U గు

$8 \div 2 = 4$ — | ల

$4 \div 2 = 2$ — | ల

$2 \div 2 = 1$ — ల

U U |

ర న

ప్రస్తరించి చూచినను ఈ గణములే ఉన్నవి.

## ఉద్దిష్ట వృత్త నిర్ణయము

కనకకశిపు హర్తన్ గానలోలున్ శుభాంగున్

ఇది ఎన్నవ ఛందములో ఎన్నవ వృత్తము? అందుకు సమాధానము:- ఇందులో గురు లఘువుల క్రమము వరుసగా వ్రాసి, ఆ గురు లఘువుల క్రిందను వరుస వెంబడిని ఏకాది ద్విగుణితముగా అంకెలు వేసి లఘువుల క్రింద నున్న అంకెలను మాత్రమే వెరసు వేసి ఆ వెరసునకు ఒక్కటి కలుపగా వచ్చిన సంఖ్య ఎన్నవ వృత్తమో తెలియ జేయును.

```
I   I   I   I   I    I    U     U     U
1   2   4   8   16   32  [64   128   256]
                          I      U      U      I     U   U
                         512  [1024  2048]  4096  [X   X]
```

1+2+4+8+16+32+512+4096=4671+1=4672 వ వృత్తము.

ఇందులో 15 అక్షరము లున్నవి. కనుక అతిశక్వరి యను 15వ ఛందమున 4672 వ వృత్తమని చెప్పగలము.

మొదటి ఛందమున వృత్త పాదమునకు ఒక్క అక్షరమే కనుకను అది గురు వైనను లఘు వైనను కావచ్చును కనుకను 2 వృత్తములు కల వనవలెను. రెండవ ఛందమున వృత్తపాదమునకు 2 అక్షములు కనుకను అది గగ, లగ, గల, లల - 4 విధములయిన వృత్తములు కల వనవలెను. ఇట్లే తక్కిన ఛందములలో గల వృత్తముల సంఖ్యలు తత్పూర్వపు వృత్తముల సంఖ్యను రెట్టించుకొనుచు చెప్పవలెను.

మొదటి ఛందము నుండి 10 వ పంక్తి ఛందము వఱకున్న గల 10 ఛందము లందును పుట్టిన వృత్తముల మొత్త మెంత? పంక్తి తరువాత 11 వ ఛందమయిన త్రిష్టుప్పునందు పుట్టిన వృత్త సంఖ్య 2048 నుండి రెండు తీసి వేయగా వచ్చిన సంఖ్య 2046. కనుక మొదటి పది ఛందము లందును పుట్టిన వృత్తములు 2046 అని చెప్ప వలెను. ఇట్లే 26 ఛందము లందును పుట్టిన వృత్త ము లన్నీ 13,42,17,726-పదమూడు కోట్ల నలుబది రెండు లక్షల పదియేడు వేల ఏడు వందల ఇరువది యాఱు అని చెప్పగలము.

వృత్తపాదము గుర్వంతముగా నుండవలె నను నియమము సంప్రదాయసిద్ధముగా నున్నది కనుక 6,71,08,863 వృత్తములు పుట్టవచ్చునుగదా? అయినను 200 వృత్తములకైనను తెలుగు లాక్షణికులు వృత్త లక్షణము చెప్పలేదు. భరతుడు తన నాట్య శాస్త్రములో 53 సమవృత్తములకును, మరి కొన్ని విషమ సమ వృత్తములు, ఆర్యాదులును చేర్చి మొత్తము 70 పద్యములకు మాత్రమే లక్షణము నిరూపించెను. క్రీ. శ. 1100 పూర్వమే రచిత మైన కవిజనాశ్రయములో 120 సమవృత్తములకును ఇతరములయిన మఱి 50 పద్యములకును వెరసి 170 పద్యములకును మాత్రమే ఛందోనిరూపణము గలదు. అందఱికంటెను ఎక్కువగా చెప్పిన అప్పకవి 186 సమవృత్తములకును ఇతరములయిన మఱి 100 పద్య ములకును వెరసి 286 అనగా సుమారు 300 పద్యములకు మాత్రమే లక్షణములు చెప్పి లక్ష్యములు చూపించినాడు.

ఈ క్రింద నొక పట్టికలో ఛందముల పేళ్లు ప్రతి ఛందము నందును పుట్టిన వృత్తముల సంఖ్య కొన్ని ముఖ్యము లయిన వృత్త ముల పేళ్లు తెలియజేయుచున్నాను:-

| ఛందము పేరు | వృత్తముల సంఖ్య | ఆ యా ఛందములందు పుట్టిన వృత్తములలో ముఖ్యములగు వృత్తముల పేళ్లు. ఏ వృత్తము అందు ఎన్నవదో ()లో నున్న సంఖ్య తెలియ జేయును. |
|---|---|---|
| 1 ఉక్త | 2 | ఇందులో పుట్టిన వృత్తములు సుప్రసిద్ధములు కావు కనుక వృత్తభేదములు పేర్కొనలేదు. |
| 2 అత్యుక్త | 4 | |
| 3 మధ్య | 8 | |
| 4 ప్రతిష్ఠ | 16 | |
| 5 సుప్రతిష్ఠ | 32 | |
| 6 గాయత్రి | 64 | సావిత్రి (1-); విచిత్ర (10-); తనుమధ్య (13-); చంద్రవదన (15-); శశివదన (16-); వసుధ (28-); వసుమతి (29-). |
| 7 ఉష్ణిక్కు | 128— | లోల (10); హంసమాల (20-); మదరేఖ (25-); కుమారలలిత (30-); సరసిజము (31-); విభూతి (43); మధుమతి (56-); మదనవిలసితము (64-); |
| 8 అనుష్టుప్పు | 256— | విద్యున్మాలా (1-); చిత్రపదము (58-); హంసరుతము (57-); ప్రమాణి (86); నాగరము (87-); మాణవకము (108-); సమాని (107-). |

ఛ-2

9 బృహతి — 512— ఉత్సుకము (183-); భద్రకము (187-); మధుకరి (64-); హాలముఖి (251-).

10 పఙ్క్తి — 1024 ప్రణవము (121); రసాలి (187-); రుగ్మవతి (199); మణిరంగము (241-); మత్త (241); భోగివిలసితము (351); మనోరమ (344-); శుద్ధవిరాటి (345); పఙ్క్తి (439-).

11 త్రిష్టుప్పు — 2048— ఇంద్ర వజ్రము (357); ఉపేంద్ర వజ్రము (358-); తోటకము (489-); రథోద్ధతము (699-); భద్రకము (704-); స్వాగతము (443-); కాంతి (877-); శ్యేని (683-); వాతోర్మి (817-); కవిలాంతము (గీతాలంబనము) (677-); శాలిని (289-); సుముఖి (880-); భ్రమర విలసితము (1009-); మౌక్తిక మాల (487-).

12 జగతి — 4096— స్రగ్విణి (1171-); భుజంగప్రయాతము (2536-); తోటకము (1756-); జలధరమాల (241-); వంశస్థము (362-); ద్రుతవిలంబితము (1464-); తోదకము (880-); ప్రమితాక్షరము (1772-); చంద్రవర్మ (1979-); కుసుమ విచిత్రము (976-); మణిమాల (781-); మేఘవిలసితము (2041-).

13 అతిజగతి — 8192— మత్తమయూరము (1633-); ప్రహర్షిణి (1401-); జలదము (2543-); రుచిరము (2806 ;) మత్తహంసిని (2790-); సుమంగలి (1772-).

14 శక్వరి — 16384— వసంత తిలక (2933-); ప్రహరణ కలిత (8128); నవనందిని (8820-); అపరాజితము (5824-); అసంబాధ (2017-); కమల విలసితము (4096-).

15 అతిశక్వరి — 32768— మాలిని (4672); సుకేశరము (11184-); సుగంధి (10923-); నలిని (14044-); మణిగణనికరము (16384).

16 అష్టి — 65536— ప్రియకాంత (13264-); పంచచామరము (21846-); పద్మకము (23416-); చంద్రశ్రీ (10173-); ఫలసదనము (16384); అశ్వగతి (28087-); మదనదర్పణము (21855-); గజవిలసితము (32727-).

17 అత్యష్టి — 131072— శిఖరిణి (59330-); పృథ్వి (38750-); నర్కుటము (56240-); మందాక్రాంత (18923-); పాలాశదలము (22763); వంశపత్రపతితము (64983-).

పతితము (64963-).

18 ధృతి — 262144— మత్తకోకిల (93019-); కుసుమిత లతావెల్లిత (37857); సిరి (74941); హారనర్తనము (80971-), హ్లాదహారము (30611).

19 అతిధృతి — 524288— శార్దూలవిక్రీడిత (149337); తరళ (75714-); మేఘవిస్ఫూర్జితము (186587-); చంద్రికళ (180587-); కవికంఠభూషణము (177900-).

20 కృతి — 1048576 మత్తేభవిక్రీడిత (298676); ఉత్పలమాల (355799-); అంబురుహము (372151-); ప్రభాకలిత (372079-).

21 ప్రకృతి — 2097152— చంపకమాల (711600-), వనమంజరి (744304); స్రగ్ధర (302993-); లాటీవిటము (394972-); మణిమాల (965356-); కరిబృంహితము (782271-); కనకలత (1048576-).

22 ఆకృతి — 4194304 మహాస్రగ్ధర (605989-); మానిని (1797559); విచికిలిత (2097152); తురగము (1490944-); మద్రకము (1947095-).

23 వికృతి 8388608— కవిరాజవిరాజితము (2595120-); పద్మనాభము (149797-); మత్తాక్రీడ (4194081-); అశ్వలలిత (3861424-).

24 సంకృతి 16777216— సరసిజము (8388193-): క్రౌంచపదము (4193479-); తన్వి (4155367-); అష్టమూర్తి (3614521-).

25 అతికృతి 33554432— బంధురము (14368768-); భాస్కరవిలసితము (8381311-); ధరణిధరగతి (16777216-).

26 ఉత్కృతి 67108864— భుజంగవిజృంభిత (23854848-); వరాహము (8388601-); మంగళమహాశ్రీ (15658735-).

పాదమునకు 26 అక్షరములకంటె ఎక్కువ గల వృత్తము మాలావృత్తము. దీని లక్షణము మరియొకచోట వివరింతును.

పైని చెప్పబడిన వృత్తము లన్నియును సమవృత్తములు. ప్రతి వృత్తమును నాలుగు పాదములు గలది. అన్నిటికిని ప్రాస నియమ మున్నది. పంక్తి మొదలు ఉత్కృతి వఱకును గల ఛందము లందు పుట్టిన వృత్తములలో ప్రతి పాదమందును వడి నియమము కూడ గలదు. ప్రాస, వడి లక్షణములు మరియొక ప్రకరణమునందు వివరించెదను.

అర్ధ సమ వృత్తములు రెండు విధములు: స్వస్థానార్ధ సమ వృత్తములు; పరస్థానార్ధ సమ వృత్తములు. మొదటిదానిలో నాలుగు పాదము లున్నను, అక్షర సంఖ్యా విషయములో సమానములే కాని రెండు భిన్న వృత్తములు గలవి. ఇవి నాలుగు విధములుగా అమరియుండును. ఉదా॥ ఇంద్రవజ్రము ఉపేంద్రవజ్రము అను ఈ రెండు వృత్తములును త్రిష్టుప్ఛందమున పుట్టునవే: సమానమయిన అక్షర సంఖ్య గలవి. కనుక స్వస్థానమునందలి వృత్తములే కాని బేసి పాదములు ఇంద్రవజ్ర పాదములుగాను, సరిపాదములు ఉపేంద్ర వజ్ర పాదములుగాను ఉన్న వృత్తము ఉపజాతి. బేసి పాదములు ఉపేంద్రవజ్రపాదములై సరిపాదములు ఇంద్రవజ్రపాదములైన యెడల దానికి వ్యత్యస్తోప జాతి యని పేరు. ఇంద్ర వజ్రాచ్ఛాయను మొదటి రెండు పాదములును, ఉపేంద్ర [illegible] రెండు పాదములును ఉన్నయెడల [illegible]మోప జాతి యగును.

ఉపేంద్రవజ్రాచ్ఛాయను మొదటి రెండు పాదములును, ఇంద్రవజ్రా ఛ్ఛాయను కడమ రెండు పాదములుమ ఉన్నయెడల అది వ్యత్యస్తస మోప జాతి యగును. ఈ నాలుగే కాక మరియొక విధమైనది వైపరీత్యోపజాతి. ఇందు ఈ రెండు వృత్తచ్ఛాయలలో ఒకటి ఒక పాదమందును, మరియొకటి తక్కిన మూడు పాదములందును ఉండును. పరస్థానార్థ సమవృత్తములలో భిన్నములయిన రెండు ఛందములందనుపుట్టిన రెండు వృత్తములు పైని చెప్పినట్లు 6 విధ ములుగా నుండును. ఈ లక్షణములనుబట్టి ఉత్పలమాలా చంపక మాలలు, శార్దూల మత్తేభములు, స్రగ్ధరా మహాస్రగ్ధరలు మొదలగు నవి ఉండవచ్చు ననుకొందును.

ఇంక విషమ వృత్తములు కూడ స్వస్థానములు, పరస్థాన ములు, అను పేర రెండు విధములు; అనగా నాలుగు చరణములును నాలుగు విధములై ఉండినను అవి సమానాక్షర సంఖ్య గలవి అయినయెడల స్వస్థాన విషమ వృత్తములు; భిన్నాక్షర సంఖ్య గలవి అయినయెడల పరస్థాన విషమ వృత్తములు, లాక్షణి కులు చూపిన లక్ష్యములను బట్టి ఈ పద్యములు నడకలోను, అక్షర సంఖ్యల వ్యత్యాసములోను ఎక్కువ భిన్నములు కానివి. లాక్షణికులు వివరించి చెప్పిన వృత్తములే కాక వృత్తగతి వివేకముతో క్రొత్త వృత్తములను కల్పించుకొనవచ్చును. అప్పకవి సర్వపరస్థాన విషమ వృత్త వివేకముక్రింద మధురగానె వృత్తము రచించినాడు :

" వెసమధురాఖ్యము - విన్న జారగల్ నా
రసలగములు మీద - రాగననమ్యాయల్।
నసజజజగ లొందన్ - దంతి రత్నాజదిక్ "
ప్రసర విరమంబు జెంది - రసం దనరారజా।

"ఇది ప్రభాతచ్ఛాయను మొదటి చరణమునను అశ్వాజిత చ్ఛాయను రెండవ చరణమునను మాలినీఛాయను మూడవ చరణమునను నడచును. నాల్గవ చరణము కవి కల్పితము."

(పుట యడుగున మూడవ చరణములో 'ఛందోభంగము - చివర గణము యగణమై యుండవలెను' అని ఉన్నది. కాని ఇటీవల సరియైన పాఠము కనబడినది — రత్నాత్మహార్ద్రిప్రసర అని ఉండవలెను.)

ఇక్కడ నే చెప్పదలచిన విషయమేమనగా, అప్పకవి కల్పించినట్లే ఎవ్వరైనను కల్పించుకొనవచ్చును. ఈ విషయమును గూర్చి మరియొకచోట విపులముగా వ్రాసెదను.

వైతాళీయాది పద్యములు, రగడలు, కందాది జాతులు మాత్రానిబద్ధములు కనుక ముందుగా మాత్రాగణముల విశేషములు వివరించి పైని పేర్కొన్న వృత్తము లందు మాత్రాగణ లక్షణ మెట్లుండునో తెలియజేసెదను.

మాత్రాగణములు గురు లఘువులవల్ల నేర్పడును. లఘువు ఒక మాత్ర గలది; గురువు రెండు మాత్రలు గలది; కనుక రెండు

లఘువు లోక గురువునకు సమము అని యిదివరకే చెప్పియుంటిని. ఏ యక్షరములు గురువులో లాక్షణికులు చెప్పియున్నారు. "దీర్ఘము, సంయోగ పరకము, అనుస్వారసహితము, విసర్గ సహితము, ప్లుత వర్ణము గురువు" భరతుని నాట్యశాస్త్రము. సంస్కృత పద్యములందు చరణాంతమున గల లఘువు కూడ వలసినప్పుడు గురువుగా నుచ్చరించవచ్చును అని ఉన్నది.

సంస్కృతములో పదాదినున్న జడ్డక్షరమునకు పూర్వము హ్రస్వాంతముగా నున్న పదమందలి యా హ్రస్వము గురువగును. ఉదా॥ 'జాగర్తి లోకోజ్వలతి ప్రదీపః' ఇందు 'ప్ర' కు పూర్వమున్న 'తి' గురువగును. 'హే రామ!' త్వాద్మశః.'—ఇందు 'త్వా' కు పూర్వమున్న 'మ' గురువగును. తెలుగులో అట్లు కాదు. 'మ' లఘువుగానే ఉచ్చరింపవలెను. ఈ విషయము అప్పకవి - 'ఆంధ్రకృతుల మాటకాదివర్ణముక్రింద నూఁదఁబడని జడ్డలుండెనేని। వాని యెడమ నున్న హ్రస్వాలునందును గూడి, గురువులనుచు గణముగూర్పవలదు.' అని అందుకు లక్ష్యముగా 'భువవినుతనామ వ్రజధామ ప్రధనభీమ...' అను పద్యము రచించెను.

లాక్షణికు లెవ్వరును చెప్పని విషయము ఒకటి నేనీ సందర్భమున తెలియజేయవలయును.' అ, ఆ, ఐ, ఔ లకు మఱి। ఇ, ఈ లు ఋకారసహిత మెపలకునా।ఉ ఊ ల్దములో నొడబడి। ఒ ఓ లకు వళ్ళగు న్నయోన్నత చరితా॥' ఈ పద్యమందలి 'అ, ఇ, ఉ, ఎ, ఒ' అను హ్రస్వాక్షరములు గురువులుగా ఉచ్చరింపనియెడల గణభంగ

మగును. 'వానికి అ ఆలు రావు' అని హ్రస్వఅకారమును గురువుగా లోకములో అందఱును ఉచ్చరింతురు, కాని ఆ ఉచ్చారణ మెట్లు కలుగుచున్నదో లాక్షణికులు నిర్వచింపలేదు. తెలుగుభాషలో ఈ ఒక్క సందర్భముననే ఈ ఉచ్చారణము కలదుగాని, సవరభాషలోను ఇంకను మరికొన్ని భాషలలోను ఈ ఉచ్చారణము తఱచుగా పెక్కు శబ్దాలలో వినబడుచుండును. అది హ్రస్వస్వరము; అయినను ఎక్కిలి వచ్చినప్పుడు ఎట్లు కంఠనాళము మూసికొనిపోయి ఊపిరి ఆగునో అట్లే అగుటవల్ల ఆ హ్రస్వస్వరము గురు వగునని శబ్దశాస్త్రజ్ఞులు నిర్వచించినారు. దీనికి ఆంగ్లభాషలో 'glottal stop' అని పేరు. దీని తెలుగులో 'అంగిలి నొక్కు' అనవచ్చును.

మాత్రాగణములు గురు లఘువులవలన ఏర్పడును. దీనికిని ప్రస్తారక్రమము గలదు. మూడు మాత్రలుగల గణములు 'త్ర్యస్రములు', నాలుగు మాత్రలు గలవి 'చతురస్రములు', అయిదు మాత్రలు గలవి 'ఖండములు' ఏడు మాత్రలు గలవి 'మిశ్రములు', తొమ్మిది మాత్రలు గలవి 'సంకీర్ణములు'. ఇందులో రెండు నాలుగులో సగము కనుకను, ఆఱు మూటికి ద్విగుణము కనుకను ఎనిమిది నాలుగునకు ద్విగుణము కనుకను చెప్పలేదు. అయినను యివి తాళములందు కనబడుచుండును. త్ర్యస్ర చతురస్రాదులు రూపకాది తాళములలో జాతులుగాను గతులుగాను వచ్చుచుండును. ఈ వివరణముల ప్రసక్తి గేయములకు కావలెను. వృత్తములకు అక్కర లేదు. కాని ఈ వృత్తములం దనేకములు గేయములవలెనే నడచుచున్నవని తెలియజేయదలచితిని గనుక, ఇక్కడ సప్తతాళములను

త్ర్యస్రాదిజాతులతో ప్రదర్శించుచున్నాను. అందులో ప్రతితాళమందును మాత్రల సంఖ్య యెట్లుండునో కనబరచినాను. అందులో గల గుర్తులకు వివరణము :- 'o' అనగా ద్రుతము; దెబ్బ, ఉసి అను పేళ్ళతో రెండు మాత్రలు కలది; '(' అనగా 'అనుద్రుతము' ఒక 'దెబ్బ' మాత్రమే కలదు. 'ఉసి' లేదు కనుక ఒక మాత్ర కలది. '।' దీనికి 'లఘువు' అను పేరు కలదు. కాని ఛందస్సులో చెప్పిన లఘువు కాదు. దీని విలువ ఆయా జాతులనుబట్టి మారుచుండును. ఉదా జంపెతాళను మూడు భాగములు గలది - । ( o, ఇందు [।] లఘువు. ఇది త్ర్యస్రజాతి దయిన యెడల మూడు మాత్రలు గలది. [(] అనుద్రుతము, ఇది ఏ జాతి జంపెయయినను ఒక్క మాత్ర గలది. [o] ఇది ద్రుతము, ఇది ఏ జాతి జంపె యయినను 'దెబ్బ-ఉసి' అని రెండు మాత్రలు గలది. త్ర్యస్రజాతి జంపె యయినచో ఇది 3 + 1 + 2 = 6 మాత్రలు గలది. చతురస్రజాతి యయినచో ఇది 4 + 1 + 2 = 7 మాత్రలు గలది. ఖండజాతి జంపె యయినచో ఇది 5 + 1 + 2 = 8 మాత్రలు గలది. సంకీర్ణజాతి జంపె యయినచో ఇది 9 + 1 + 2 = 12 మాత్రలు గలది. జాతి పేరు చెప్పక జంపె తాళము అన్నప్పుడు సాంకేతికముగా మిశ్రజాతి జంపె యనియే గ్రహించవలెను. ఇందులో 7 మాత్రలున్నందున సాహిత్యమందు 5 + 2 గా మిశ్రమై యుండవచ్చునుగదా! అప్పుడు 5 = 2 + 1 + 2 అగును. అనగా 5 + 5 గా ఏర్పడును. అప్పుడది ఖండగతిని నడచును. దానికి కుఱుజంపె యని పేరు. జంపె తాళము వలె ఛేదింపదలచిన యెడల 2 + 1 + 2; 2 + 1 + 2 గా ఏర్పడి రెండు కుఱుజాతి జంపె ఆవృతు లగును. తక్కిన తాళములలో నుండు [ ( o] ఇట్లే గ్రహించవలెను.

# తాళముల పట్టిక

సప్తతాళములు (5) జాతులు :-

| అంగములు<br>భాగములు | త్రిశ్ర (3)<br>మూడు మాత్రలు | చతురశ్ర (4)<br>నాలుగు మాత్రలు | ఖండ (5)<br>ఐదు మాత్రలు | మిశ్ర (7)<br>ఏడు మాత్రలు | సంకీర్ణ (9)<br>తొమ్మిదిమాత్రలు |
|---|---|---|---|---|---|
| ఏకతాళము<br>1 | 3 | 4 | 5 | 7 | 9 |
| రూపకము<br>0 1 | 2 + 3<br>= 5 | 2 + 4<br>= 6 | 2 + 5<br>= 7 | 2 + 7<br>= 9 | 2 + 9<br>= 11 |
| త్రిపుట<br>1 0 0 | 3 + 2 + 2<br>= 7 | 4 + 2 + 2<br>= 8 | 5 + 2 + 2<br>= 9 | 7 + 2 + 2<br>= 11 | 9 + 2 + 2<br>= 13 |
| మఠ్య<br>1 0 1 | 3 + 2 + 3<br>= 8 | 4 + 2 + 4<br>= 10 | 5 + 2 + 5<br>= 12 | 7 + 2 + 7<br>= 16 | 9 + 2 + 9<br>= 20 |
| జంపె<br>1 ∪ 0 | 3 + 1 + 2<br>= 6 | 4 + 1 + 2<br>= 7 | 5 + 1 + 2<br>= 8 | 7 + 1 + 2<br>= 10 | 9 + 1 + 2<br>= 12 |
| అట<br>1 1 0 0 | 3 + 3 + 2 + 2<br>= 10 | 4 + 4 + 2 + 2<br>= 12 | 5 + 5 + 2 + 2<br>= 14 | 7 + 7 + 2 + 2<br>= 18 | 9 + 9 + 2 + 2<br>= 22 |
| ధ్రువ<br>1 0 1 1 | 3 + 2 + 3 + 3<br>= 11 | 4 + 2 + 4 + 4<br>= 14 | 5 + 2 + 5 + 5<br>= 17 | 7 + 2 + 7 + 7<br>= 23 | 9 + 2 + 9 + 9<br>= 29 |

ఇందు గ్రహింపవలసిన విషయములు :-

1. ఏకతాళము గతిని మాత్రమే తెలియజేయును. ఇందు భాగములు లేవు.

2. వెరసి మాత్రల సంఖ్య 5 అయినవి ఖండజాతి ఏకతాళమందున్ను త్ర్యస్రజాతి రూపకమందును గలవు. "నిను వలతు", "నిన్ వలతు", "నను గొల్తు", "నిన్ గొల్తు" ఇందు ఏదైనను 2 + 3 అగును గనుక త్ర్యస్రజాతి రూపక మనియును, ఖండజాతి ఏకతాళ మనియును చెప్పవచ్చును. కాని, "భుజంగప్రయాతము" అన్నప్పుడు రెండవ మాత్ర మూడవ మాత్రతో కలిసి గుచ్చినట్లుగా ఉన్నందున, ఇది త్ర్యస్రజాతి రూపక తాళములో నడచు ననుటకంటె ఖండజాతి ఏకతాళములో నున్నదనుట సమంజసము. ఖండగతిలో నడచును అని చెప్పవచ్చును. 'రామన్న, రామన్న' అన్న పదములు సహజమైన ఖండగతిలో నడచుచుండగా 'భుజంగప్రయాతమ్' ఎదురుగా నడచునని మాత్రము గ్రహింపవలెను.

వెరసి 6 మాత్రలు గలవి చతురస్రజాతి రూపకమందును, త్ర్యస్రజాతి జంపె యందును, రెండు ఆవృతులు గల త్ర్యస్రజాతి జంపె యందును, రెండు ఆవృతులు గల త్ర్యస్రజాతి ఏకతాళము లందును గలవు. ఇట్టి సాహిత్యపదములకు ఏది ఎక్కువ ప్రాశస్త్యముగా నుండునో గ్రహింపవలెను :-

శ్రీరామా, రఘురామా, రామునితో
చెలులతో, నీ పలుకులు మొ॥

చతురస్రజాతి రూపకములో ఎక్కువ చక్కగా నడచును

చిలుక పలుకు, చిల్కాలతో, చిలుకలతో,

నీవు కదా, లేనియో మొ

త్ర్యస్రజాతి జంపెలోను, త్ర్యస్రజాతి ఏకతాళములోను త్ర్యస్రగతిని నడచును.

హరే రామ హరే రామ

రామ రామ హరే హరే

ఇది ఎక్కువగా త్ర్యస్రగతిని నడచును.

3. వెరసి 7 మాత్రలు గలవి మిశ్రజాతి ఏకతాళమందును, అనగా మిశ్రగతిలోను, ఖండజాతి రూపకములోను, త్ర్యస్రజాతి త్రిపుటలోను, చతురస్రజాతి జంపెలోను గలవు. సాహిత్య పదములలో ఏది దేనికి ఎక్కువగా అమరియుండునో గ్రహింపవలెను.

కనులు మూసిన కనులు తెరచిన

కానుపించిన దొక్కరూపే మొ

మిశ్రగతిలోను, (త్ర్యస్రజాతి) త్రిపుటలోను నడచును.

రావలెనుగా, పోవలదురా

ఎటు జూచినా, కనుగొంటి వే

కలకాలమును, బ్రదుకేటికే మొ

ఖండజాతి రూపకములోను, చతురస్రజాతి జంపెలోను నడచును.

4. వెరసి 8 మాత్రలు గలవి చతురస్రజాతి ఏకతాళములో రెండు ఆవృతులలోను అనగా చతురస్రగతిలోను, చతురస్రజాతి త్రిపుటలోను అనగా ఆదితాళములోను, త్ర్యస్రజాతి మఠ్యలోను, ఖండజాతి జంపెలోను గలవు. ఏ సాహిత్యమున కేది అమరునో చూడుడు :—

చిలుక పలుకులకు, వానికే తగును
నీవు నీపదవి, తాను తన మదిని మొ॥

త్ర్యస్రజాతి మఠ్యతాళములో ఎక్కువగా అమరియుండును.

రామునికి సదా, తన మదికి సదా
శ్యామసుందరా, రాఘవేంద్రునకు మొ॥

ఖండజాతి జంపెకు ఎక్కువ ప్రాశస్త్యమునవి.

అష్టశద్ది యాం దినమున గనుకను
ప్రొద్దున నే మఱి చద్ది బుద్ధలను మొ।

ఆదితాళములో నడచును.

ఎనిమిదేసి మాత్రలకు పదములు విరుగుచుండవలెను అనగా ఎనిమిదవ మాత్ర తొమ్మిదవ మాత్రతో కలిసి గురువు కాకూడదు.

["చల్లగాలిలోన తిరుగుచుందువేని జలుబుచేయు"
ఇందులో 24 మాత్రలు ఉన్నవిగదా? మూడు ఆవృతులలో ఇది ఆదితాళమున నడవదా? అంటే నడవదనవలెను. ఎందుచేత ననగా మొదట ఆవృతి 8 మాత్రలకు తెగినా రెండవది తెగలేదు.]

కందములు మొదలయిన పద్యములు—చతురస్రగతిని నడచును.

5. వెరసి 9 మాత్రలు గలవి మిశ్రజాతి రూపకములోను, ఖండజాతి త్రిపుటలోను, సంకీర్ణజాతి ఏకతాళములోను గలవు. సాహిత్యములో వీని పొందిక ఎట్లుండునో చూడుడు :

నీ చిలుక పలుకులు, శ్రీరామచంద్రుడు
బలవంత మేటికి, బలహీనుడయినను మొ॥

మిశ్రజాతి రూపకములోను, ఖండజాతి త్రిపుటలోను చక్కగా నడచును, సంకీర్ణజాతి ఏకతాళములో కూడ నడపించవచ్చును.

3 + 3 + 3 + = 9 గనుక త్ర్యస్రగతి గణములు కూడ ఈ సంకీర్ణజాతి ఏకతాళమునకు సరిపోవును.

కడమ పేరీతిగానే చూచి గ్రహించవలెను.

ఈ గణములన్నీ త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ గతులలో నడపించవచ్చును అప్పుడు మాత్రల సంఖ్యలు వరుసగా 3, 4, 5, 7, 9 రెట్లుగా ఎక్కువగుచుండును.

గేయములలో ఈ తాళముల నడక ఎట్లుమరియున్నదో గేయముల ప్రకరణమందు వివరించెదను. ఒక విషయము మాత్రము ముందుగా ఇక్కడ తెలియజేయవలసి యున్నది. గానకళాపూర్ణ శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు శ్రీ నారాయణరెడ్డిగారి నాగార్జున సాగరము గేయ కావ్యమునకు మంగళాశాసనము వ్రాసినారు; అందులో —

“ (౧) ఇక్ష్వాకు వంశ క్షితీంద్రచంద్రుల కీర్తి
కౌముదులు నల్గడల కలయ విరిసిననాడు

. . . . . . . . .

ఇందలి ఒక్కొక్క వాక్యమును ఇరువది మాత్రల గణములు ఎనిమిది గలిగి ఖండజాతి ఆదితాళమునకు గూర్పబడినవి. కాని సరిపెణవలె అఖండముగా సాగిన యీ నడకలో భావము ముగిసి నప్పుడు కూడ విశ్రాంతికి చోటు లేదు. విశ్రాంతి తీసికొంటిమా తాళము పటాపంచలగును. దానికి విశ్రాంతి కాలమును చక్కగా నలువది మాత్రల కాలము పెంచితిమా పూర్వోత్తర భాగములు పరస్పరము అసంబద్ధములుగా నగును. కనుక ఈ రచనలో ప్రధాన

మయిన మూలద్రవ్యము లయ మాత్రమే. అది చదువరులను తన వెంట నీడ్చుగొని పోవుచు అలౌకికముగా కావ్యరసము ననుభవించుట కెంతో సహాయపడును. మఱి అందందు రసభావానుగుణముగా ఆ లయను గూడ మనము సడలించుకొనవలసి యుండును. కావ్యకళకు పరమార్థ మదియే కనుక, లేకున్న ఆ బంధము బిగుతప్పెట వాద్యము వలె మనలను ఉక్కపెట్టుచును."

ఈ దృష్టితో నే వృత్తము లెట్లు నడచునో చూచి ఏ యే వృత్తము లే యే తాళ వరుసల నున్నవో వివరించెదను. ఉత్పలమాల, చంపకమాల చతురస్రగతి త్రిపుట తాళములో నడచును.

1 2 3 4 5 6 7

పండిత।రక్షకుండఖి। పాపవిమోచను।డబ్జసంభవా — వెరసి మాత్రలు

$4 \times 7 = 28$

హారునకు నవ్విభీషణున।కద్రిజకుం దిరు।మంత్రరాజమై

ఇందు లయ సడలించుకొనుట కవకాశము కూడ గలదు. "తప్పెట వాద్యము వలె మనలను ఉక్కపెట్టు"పదు.

మత్తేభ శార్దూల విక్రీడితలలో ఒక్కొక్క పాదమునకు ముప్పదేసి మాత్ర లున్నవి. పాదాంతమున 2 మాత్రల కాలము విశ్రాంతి కోసము పెంచి చతురస్రగతిని ఆదితాళములో నడపించవచ్చును చూడండి:-

1 2 3 4 5 6 7 8

శా. అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే న జ్ఞాననై పల్కి।తిన్ . . .

మ. అలినీ । లాలక। నీవు నీ పతి ర ।హస్య క్రీడ వర్తించు। వే . . .

శతాంతాయుధ . . .

ఈ మత్తేభవిక్రీడితలో "వేళలతాంతాయుధ..." పాదాంతమున 'వే' తర్వాత విశ్రాంతి తీసికొనుటకు అవకాశము లేదు. సంస్కృత వృత్తములలో పాదాంతముతో పదముకూడ అంతము కావలెనన్న నియమమున్నది. దానిని తెలుగుపద్యములలో పాటింపరు. ఇందువలన శ్రీ అనంతకృష్ణశర్మగారు చెప్పినట్లు "అందందు రసభావానుగుణంగా ఆ లయనుగూడ మనము సడలించుకొనవలసి యుండను". అందుచేతనే నన్నయాది కవులెల్లరును పాదాంత విశ్రామమును - పెక్కుచోట్ల పాటింపలేదు. అయినను లయగుప్తముగానయినను ఉన్నదనుటకు ఈ ఉదాహరణములను ప్రదర్శించినాను.

లయ మరింత స్పష్టముగా నున్న వృత్తములు పెక్కులున్నవి. అట్టివే నన్నయాది కవులు వాడుకొన్నారు. లింగమగుంట తిమ్మకవి తన బాలబోధచ్ఛందములో లయ సులువుగా తెలుసుకోగల వృత్తములనే మొదట పేర్కొనినాడు. అవి యెట్టివో చూడుడు:

త్ర్యస్రగతిలో నున్నవి :-

పంచచామరము — జరల్ జరల్ జగంబుఁ గూడి సన్నుతిన్
రచింపఁగా ।

సుగంధి వృత్తము- ఏడు హాముమ్మలున్ గమున్ వడెన్మిదిన్
సుగంధికిన్ ।

ఉత్సాహ ,, - సాహచర్య పద్మమిత్ర సప్తకంబు గురువు ను
త్సాహవృత్తమునకె చెల్లు జలజదళవిలోచనా॥

తరళ ,, — నసన నసన నగము లెలమి నళినహితవిరమణతన్

తరలి ,, — చారుభసన భూరిజన రసాంద్ర గణములన్ దిగా
సార విరతి నందముగ నిజంబు తరలిచెన్నగున్

చతురస్రగతిలో నున్నవి :—

పాదప వృత్తము - పాదప వృత్తము భాభగ గంబుల్

తోటక ,, - తుదిదాఁక సకార చతుష్కముగా
విదితంబుగఁ దోటక వృత్తమగున్ ।

రమణక ,, - మనసిజ జనక సమదరిపుగజహారి మదగజ
వసువిరమణములతో
నననన నననన నలగము లెనయఁగ నరవరనుత
రమణక మమరున్

మానిని ,, — కారములున్ గ్రియఁ ? గ్గొన నేడు భకారము
లొక్క గకారముతో
గారవమై చనఁగా వళులన్నియు గల్గిన మానిని
కామనిభా।

కవిరాజవిరాజితము- క్రమనుగ నొక్క నకారము
నాలు జకారములన్ బరఁగంగ వకా
రమును నొడంబడి రాఁగవిరాజవిరాజితమన్న
దిరామనిభా।

మలయజ వృత్తము-నళినవిలోచన నజన సనంబులు నన భగణంబులు
నవిలగమున్

పాథ్వీ ,, - నారద సనకసనందన వినుత సనాథ భన జన
సనాభగురుల్

లాక్షణీ ,, - పక్షవిరమణము భనననన ములును భాసుర
భనన స లెనసినచో

స్వాగత వృత్తము - స్వాగతంబగు లసగ్గుణ లక్ష్మీ
భాగ్యభోగ రన భల్ గగ యుక్తిన్

వంశస్థ ,, - సముజ్జ్వలాంగా జత జంబు రేఫతో

విద్యున్మాల ,, - ఉద్యన్మాగాయుక్తం బైనన్
విద్యున్మాలా వృత్తం బయ్యెన్ ।

తోవక వృత్తము - శ్రీయుత భత్రయ సేవ్య గగంబుల్
తోయజలోచన తోవక మయ్యెన్

క్రౌంచపద ,, - పంచశరాభా యంచిత పుణ్యా
భమసభ నననయ పరివృతమైనన్

**ఖండగతిని ఉన్నవి :—**

స్రగ్విణి వృత్తము - వాగ్వధూవల్లభా వార్ధి రేఫావళుల్
స్రగ్విణీవృత్త విశ్రాంతి యాటింటిపై ।

భుజంగప్రయాతము - జగద్గీతకీర్తీ భుజంగప్రయాతం

వనమయూరము - ఉన్నతములై వనమయూర కృతు లోలిన్
ఎన్నగ భజంబులపయిన్ నన గగంబుల్

వసంతతిలక - సారంబుగా తభజ జంబు వసంతరాజా
కారా వసంతతిలకంబగు గాయుతంబై

మంగళమహాశ్రీ - శ్రీమహిత లోకహిత శిష్టజన సేవిత
విశేషగుణ మంగళమహాశ్రీ

**మిశ్రగతి సున్నవి :-**

మత్తకోకిల - శ్రావకాశరణాంకవిస్రసజాభ రేఫల దిగ్విరా
మావహంబుగ మత్తకోకిల యండ్రు దీని
కవీశ్వరుల్

ధృవకోకిల - శుభవిలాస ముకుంద కేశవ శూలి భవ్య
విరామమున్

సంకీర్ణగతి నున్నవి :-

ఇంద్ర వజ్రము - ఇత్తా జగానం గతి నింద్రవజ్రా
వృత్తంబగున్ సన్నుత వృత్తరేచా ।

ఇల - గజ విక్రమంబున గనలు నిల యనఁగా
సజనాస లుండిన సకలకవి కృతమై

ఇంక కొన్ని వృత్తములందు తాళముల లయ కూడ కనబడును :-

5 2 5

భద్రక వృత్తము - విద్రుమా భర సంబునస్
భద్రకం । బుధ । రీతిపై

హాలముఖి - కింకరీ । కృత । సురవరా
పంకజా । తద । నయనా
పొంకమౌ రన । సగణముల్
శంకలే । క హాలముఖికిన్

ఇవి ఖండజాతి మఠ్యతాళము వరుసను (101) నడచుచున్నవి. తనుమధ్య యను వృత్తములో చతురస్రజాతి మఠ్యతాళము లయ కలదు :- గోపాలుని దేవే నాపా లికి నాఁగాఁ

4 2 4 4

వృంత - నగణ యు గము । సగణం బొందున్
గగ మొక । టియు। జతగాఁ। గూడన్ ॥

ఇది చతురస్రజాతి ధ్రువతాళము వరుసను నడచుచున్నది. (1011 + 4 + 2 + 4 + 4)

లక్షణకర్తలు వృత్తములకు లక్షణము చెప్పిన పద్యమే లక్ష్యముగా రచించినారు. కాని కొన్నిచోట్ల అట్టి పద్యములు ఆవృత్తముల నడకను సరిగా నిరూపించుటలేదు. ఉ విచికిలిత, పాలాశదళము (త్ర్యస్రగతి), తురగము మొ విచికిలిత అప్పకవి చెప్పినది:—

ప్రవిలయ సమయమునను బర-పడి జలనిధి నడుమ సద్
భువనములు కడుపున నిడుక - భుజగపతి శయనముపై
నవిరళమతిఁ గురుకువరదుఁ-డని విచికిలితఁ బదుమూఁ
డవ యెడవడి యిరువదియొక - లఘువుగము బలుకనగున్.

ఇటువంటి లక్ష్య లక్షణ పద్యమునుబట్టి దీని నడక ఎట్లుండునో తెలిసికొనజాలము. ఇందులో 21 లఘువులును, చివర నొక గురువును గలవు కనుక ఇది త్ర్యస్రగతిని చక్కగా నడచును. ఈ వృత్తమును ఎట్లు రచింపనగునో చూడుడు :—

మునుల వలపు నబల బలము - ముదిమి సొగసు కల సిరుల్
చెనటి హితము విషము రుచియు - చెఱల సుఖము పగ హితుల్
తనివి తృషను కపికి స్థిరత - తమికి వెలుఁగు సెగ వగల్
శనికి సుకృతి శిలల రసము - సవతి చెలిమి కలుగునే॥

ఈ విధముగా రచించినయెడల దీని నడక సుగంధి, ఉత్సాహాది పద్యములవలెనే హృద్యముగా నుండగలదు. సుకాంతి, పంచచామరములు త్ర్యస్రగతిని నడచును గాని ఎదురు నడక గలవి. పంచచామరము పైని ఉదాహరించినాను. సుకాంతకు లక్ష్యము—' ఇదే యసిన్ మదాన్వితున్ సుదేవునిన్ వధించెదన్ '

**పాలాశదళము :—**

అదసదనున హరి నుతు - లమరు ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి-జనులు నుతియింపన్
బదునొకఁడగునెడ యతి - పదిలమునఁ జేరన్
గదియు నగణము లయిదు - గగము తుదనొందన్।

(అప్పకవి)

ఇందులో ఒక్క మొదటి పాదముననే దీని నడక కొంచెమయి నను తెలిసికొనగలము. తక్కిన పాదములలో నడక చెడినది. ఇంత కంటె అనంతుడు చెప్పిన పద్యములో దీని నడక ఎక్కువ చక్కగా కనబడుచున్నది :

అయిదులము లయిదులము - లయిదులములున్గా
లయఁ జనును ద్వరితగతి - లములు పది సాగన్
నియమమున వడి యమర - నిలుచు శ్రుతి కింపై
కయిదలను దనరు నిది - ఖగతురగ శౌరీ॥

(పాలాశదళమునకు త్వరితగతి యను నామాంతరము గలదు.)

ఇది ఖండగతిలో శ్రుతికింపుగా నడచును.

**తురగము :—**

నననన సజజగలు తథ విరమ-ణంబగున్ దురగంబునన్
గనలుచు నగరముపయి విడిసిన - గాంచి తా రొకరుం డెదు
ర్కొని దవులకుఁ గొని చని గిరి గుహఁ - గూర్కు నా
ముచికుందుచే

తను యవనుని౯ బోరి గొనివని౯ వసు-ధన్ గణింతురు భూసురుల్॥
(అప్పకవి)

దీని నడక తీరు ఈ లక్ష్యమునుబట్టి తెలిసికొనుట శక్యమా ?

ననల యుగళము హాభము రగణము - నాల్గు పజ్క్తుల
నొప్పఁగాఁ
దనరు విరమము ననల యుగళము - దాటగాఁ దురంగంబునన్

ఈ తీరున లక్ష్యలక్ష్యణ పద్యము రచితమయినయెడల ఈ తురగ వృత్తము తరళ, మత్తకోకిల, కరిబృంహిత మొ వృత్తముల వలెనే మిశ్రగతిని నడచునని తెలిసికొనగలము.

జాగ్రత్తగా పరీక్షించి ఏదో ఒక లయకు గాని ఒక తాళము నకు గాని సరిపడిన వృత్తములు వేలకొలదిగా పుట్టించుటకు అవకాశ మున్నది. ఏదో ఒక ఛందమందు పుట్టగల వృత్తములలోనే త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్రగతులలో నడచే వృత్తము లుండగలవు. ఇందుకు తార్కాణముగా పదియవ ఛందములో ఎన్ని వృత్త ములు ఏ యే గతులను నడపింపవచ్చునో చూపింతును :-

త్ర్యస్రగతిని — వెలఁది నాకు పిందు చేయఁగా

చతురస్రగతిని — నూరు పద్యములు గలవు. అన్నీ ఇక్కడ చూపించు టకు అవకాశము లేదు. అందుచేత కొన్ని మాత్రమే చూపించుచున్నాను :-

| | | | | వృత్తసంఖ్య |
|---|---|---|---|---|
| 1. | \|\|\|\| UU UU UU | — | నలగగ గాగాల్ - నాళీకాక్షా । | 16 |
| 2. | U\|\| \|\|U UU UU | — | క్రాలును భసముల్ - గాగాల్ పఙ్క్తిన్ | ,, 31 |
| 3. | UU \|\|\|\| UU UU | — | గాపై నలగగ - గంబుల్ రెండున్ । | ,, 61 |
| 4. | UU U\|\| \|\|U UU | — | క్రాలున్గా భస - గగముల్ పఙ్క్తిన్ | ,, 121 |
| 5. | UU UU \|\|\|\| UU | — | గాగా నల్గాల్ - క్రమమున నిల్చున్ | ,, 241 |
| 6. | UU UU U\|\| \|\|U | — | పఙ్క్తిన్ గాగా - భంబు సగణముల్ | ,, 481 |
| 7. | \|\|U \|\|U UU UU | — | ససగా గగముల్ - సాగున్ శౌరీ | ,, 28 |
| 8. | U\|\| U\|\| UU UU | — | భాగగగాల్ చతు - పాదంబందున్ | ,, 55 |
| 9. | UU \|\|U \|\|U UU | — | గాసా గగముల్ - గలుగున్ బఙ్క్తిన్ | ,, 109 |
| 10. | UU U\|\| U\|\| UU | — | గాభాగాలయి - క్రాలున్ శౌరీ | ,, 217 |
| 11. | UU UU \|\|U \|\|U | — | శౌరీ గాగా - ససముల్ వరలున్ | ,, 433 |

ఖండగతిని కూడ అనేక పద్యములు ఈ పఙ్క్తిచ్ఛందమున పుట్టుటకు వీలున్నది:- కేవలము లక్ష్యములను చూపించుచున్నాను. లక్షణము సులువుగా తెలిసికొనవచ్చును.

1. ఎవ్వఁడే వాఁడు? నను జూడఁగా
నవ్వి వేవేగ మిలు సొచ్చెనే!

× × ×

2. వాఁడెవ్వఁడే? మువ్వగోపాలుఁడే
రాఁడేల యీ వాడ కేనాటికిన్

× × ×

3. నమ్మకే యితఁ డన్నమాట ఓ
కొమ్మరో! మధుపాన మత్తుఁడే!
కమ్మగా బతిమాలి నిన్ను మై
కమ్ములో దిగజారఁ జేయునే॥

4. మధుపాన మత్తుఁడై యున్న నా
యధరంబు ముద్దిడన్ వచ్చెనే!
మధుసేవ మంచిదే యం చహో!
మధుపాత్ర నాకు నందిచ్చెనే!॥

5. మందార మకరంద మాయళీ
బృందంబు కడుపారఁ గ్రోలి యా
నందాంబుధిని నోలలాడి యా
చెందమ్ములను వ్రాలెఁ జూడవే॥

6. అదేమే? సంపెగలఁ జూచియున్
తదా వాసంబు చనఁ గోరవే!

మదోన్మత్తుండె యళిరాజు తా
నుదాసీనుండు నయి యుండునే!

౭. సొంపైన పుష్పంబు గాదందువా?
ఇంపైన గంధంబు లేదందువా?
సంపెంగ మాధుర్య మాపట్పదం
బింపారంగాం గ్రోల రాడెందుకో?।

8. మధుమాస పుష్పంబు లింపుగా
మధుపంబులన్ బిల్చు విందుకై

× × ×

మిశ్రగతి నడచు వృత్తములు కూడ ఈ పదియవ ఛందమును
సాధ్యములు కాగలవు:-

1. చిల్క పల్కుల చిత్రమేమో?
2. చిల్క పల్కుల చిత్రమదియే
3. చిల్క పల్కులె చెలియ పల్కెన్
4. చిలుక పల్కుల చిత్ర మేమో?
5. చిలుక పలుకే చెల్లి పల్కెన్
6. చిలుక పల్కె చెల్లి పలికెన్
7. చిల్క పలుకే చెలియ పల్కెన్
8. చిలుక పల్కె చెలియ పల్కెన్
9. అగ్నికే చెదలంటె నవురా!
10. అగ్నికిని మైలంటుకొనునే?

11. దేశ భాషల తెలుగు పల్కే
తీయనైనది తెలిసికోరా !

12. ఎవరికొంటు కీ యలంకారం
బెవరు కందు రిఁకెందుకమ్మో !

13. తాప మడపఁగఁ దామరాకుల్
దేహమునఁ జెలి ! కప్పినావా ?
తామరాకుల వలనఁ దాపం
బినుమడించెను జూడవమ్మో !

కేవలము ఛందమునందలి వృత్తముల గతినే చూపింపదలచితిని గనుక, యతి ప్రాస లక్షణములను పాటింపలేదు.

నన్నయనాటనుండి అనగా సుమారు వేయి సంవత్సరములయి పరిచితములయిన వృత్తములను అనేక రీతులను ఒక్కొక్క వృత్తము నెట్లు కవులు నడపినారో చూపించుటకు ఒక ఉదాహరణము :—

ఉత్పలమాల -

1. మాటలురావె ? మొండితనమా ? ఘనమా ?
సుకుమారమా ? రమా !

2. ఎంతు నుతింతు సంతత మనంతు భజింతు రంచిశు కీర్తనల్ ।

చంపకమాల —

3. చిలుకలకొల్కి నీపలుకు చిల్కల పల్కుల కంటెఁ దీయనై ।

సంగీతములో గ్రహభేదము ( Model shift of Tonic ) వలన ఒక రాగమునుండి మరియొక రాగమును పుట్టించుటకు అవకాశ మున్నట్లే ఒక వృత్తమునుండి మరియొక వృత్తము ఎట్లు పుట్టింప

వచ్చునో తెలియఁజేసెను. పైని చెప్పిన చంపకమాల చరణమునుండి ఎట్లు పుట్టింపఁగలమో చూడుడు :-

చిలుకల కొల్కి నీ పలుకు చిల్కల పల్కుల కంటెఁ దీయనై
చిల్కల కొలికి నీ పల్కు చిలుకల పలుకుల ,, ,,

క్రింద గీట్లు గీచిన అయిదు చోట్లను రెండు విధములయిన గణములు ఒకేవిధమగు నడకను తెలియజేయును. అందేదయిన నొకటి చేర్చుకొని పద్యము రచించవచ్చును. 19 నుండి 24 వఱకును గల 6 ఛందములకు చెందిన వృత్తములు ($2 \times 2 \times 2 \times 2 \times 2 = 32$) 32 పుట్టింపవచ్చును. నడకకు ఆయువుపట్లుగా ఉన్న ఏవో చూచుకొని, ప్రస్తరించుటకు అనువైనచోట్లనే ప్రస్తరించవలెను. అప్పుడుద్దిష్టమైన నడక చెడదు. ఈ 32 వృత్తములందును రెండు విధములయిన ఉత్పలమాలా చంపకమాలలు ఇదివఱకే ఉన్నవి.

ఈ విధముగానే మఱికొన్ని వృత్తములనుండి క్రొత్త వృత్తములు పుట్టింపవచ్చును :-

శా. నారీ రత్నమ తీఱె సంశయ మిఁకన్ నన్ బిల్చి నిన్ బిల్వఁడే
నవలా
నను బిల్చి నిను బిల్వఁ
నన్ బిలిచి నిన్ బిలువఁ
నను బిలిచి నిను బిలువఁ

19 నుండి 24 వఱకును గల 6 ఛందములకు చెందిన 32 వృత్తములు పుట్టును. ఇందు శార్దూల మత్తేభ విక్రీడితలు రెండు ఇదివఱకే ఉన్నవి.

ఈ విధముగా శిఖరిణీ స్రగ్ధరా వృత్తముల చాయను క్రొత్త వృత్తములు పుట్టింపవచ్చును. అందుకు కొన్ని చరణములు లక్ష్యములుగా చూపింతును :–

శిఖరిణి –

జగన్నాథస్వామీ ! నయనపథగామీ ! పలుకుమా (గణముల తీరు ఇదివఱకున్నదే)

జగన్నాథస్వామీ ! సత్యపథగామీ ! పల్కుమా
అదేమే ? సీతమ్మా ! అలుగవలదే, మాట వినవే
మహారాజ శ్రీమాన్ కనక రాజా ! భాను తేజా !

స్రగ్ధర –
ఏదైనా మంచిదైతే-ఎవరు పలికినా-ఎట్టిదైనాను విందాం
మహాస్రగ్ధర –
ఎదియైనామంచిదైతే-ఎవరుపలికినా-ఎట్టిదైనానువిందాం
(ఇదివఱకున్నదే)

స్రగ్ధరచ్ఛాయ–
ఏదయినా మంచిదయితే-ఎవరు పల్కినా-ఎట్టిదయినాను విందాం
విన్నారా ఎప్పుడయినా? ఎవరు పల్కినా-ఇట్టి శుభమైన వార్తన్
కన్నావా జలజనయనా ! ఎచట కంటిమే-ఇట్టి సొగసైన దృశ్యం?

ఇంకను ప్రసిద్ధములయిన వృత్తముల రీతిని క్రొత్త వృత్తములు రచింపవచ్చును. తప్పెట వాద్యమువలె గాక గుప్తమయిన లయ గలిగి నడక చెడని క్రొత్త వృత్తములు :-

మాధవ వృత్తము (కృతిచ్ఛందమున 355736-వది):-

పడఁతి ! మువ్వగోపాలుఁడు మెచ్చని - పాట లవేటి పాటలే ?
మడఁతి ! యాతఁడాలింపకయుండిన - మాట లవేటి మాటలే ?

కడుఁ బెనంగ మోమోడుచు నిచ్చిన - కౌఁగి లదేటి కౌఁగిలే?
గొడవసేయ నాతం డొనఁగూర్చిన - కూట మదేటి కూటమే?

దీని లక్షణము :—

మధుర వాగ్ఝరీ వీచికలన్దను-మధ్యలతోడ హాయిగా
మధువనంబులోఁ గ్రీడల నొప్పును-మాధవుఁడన్న రీతిగా।
గ్రథితమై శుభంబై నరభాగ్రభల-గంబులఁ బాడి రమ్యమై
మధురమై కృతిచ్ఛందమునందున-మాధవ వృత్త మొప్పెడున్ ।

మహోదయ వృత్తము (ఆకృతిలో – 14-2051 – వది)·-

బాలకృష్ణుఁ డీ గోపికతోడను - బల్కిన పల్కులు నీవు వింటివే?
'పాలకుండ లీ రెండును వట్టివో - వాలు బట్టివో పట్టి చూతునా?
పల పల్కవో గోపిక! కోప మ-దేటికిఁ జూపుదు? నంగనాచివా?
జాలమేల? యేమందువు? పల్కుము - సారసనేత్ర!'
యటంచుఁ బల్కెనే!

దీని లక్షణము :—

ఎప్పుడెక్కడానంద కిశోరుఁడు-హృద్యముగాఁ గన వేణువూదునో
అప్పుడక్కడానందముతో మధు-రాంగనలుందుర టన్నరీతిగా
నొప్పునాకృతి చ్ఛందమునందు మ-హోదయ వృత్తము
రుద్ర విశ్రమం
బొప్పఁగన్ హారమ్ముల్ మొదలన్ దుది-నుండును భంబులు
నాల్గు తూకొనున్।

రూపకతాళము (2 + 4) లో కొన్ని వృత్తములు నడపింప వచ్చును.

౬ మదరేఖ —

గోపాలాఖ్యుఁడు నిచ్చల్ - మా పాలన్ గలఁడంచున్
రూపించన్ మసగంబుల్ - దీపించున్ మదరేఖన్।

ఇది పదకొండక్షరములు గల చిన్న వృత్తము. ఇంతకంటెను పెద్ద చరణములు గల వృత్తములు రూపకతాళము లయను కల్పించ వచ్చును. ఉదా

అనుసారిణి వృత్తము (అతిధృతిలో 130684 వది):-

అనుసారిణి యను వృత్తం-బగు నతిధృతి యను ఛందం
బున రూపక మను తాళం-బున నడచును శ్రుతికింపై
చను నాలుగు చరణంబుల్ - సనయన నసగము లొప్పన్
సనయంబులు చను నంతన్ - జరణములను వడి నిల్పన్॥

2. రూపకవృత్తము (అతిధృతిలో 130975 వది) :—

రూపకమను వృత్తంబగు-శ్రుతికనువుగ నిధివళ్ళన్
బ్రాపు గనల గాలాములు-ననలలగగములు నిల్పన్

3. హాలవృత్తము (అత్యష్టిలో 7792 వది):—

హాలమను వృత్తమునందున్-యతినిధిపైఁ జెన్నొందున్
నలగముపై సగమొప్పన్ - నలగమముల్ జోడింపన్

4. వాణీవృత్తము (అత్యష్టిలో 25597 వది):—

వాలాయముగను దిశయతి-వాణీవృత్తము సొంపై
క్రాలున్ తల నల లల మస-గంబుల్ పాదము లందున్

౬. కళ్యాణీ వృత్తము (అత్యష్టిలో 51193 వది) :—

కళ్యాణంబగు నిధియతిఁ-గవితన్ గూర్పన్ జనునీ
కల్యాణిన్ మనల లలస - గభగంబుల్ పాదములన్

ఈ విధమున క్రొత్త వృత్తము లెన్నయినను కల్పింపగలము. మఱి కొన్ని క్రొత్త వృత్తములు :—

**కవికాంత** (ఆకృతిలో 141279 వది) :-

శూరుఁడు వీర్యపరాక్రమోన్నతుఁడు - సుశ్లోకుండు జనార్దనుండు కం
సారి మురాసురవైరి మాధవుఁడు - సౌమ్యుండంచు హరి న్నుతింపఁగా ।
భారనమస్జగముంచి భానుయతి - పాటింపన్ గవికాంత యాకృతిన్
సూరి జనస్తుత వృత్తమై తనరు - సొంపారన్ గవి చెప్పఁగల్గినన్॥

"వీరులు శూరులు వీరుగో!" యనిన - వీర్యంబెక్కడ ? శౌర్యమెక్కడే ?
ధీరతఁ జూపని పిచ్చి సాహసులు - ధీరుండైన పరాక్రమోన్నతుం
డీ రణమందు జయంబు నందు ధృతి - హీనుండైన జయంబు నందునే ?
కారులు కూయుచు మేకపోతు వలె - గాంభీర్యంబుమ జూపు ధీరువుల్॥

ఇందు ప్రతి చరణము చతుర సగతి ఆదితాళమునకు సరిపోవును. దీనిలో మొదట నున్న భగణమునకు బదులుగా నలమును, యతి స్థానమునందున్న మగణమునకు మాఱుగా సగణ గురువును నిల్పి క్రొత్త వృత్తము లీ చాయను రచింపవచ్చును.

హేమంతవృత్తము (అతికృతిలో 9585810 వది) :-

జనున్యంరార తాతాగముల్ భానువి - శ్రాంతిన్దగన్
గూర్ప హేమంత వృత్తంబగున్॥

ధనుర్మాసంబు వచ్చెన్గదా యింక నీ - దాస ర్లుషఃకాల
మైనంత నే లేచి ప

ట్టినామాల్ పెట్టి బోనాలు గావించి ద-ట్టీల్ గట్టిగాఁ గట్టి
కై చిర్తలం బట్టి రం।

గ సిన్ గీర్తించుచున్ బోయి భిక్షాటనల్ - గావింత్రు
మధ్యాహ్నమందెల్ల సాయంతనం

బినుం డస్తాబ్ధిలోఁ గ్రుంక బియ్యంబుతో - నింపారు పాత్రంబు
దెత్తుర్గదా యిండ్లకున్॥

స్వయా వృత్తము (ధృతిలో 27223 వది) :-

ఆయుశ్ర్యయుక్తంబై - యగ్నీంద్వీందు
రసాభిన్ గణనీయంబై

స్వయావృత్తంబీశా! - చెన్నారున్ ధృతియన్
ఛందమునం దెన్నన్।

మా యుక్తిన్ రమ్యంబై - మా మాలన్ సభ
మాలన్ గడు శ్రావ్యంబై

మా యుగ్మంబైనంతన్ - పాటింపందగుఁ
పాదంబుల విశ్రాంతిన్

ఓనాఁడా? రెణ్ణాళ్లా? - ఉన్నన్నాళ్లును కష్టాలకు లోనై తిన్
నేనేలా జీవింపన్? - దీనాత్ముండను దుఃఖార్తుఁడనై యున్నా।

నేనాఁడో యోనాఁడో - హేయంబైన శరీరంబు నశించున్ గా ?
యీనాఁడే కారాదా - యీ జీవాత్మకు మోక్షంబిక గోవిందా !

ఛందముల విధానము సంగీతశాస్త్రములో గల మేళకర్తల విధానమువంటిది కాదు. స్వరముల గుణమును బట్టి ఏర్పడినవి మేళకర్తలు; చరణమందలి అక్షర సంఖ్యను బట్టి ఏర్పడినవి ఛందములు. సరిగమపధని అను యేడు స్వరములందును రిషభము గాంధారము మూడేసి విధములుగా నుండును గాని అందులో శుద్ధ రిషభమునకును అంతర్గాంధారమునకును నడుమనున్న స్వరములు రెండే చతుశ్శ్రుతి రిషభమే శుద్ధ గాంధారము; షట్శ్రుతి రిషభమే సాధారణ గాంధారము కనుక ఈ రెండు స్వరములకును గల స్థానములు నాలుగు మాత్రమే. అందుచేత రిషభ గాంధారములను ఆఱు విధములయిన వరుసల నేర్పడును. (1 + 2, 1 + 3, 1 + 4, 2 + 3, 2 + 4, 8 + 4) ధైవత నిషాదములు గూడ ఈ విధముగా ఆఱు భిన్నములయిన వరుసల నుండును మధ్యమ స్వరము రెండు విధము లయినది. షడ్జ పంచమ స్వరములలో భేదములు లేవు. కనుక స రి గ మ ప ధ ని అనే స్వరములు $6 \times 6 \times 2 = 72$ విధములుగా నుండును. అందుచేత మేళకర్తల సంఖ్య 72 మాత్రమే; అంతకంటె ఎక్కువ కాదు తక్కువ కాదు. అక్షర సంఖ్యను బట్టి ఏర్పడ్డ ఛందములు 26 గా ఉన్నను ఆ సంఖ్య ఏ గుణమునుబట్టియు నేర్పడినది కాదు. ఏదో ఎక్కుడనో ఒక సంఖ్యవద్ద ఆపుదమన్న ఉద్దేశముతో నిర్ణయించినదే కాని అందుకు సహజసిద్ధమయిన హేతువు లేదు. ఈ ఛందములలో మొదటి అయిదు ఛందములకు లక్ష్యములు లేవు. 26 కంటె ఎక్కువయిన అక్షరములు గల లయగ్రాహి మొదలయిన వృత్తము లున్నవి. వానికి మాలికావృత్తములని పేరు. ఏదైనా ఒక మేళకర్తకు చెందిన

రాగములన్నిటను రిషభ గాంధారాలు మధ్యమ స్వరము ధైవత నిషాధాలు ఒక్క గుణము గలవిగానే ఉంటవి. మేళకర్తలకు స్వరముల గుణము ప్రధానము గాని సంఖ్య కాదు. ఛందములకు అక్షరసంఖ్య ప్రధానము గాని అక్షరములందు గల గురు లఘువుల పొందిక, నడక ప్రధానము కాదు. ఒకే ఛందమందు పుట్టిన వృత్తములలో త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణగతులందు నడవగల వృత్తము లుండగలవు. ఒకే గతిలో నడవగల వృత్తములు తక్కిన ఛందములలో కూడ నుండగలవు. రాగమునకు స్వరముల గుణము ప్రధానమైనట్లు వృత్తమునకు నడక ప్రధానమైనది. కనుక వృత్తములను నడకవిధముల ననుసరించి ఛందముల వర్గీకరణము చేయుట మంచిదని నా యభిప్రాయము. ఈ వర్గీకరణము ఎట్లు చేయనగునో మఱియొక ప్రకరణమున తెలియజేసెదను.

వేదములో పైని చెప్పిన ఛందము లున్నవి కాని అవి వృత్తముల వంటివి కావు. వృత్తముల పాదములందు అక్షరసంఖ్యా నియమమే కాక గురు లఘువుల క్రమ నియమ మున్నది. అంతేకాదు వృత్తములన్నీ నాలుగేసి పాదములు గలవి. ఋక్కులందు పాదముల సంఖ్య మారుచుండును. ఉదా॥ గాయత్రీ ఛందమునకు మూడే పాదములు. అందొక్కొక్క పాదమునకు ఎనిమిదక్షరము లుండును. అనగా మూడు త్రికములు + 2 అక్షరములు. ఈ త్రికములును ఈ రెండక్షరములును మూడు పాదములందును ఒకే తీరున నుండవలెనన్న నియమము లేదు. ఒక్కొక్క పాదములో అక్షర సంఖ్య 8 కంటె తక్కువగా ఉండును. అందుకొక ఉదాహరణము:-
"తత్స వితుర్వరేణ్యం" ఈ పాదములో [illegible] ఉన్నవి.
'వరేణ్యం' అను పదము 'వరే[illegible]' అని ఉచ్చరించినప్పుడు [illegible]

8 అక్షరములును కనబడును. ఈ విధముగా "స్వేదమే" అనునది "సువేదమే"గా ఉచ్చరించినపుడు అక్ష్యరసంఖ్య నియమబద్ధ మగును. మఱియొక ఉదా ఆహిప్మాసూనవే పితా పిర్యాజత్యాపయే । సఖా సఖ్యే వరేణ్యః ఇందు 'పిర్యాజత్యాపయే' పిరియజతియాపయే అనిన్ని 'వరేణ్యః వరేణియః' అనిన్ని చదవవలెను.

ఇట్లు చేసికొనుటకు "ఇయాది పూరణాత్" అను సూత్రమును బట్టి అవకాశ మున్నది.

పైని పేర్కొన్న 26 ఛందములందును మొదటి 5 ఛందము లును అప్రసిద్ధములు. తక్కిన 21 ఛందములును ఏడేసి చొప్పున మూడు వర్గములుగా విభజించి మొదటి ఏడును "దివ్య"చ్ఛందము లనియు, రెండవ ఏడును "దివ్యేతర" (మానుష) చ్ఛందములనియు, కడమ ఏడును "దివ్య మానుష" చ్ఛందములనియు పరిగణింతురు.

ఋక్కులందు రెండు పాదములు రెండేసి అక్షరములు అధిక మైనవి గాను మిగిలిన పాదములు ఉద్దిష్టసంఖ్య గలవిగాను ఉన్న యెడల అవి "స్వరాట్టు" లనబడును. రెండక్షరములు తక్కువయి నవి "విరాట్టు" లగును. ఒక్క అక్షరమే ఒక పాదమందు అధిక ముగా గలవి 'భురుక్కు' లు; ఒక అక్షరము తక్కువయినవి 'నివృత్తు' లు.

తెలుగులోని ఛందోరీతులకు ఇవి ఉపయుక్తములు కావు కనుక వేదమందలి ఛందస్సులను ఇంతకంటె ఎక్కువగా వివరింప నక్కఱ లేదు. కాని, ఉదాత్తాది స్వరములు గలవి కనుక ఋక్కులు గేయ లక్షణములు గలవి. కనుక గేయ ప్రకరణమునందున ఈ ఋక్కుల ప్రసక్తి మరియొకసారి అవసరమగును.

శ్లోకము :— తెలుగులో ఛందోబద్ధములయిన వన్నియును పద్యములను రీతిని సంస్కృతములో ఛందోబద్ధము లయిన వన్నియు శ్లోకము లందురు. కాని శ్లోక మనునది అనుష్టుప్ ఛందమందొక వృత్తవిశేషము. నాలుగు పాదములందును సమానముగా ఎనిమిదేసి అక్షరము లుండుటే ప్రధాన లక్షణము. నాలుగు పాదము లందును సమానముగా గురులఘువుల క్రమముండవలెనను నియమము లేదు. కాని, ప్రతి పాదమందును 5 వ అక్షరము లఘువుగాను, 6 వ అక్షరము గురువుగాను, 7 వ అక్షరము మొదటి పాదమందును, రెండవ పాదమందును గురువుగాను, రెండవ నాల్గవ పాదములందు లఘువు గాను ఉండవలెనన్న నియమమున్నది. 8 వ అక్షరము పాదాంత మయినది కనుక అది హ్రస్వాక్షరమయినను గురువుగానే ఉచ్చరింప వలె నను నియమము తక్కిన వృత్తములకు వలెనే దీనికిని వర్తిం చును. ఈ శ్లోక మనునది వాల్మీకి మొట్టమొదట రచించెననియు, నిషాదుడు క్రౌంచమిథునమున నొకదానిని చంపినప్పుడు, ఆ దృశ్య మును జూచి శోకించి చెప్పినది శ్లోక మయ్యె ననియు చెప్పుదురు. "శోచతో క్తం మయా యస్మాత్ తస్మాచ్ఛ్లోకో భవత్వితి" (రామాయ ణము) అను వాక్యము దీనికి ప్రమాణము. శ్లోక మనగా స్తుతి యను నర్థము కలదు కనుక స్తుతిపరములయిన కావ్యములందు శ్లోక రచన ప్రాముఖ్యమును వహించినది. తెలుగులో శ్లోక రచన జరుగలేదు. కాని పండితులకే కాక పామరులయిన తెలుగువారికి కూడ శ్లోకమునకు గల నడక చక్కగా పట్టుపడినది. పరియాచకముగా

"పుష్పాణాం శ్వేత పుష్పాణాం పూయవే తెల్ల మల్లికా।
కాయానాం చిన్న కాయానాం కాయవే పొట్టి కాకరీ".

అని పాడుకొనుచుందురు. కాని శ్లోకమునకు తెలుగు ఛందోరీతు లందు ప్రవేశము కలుగలేదు. ఈ విధముగా తెలుగు కావ్యములలో ప్రాచుర్యము లేని కొన్ని వృత్తముల తీరు పాండిత్యములేని తెలుగు వారికి కూడ పట్టుపడినవి. ఒకరు చదరంగమాడుచు ఎదుటివాని గుఱ్ఱమును చంపుచు "వేంచేసెనే గుఱ్ఱము దేవలోకమ్" అనగా విన్నాను. "ఏకైక డుడ్డుః కుల పండితానాం, దుడ్డుద్వయం కుండల పండితానాం। ఏగాని యేగాని కవీశ్వరాణాం, గవ్వద్వయం చిల్లర బ్రాహ్మణానాం" అని కొందరు పాడగా విన్నాను. మరియొకరు శ్రీకాకుళము జిల్లాలో సముద్రతీరమున ఉప్పు పండించు నౌపడా గ్రామమును ఉద్దేశించి "నవరుచులకు తల్లీ నౌపడా ఉప్పు గల్లీ!" అని మాలినీ వృత్తపాదము ఆశువుగా కూర్చినారు. వివాహ సమయమున లగ్న ముహూర్త వేళకు ముందుగా వధూవరుల నడుమ తెర కట్టి ముహూర్తకాలము సమీపించినంతవఱకును మంగళాష్టకములు చదువుచుండెడు బ్రాహ్మణులు తమకు వచ్చిన శ్లోకములు అన్నీ చదువుట అయిన తర్వాత ఇంకను ముహూర్తమునకై కాలక్షేపము చేయవలసివచ్చినప్పుడు ఏవో కల్పన శ్లోకాలు చదువుచుందురు. ఒక పల్లెలో అట్టి సమయమున ఒక బ్రాహ్మణుడు, "ఇంట్లో వస్తువు లింటివారి వయితే ఇల్లైతె మన్దేకదా ... శ్రీలక్ష్మినారాయణ ... సావధానా స్సావధానా" అన్నాడు. ఈ విధముగా కొన్ని వృత్తముల నడకలు తెలుగు వారికి సుపరిచితము లయినవి.

కొలది దినములక్రిందట నా బసకు వసంత అను పేరు గల బాలిక వచ్చినది. ఆమె హిందీ లెస్సగా చదువుకొన్నది. ఆమెతో

ప్రసంగించుచు వేడుకగా "వసంతా! హిందీలో వచన రచనల్ చేయగలవా?" అన్నాను. 'వచన రచన' అన్నంతవఱకు నా మాటలు శిఖరిణీ వృత్తగతిలో సాగుచున్నవని నేను గుర్తింపలేదు. గుర్తించి నేను 'రచనల్' అని వెంటనే సవరించుకొని పాదముపూర్తి చేసినాను. దానికి సమాధానముగా ఆ బాలిక "జనాబ్ మైంని క్త్రీహూం మధురగతిసే గద్యరచనా" అని 'గేయరచనా' 'పద్య రచనా' అను మాటలుసైతము జోడించినది. "నీకు శిఖరిణీ వృత్త లక్షణము తెలియునా? అన్నాను. "నాకు తెలియదు; కాని మీ రన్న పదముల రచనబట్టి, దాని నడక గ్రహించి నేను ఆ గతిలోనే చెప్పగలిగినాను" అన్నది.

పద్యరచన లెస్సగా అలవర్చుకొన్నవారికి ఆ యా పద్యముల నడకయే జ్ఞప్తియం దుండును గాని అందలి గణములు జ్ఞప్తియం దుండవు. ఆశువుగా పద్యములు చెప్పగల యొక గొప్ప కవిని మందాక్రాంతకు గణము లేవి? అని నేను అడిగినప్పుడు "నానా నన్నం ననిననినం నాన నన్నాన నన్నం" ఇది దాని నడక చూచు కొంటూ...ఇవీ గణాలు అని అతడు పల్కెనె కాని గణములు వెంటనే చెప్పలేకపోయినాడు. గణములు త్రికములుగా చెప్పినప్పుడు వృత్తముల నడక పట్టుపడదు. అందుచేత నడక పట్టులను గుర్తించి గణము లను నడకను పట్టి ఏర్పరచి లక్షణమును చెప్పుట మంచిది. ఛందః ప్రస్తారము సైతము నడకను పట్టియే ఏర్పడుట సమంజసమని నా యభిప్రాయము.



## రెండవ ప్రకరణము

## పద్య రచన పుట్టుపూర్వోత్తరములు - పరిణామము

ఏ దేశమందయినను,ఏ భాషలోనయినను గద్యసాహిత్యమునకు పూర్వము పద్యసాహిత్యము, ఆ పద్య సాహిత్యమునకు తొలి మెట్టుగా గేయ సాహిత్యము వృద్ధి పొందినవి. గేయము సహజసిద్ధ మయినది. గేయమునకు ప్రధానములయినవి స్వరము, గతి. ఈ రెండును సహజ ధర్మములే. కోడి, కోయల మొదలగు పక్షుల కూతలు స్వరయుతములు. మానవులవలె మాటలాడలేకపోయినను అవి తమ జాతి పక్షులకు తమ మనోభావములను తమ కూతలలో గల స్వరగతులమూలముననే తెలియజేయగలవు. ఆ కూతల అర్థమును తెలిసికోగల శక్తి నాగరకులమని యనుకొన్న మనకు తగ్గిపోయినది; కాని, అనాగరకులని మనము అనాదరించుచున్న సవరలు మొదల యిన ఆదివాసులకు ఆ శక్తి ఎక్కువగా నున్నది. అడవిలో పులి యఱపులను విని అది యాపదవలన అఱచుచున్నదో, ఆకలిబాధచే అఱచుచున్నదో, కామముచే నఱచుచున్నదో సవరలు తెలిసికొనుట నేనెఱుగుదును. అంతేకాదు. సవరలలో చిన్నపిల్లలు పిట్టల కూత లను అనుకరింపగా విన్నాను. మగపిట్ట కూతకును ఆడుపిట్ట కూత కును - కొన్ని పిట్టల విషయములో - భేదముండుట వారివలన నేను గుర్తింపగలిగితిని. కోడిపుంజు తెల్లవారుసమయమున 'కుక్కుర్ కో కో' యని మూడు స్వరములలో కూయుట మనకు తెలిసిన విషయమే

కదా? కోయిల పంచమ స్వరమున చేయు రుతము జగత్ప్రసిద్ధము గదా? మనము మాటలాడు వాక్యములలో అర్థమునుబట్టి స్వరములు కొంచెమయినను మార్పుచెందుట సహజము. 'ఎంత పెద్ద చెట్టు!' అని ఆశ్చర్యముతో పలికిన మాటలే 'ఎంత పెద్ద చెట్టు?' అని ప్రశ్నార్థకముగా అన్న వాక్యములో ఉన్నవి. కాని అర్థభేదమును సూచించుటకు అనువుగా స్వరభేదము కలుగుచున్నది. ఈ భేదము సరిగమ పధని అను స్వరములతో సూచింపలేము. ఎందుచేతననగా ఈ స్వరభేదము పైని పేర్కొన్న రెండు స్వరముల మధ్యమందే జరుగుచున్నది. ఈ అల్పస్వర భేదమునకు intonation అని ఆంగ్లభాషలో పేరు. ఈ intonation కృషి ఆంగ్ల శబ్దశాస్త్రజ్ఞులు కొంత సాగించి intonation curves నుపయోగించి ఈ స్వరభేదమును సూచిస్తున్నారు. ఒకరు వీణవంటి వాద్యమును చేయించి అందులో షడ్జస్వరమునుండి మధ్యస్వరమువరకు 20 మెట్లు పెట్టుకొని intonation స్వరభేదములను కృషి చేయుచున్నారు.

గేయములలో గల రాగరస భావముల కృషి మనదేశములో ఎక్కువగా సాగినది. అది నిరూపించుటకు ఒక్క విషయము ఉదహరించెదను. రాగరసభావైక్యమును చక్కగా పరిశీలించి పాటించిన వాగ్గేయకారులలో ప్రఖ్యాతిహొందినవారు క్షేత్రయ, త్యాగరాజు మొదలయినవారున్నారు. వారిలో క్షేత్రయపదములందలి రచన ఎట్లు సాగినదో కొంచెముగా సూచింతును. అంతకంటె ఎక్కువగా వ్రాయుటకు ఇక్కడ అవకాశము లేదు. శోకరసములో బాహ్యమాత్రమయిన దుఃఖము, ఉపశమించుకోగల దుఃఖము, దుర్భరమైన దుఃఖము, హృదయవిదారకమయిన దుఃఖము-ఈ విధమున దుఃఖా

వస్థలను వర్ణించు పదములను రచించునప్పుడు ముఖారి, ఘంట, నాదనామక్రియ, పున్నాగవరాళి మొదలయిన రాగములలో ఏ రాగమే యవస్థకుచితమయినదో ఆలోచించి క్షేత్రయ తన రచన సాగించినాడు; ఒక్క రసమును మాత్రమే నిరూపింపగల పున్నాగవరాళి వంటి రాగములను అనేక రసములను నిరూపింపగల కాంభోజివంటి రాగములను ఉద్దిష్టభావముల కనుకూలముగా క్షేత్రయ తన పదములను రచించినాడు. సంగీత శాస్త్రజ్ఞులవలన ఈ రాగరసభావముల ఐక్యము మనకు తెలియవచ్చినది. నిజమే కాని స్వరములకును స్వరముల కూర్పునకు గల శక్తి సహజముగా నున్న దే కదా? అది స్వానుభవమునుబట్టి అందఱును కొద్దిగానో గొప్పగానో తెలిసికొనుచుందురు.

స్వరము వలెనే నడకకూడా సహజసిద్ధమయినదే. బాలుడు, కుంటివాడు తప్ప తక్కినవారందఱును గతిలో తప్పటడుగులు వేయక సరళముగా నడచుచుందురుకదా? నడకలో మందగమనము, త్వరితగమనము, పరుగు మొదలయిన భేదము లున్నా గతి రీతిలో తప్పు వాటిల్లదు. ఆ విధముగానే హృదయమునందలి మీటుగాని నాడియందు మీటుగాని — రోగము లేక దేహము స్వస్థతలో నున్నప్పుడు గతి తప్పకుండ నుండును. అందుచేతనే లయజ్ఞానము మానవునికి సహజముగా పట్టుపడును. అల్పముగానయినను స్వరలయజ్ఞానము పిల్లలకు కూడ సహజముగానే అలవడును. ఇందుకు తార్కాణముగా నా యనుభవములో గల రెండు ముచ్చటలు తెలియజేసెదను :

ఒకసారి మా యింట దసరాలో బొమ్మల కొలువు పెట్టినారు. నా పెద్దమ్మాయి పదేండ్లది ఆ కొలువులో తన బొమ్మలతోపాటు

నాలుగేండ్ల యీడుగల తన చెల్లెలి చందనపు బొమ్మకూడా పెట్టినది. ఆ మర్నాటి యుదయము ఆ చిన్న పిల్ల ఆ కొలువువద్దకు పోయి తన బొమ్మ తీసికొనుచు -

"నా బొమ్మా నేనూ తీసూకొంటానూ
తీసుకొంటానూ తీసుకొంటాను"

అని పాడుకుంటూ తీసికొన్నది. ఈ పాట ఆమెకు సహజసిద్ధముగా వచ్చినదే.కాని ఒకరు నేర్పినది కాదు. ఇందులో ఛందస్సున్నది. స్వరమున్నది, నడక ఉన్నది. అంతేకాదు పాటలకు కావలసిన పల్లవి (refrain) వలె 'తీసూకొంటాను' అన్నది మూడుసార్లు వచ్చినది.

అనాగరకులయిన సవరల పాటలలో సైతము ఈ పల్లవి లక్షణము కనబడినది. అది స్వరయుతముగా చూపించెదను:

కురీ !. కురీ ! కురీ
(ని సా సరీ గరీ)

గా మ్లె
(నీ స)

గూతాయ్' గూతాయ్' గూతాయ్'
(గరీ రిసా సనీ)

బురోయ్'జపోంగ్ గంగా'జపోంగ్

(ని̣సగరీ ని̣సగరీ)

సా... జపోంగ్ సిత్రీజపోంగ్

(ని̣సగరీ ని̣సగరీ)

ఇగ్త్రాయ్! ఇగ్త్రాయ్! ఇగ్త్రాయ్!

(నిసా సరీ గరీ)

గామ్లె

(నీ̣స)

గూతాయ్' గూతాయ్' గూతాయ్'

(గరీ రిసా సనీ̣)

(అర్థము— కురీ కురీ కురీ అంటూ కూస్తా కూస్తా కూస్తా।. కందులెకానీ జొన్నలెకానీ సామలెకానీ రాగులెకానీ తెస్తా తెస్తా తెస్తా - ఇది గువ్వపిట్ట పాట).

ఇది త్ర్యస్రగతిలో 'గల' ములకంటె 'లగ' ములే ఎక్కువగా పెట్టుకొనుచు పాడుకొందురు.

ఈ పాట సవరదేశములో పెక్కు మండలములందు వ్యాప్తి చెందియున్నది. కనుక చాలకాలము క్రిందటనే ఎవరో రచించినది. సవర పిల్లలు ఆశువుగా రచించిన పాటలు కూడా విన్నాను. అంతే కాదు. పండుగ దినములలోను, పున్నమనాటి రాత్రులందును పురుషులు ఒకతట్టున - స్త్రీలు వారి కెదురుగా మరియొకతట్టునను కూర్చుండి శృంగార హాస్యరసములలో సంభాషించుకొన్నట్లుగా ఆశువుగా అప్పటికప్పుడు తాము రచించుకొను పాటలు పాడుకొను చుందురు. స్త్రీలను పరిహాసించుచు పురుషులును, పురుషులను పరిహా సించుచు స్త్రీలును, ఒకసారి వారును, ఒకసారి వీరును వంతులు తీర్చు కొనునట్లు పాశుచుందురు. పురుషులలో ఒకరు పాడిన పాట పూర్తి కాగానే స్త్రీలలో ఒకరు పాట మొదలుపెట్టవలెను. ఈ జట్టువారి పాట పూర్తి కాగానే ఆ జట్టువారి పాట ప్రారంభింపవలెను అట్లు కాకపోయినయెడల ఆ జట్టువా రోడినట్లు ఈ జట్టువారు హేళన చేయుచుందురు. మనము పోటీపడి తోక పద్యములు చదువునట్లు గానే వారి పాటలు సాగును. ఐతే, మనము చదివెడు పద్యములు మన రచనలు కావు. వారిలో ఎవరు పాడిన పాటలు వారి సొంత రచనలే.

గేయరచన ఎంత సహజసిద్ధమయినదో నిరూపించుటకు ఈ సవరల గేయరచన విషయము ఇంతగా చెప్పవలసివచ్చినది.

సంస్కృత వాఙ్మయములో మనకు తెలిసినంతవరకు వాల్మీకి రామాయణము మొదటి కావ్యము. ఆ ముని పుంగవుడు శ్రీరా ముని సమకాలికుడయినయెడల వేదములకాలమునకును రామావతార

మునకును మధ్యకాలము మత్స్య కూర్మ వరాహ నర సింహ వామన పరశురామావతారముల కాలమయినది. ఈ ఆఱు అవతారముల కాలములోను సంస్కృత సాహిత్యము ఎంతవరకు ఏ రూపమున సాగినదో తెలియదు. ఏదయినను వేదములలో కొన్ని ఛందముల పేళ్లు కనబడుచున్నను వృత్తరచన సాగినదని చెప్పుటకు ప్రమాణము కనపడదు. మూడవ వేదమయిన సామవేదము గానము గలదనుట ప్రసిద్ధము గదా! వాల్మీకి రామాయణమందలి శ్లోకము అను శ్రుతి వేసికొని కుశలవులు పాడినారని విందుముగదా? దీనినిబట్టి ఋగ్వేదమందలి ఋక్కులు గేయములనియే చెప్పవలెను. అవి ఉదాత్తానుదాత్త స్వరయుతములు. ఆ కాలములో అవి యెట్లు పాడబడినవో ? అనుశ్రుతముగా నాటినుండి నేటివఱకును జటాఘనములతో వచ్చినవి నేడెట్లు పాడుచున్నారో విని స్వరపరచగలముగదా? అందు కొక ఉదాహరణము :

అగ్నిమీళే పురోహితమ్

(సీసరిసా నిసరిసా)

హోతారం రత్నధాతమమ్॥

(సా రీ సా సానిసా రిసా)

ఇందులో మనము గుర్తింపవలసిన విషయమొకటికలదు. పైని చూపించిన సవర పాటలో నాలుగు స్వరములు కలవు. నిసరిగ లు. అగ్నిమీళే యను ఋక్కులో మూడు స్వరములు కలవు - నిసరి - స్వరములు, సవరపాటలలో నూటికి తొంబది పాటలు మూడు స్వరములతో ఉంటవి. ఇప్పుడిప్పుడు గాంధారము కూడా కలుపుకొని పాడుచున్నారు. ఋక్కులను వీణపై కెక్కించి కొందరు పాడుచుండగా విన్నాను. సాధారణముగా మూడు స్వరములే వినబడుచుండెను. అప్పుడప్పుడు గాంధారము వినబడినది.

మరియొక విషయము: ఈ మూడు నాలుగు స్వరములును సవరపాటలలో గానీ వేదఋక్కులలో గానీ నిషాదముతోనే ప్రారంభించును. దానికంటె దిగువస్వరము (ధపమ లలో ఏదియును) లేదు.

భజనకీర్తనలలో గల స్వరములు కూడ షడ్జస్వరానికి చాల చేరువ నున్న నిషాధముతోనే ప్రారంభమగుచున్నది.

ఈ విషయములను పరిశోధించిన యెడల వేదకాలమందు ప్రౌఢ రచన గల గేయ సాహిత్యమే వృద్ధి చెందియుండెనని చెప్పవలెను. సవరలు మొదలయిన ఆదివాసుల వాఙ్మయములో గేయ రచనే కాని పద్యరచన యిప్పటికింకను రాలేదు. సవరభాషలోనే నొక పద్యము వంటిది రచించి పాడగల సవరలకు చూపించినాను. అందులో నాలుగు పాదములు మాత్రమే ఉన్నవనియు పల్లవివంటిది లేదనియు పాడుటకు యోగ్యముగా ఉండదనియు ఆక్షేపించారు. పాడుకోవలదు చదువుకొనుడు అని నే నంటినే కాని వారికి నచ్చలేదు.

ఋగ్వేదములో అక్కడక్కడ పల్లవివలె కొన్ని పదములు మరల మరల వచ్చుచుండును చూడుడు : మం. ౧ అను ౫ సూ. ౧౯.

ప్రతిత్యం చారుమధ్వరం గోపీథాయ ప్రహూయసే । మరుద్భిరగ్న ఆగహి ॥

నహి దేవో న మర్త్యో మహస్తవ క్రతుంపరః । మరుద్భిరగ్న ఆగహి ॥

యే మహో రజసో విదుర్విశ్వే దేవాసో అద్రుహః । మరుద్భిరగ్న ఆగహి ॥

యఉగ్రా అర్కమానృచు రనాధృష్టాస ఓజసా । మరుద్భిరగ్న ఆగహి ॥

యేశుభ్రాఘోర వర్పసః సుక్షత్రాసోరిశాదసః । మరుద్భిరగ్న ఆగహి ॥

యేనా కస్యాధిరోచనే దివి దేవాస ఆసతే । మరుద్భిరగ్న ఆగహి ॥

య ఈఙ్ఖయంతి పర్వతాం తిరః సముద్ర మర్ణవమ్ । మరుద్భిరగ్న ఆగహి ॥

ఆయేతన్వంతి రశ్మిభి స్తిరః సముద్ర మోజసా । మరుద్భిరగ్న ఆగహి ॥

అభిత్వాపూర్వపీతయే సృజామిసోమ్యం మధు । మరుద్భిరగ్న ఆగహి ॥

ఈ తొమ్మిది ఋక్కులందును 'మరుద్భి రగ్న ఆగహి' (అనగా 'మరుత్తులతో కలిసి ఓ అగ్నీ రమ్ము') పల్లవిగా నున్నది. ఇవి గానము చేయుటకే రచితములయిన గేయములని అను. ఛ. సూ. ౩౮ లో గల—

మిమీహి శ్లోక మాస్యే పర్జన్యఇవ తతనః । గాయగాయత్ర
ముక్థ్యమ్ః

(ఋత్విజులారా!) మీ నోట స్తుతిని నిర్మింపుడు మేఘుడు వర్షమును విస్తరించునట్లు ఆ శ్లోకమును మాకు విస్తరింపుడు. శస్త్రములకు(సోమ మంత్రములకు)పనికివచ్చు గాయత్రీ ఛందస్సును గానము చేయుడు అను మంత్రమునుఁబట్టి చెప్పవచ్చును.

మన తెలుగు సాహిత్యములో కూడ గేయరచన మొదట సాగిన తర్వాతనే పద్యరచన ప్రారంభించినదనుట సత్యము. ఆ ప్రాచీన కాలమందలి గేయరచన మనకు లభ్యము కాదు. వైదిక వాఙ్మయమునకు పూర్వము — అనగా వేదములందలి గేయములకు పూర్వ ముండి యుండిన గేయరచన కూడ లభ్యము కాదు కాని, పద్యరచనతో పాటు తెలుగు వాఙ్మయమున నేటికిని సాగుచూ ఉన్న జానపద గేయములు, మనకు లభ్యములుకాని ఆ ప్రాచీన గేయముల రీతులను కొద్దిగానైనను తెలియజేయగలవని నా యభిప్రాయము. కనుక, ఈ జానపద గేయములందలి ఛందోరీతు లెట్లున్నవో తెలియజేసెదను.

జానపద గేయ పరిణామమే అర్వాచీన కీర్తనలు, పదములు, కృతులు మొదలయినవి. కృతులలో గల "పల్లవి, అనుపల్లవి, చరణ

ములు" అను మూడు భాగములును కృతులకు పూర్వకాలమం దుండిన కీర్తనలలో కనబడవు. క్షేత్రయ పదములందున్నవి. జయ దేవుని అష్టపదులలో పల్లవి, చరణములు మాత్ర మున్నవి కాని అనుపల్లవి లేదు. అంతకు పూర్వకాలమం దుండి యుండిన సంస్కృత పదములలో పల్లవి, చరణములు మాత్రమే కాని అనుపల్లవి ఉండి యుండదని మన మూహింపవచ్చును. జానపద గేయములలో కొన్ని టను పల్లవి గాని, పల్లవి వలె అడుగడుగునకు వచ్చు మాటలు గాని ఉండును. కాని పల్లవి యను పేర నేదియును లేను. పెక్కు పాట లలో ఈమాత్రమైనను పల్లవి కావగినది కనబడదు.

ఇక స్వర (రాగ) విషయమును గూర్చి చెప్పదగినదేమనగా:- బుక్కులందును సవరలు మొదలయిన ఆదివాసుల పాటలందును మూడే స్వరములు (కొన్నిటను నాలుగు) మాత్రమే కలవు. రాను రాను 'నిసరిగ' ల పైని గల స్వరములు వచ్చినవి. ఈ స్వరముల పేళ్లు కొంత కాలము ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ స్వరములుగా నుండెను. సప్త స్వరములును పూర్తిగా ఏర్పడిన తర్వాత స్వరముల పేళ్లు ఇప్పుడున్నట్లు షడ్జ రిషభ గాంధారాదు లుగా మారినవి. ఇందులో పంచమ స్వరము పూర్వపు పేరనే నిల్చియున్నది.

[ ఇందుకొక సాదృశ్య మున్నది. రోమన్లు మాసముల పేళ్లు తమ లాటిన్ భాషలో గల సంఖ్యావాచకములతోనే వ్యవహరించు చుండిరి.• రాను రాను ఆ పేళ్లు ఒక్కొక్కటి మారుచుండెను వారికి మార్చి మొదటి మాసముగనుక దానికి ప్రైమస్ అను పేరుండేది; ఇది మార్స్ దేవత గౌరవార్థముగా మార్టియస్ అయి ఆంగ్లభాషలో

మార్చి అయినది. వసంతాగమనమును సూచించునదిగా ఏప్రిల్, వసంతోత్సవమును తెలియజేయుచు మే, జూనియస్ అనే రోమ్ గోత్ర నామముగా జూన్, జూలియస్ సీజర్ గౌరవసూచకముగా జూలై, అగస్టస్ సీజర్ గౌరవార్థముగా ఆగస్ట్ అనే పేళ్లు వచ్చినవి. ఏడవ మాసమునుండి పదియవ మాసము వఱకు సెప్టెంబర్, అక్టోబర్, నవెంబర్, డిసెంబర్ అను మునపటి పేళ్లే నిల్చిపోయినవి. 11వ మాసము జేనస్ అనే దేవత పేరను జాన్యువరీ అయినది; 12వ మాసము ఒక ఉత్సవము పేరను ఫెబ్రువరీ అయినది.]

ఇక లయ తాళముల గూర్చి చెప్పదగిన దేమనగా :—

లయ సహజసిద్ధమైనది. తాళము కళాధర్మముగా లయనుండి వర్ధిల్లినది. అందుచేతనే తాళశాస్త్రము కృషి చేసినవారే తాళమను సంప్రదాయము ననుసరించి అందుగల క్రియలను చూపింపగలరు లయ మాత్రము సాధారణముగా అందఱును చేతులు తట్టి గాని, తప్పెట తట్టి గాని చూపింపగలరు. తాళమునకు మొదటి మెట్టు లయ. అది త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణగతులలో నుండును. సంకీర్ణమనునది అంతగా ప్రచారమందు లేదు. కనుక జానపదములన్నీ తక్కిన నాలుగు గతులలోనే ఉన్నవి.

ఈ సందర్భమున ఒక విషయము మనము జ్ఞప్తియందుంచుకొనవలెను. చరణ మను పేరు పద్యములలోను (వృత్తములలోను) పాదమునకు సమానార్థకము; పాటలలో రెండు, మూడు, నాలుగు (ఒకొక్కప్పుడు అంతకంటెను ఎక్కువ) పాదములు గల ఒక పట్టునకు (stanza) పేరు. పాటలలో పాదాంతములందును, కనీసము

రెండవ పాదాంతమందును, విధిగా చరణాంతమందును విశ్రాంతికి అవకాశ ముండునట్లు అనగా ఒకటి, రెండు, మూడు మాత్రలు లోపించునట్లుగా రచన సాగవలెను, అట్లు గాక ప్రతి చరణమందును గల ప్రతి పాదమందును ఉద్దిష్ట గణములు పూర్తిగా యుండినయెడల ఆ చరణము లయను అనుసరించి చదువుటకు అనువైన పద్యము కాగలదు గాని గేయము కానేరదు. కొంచెమైనను స్వరము పొడిగించిన గాని పాట హృద్యముగా నుండదు. అందుకొక ఉ। ఊర్మిళా దేవి నిద్ర అనే పాటలోని పాద మెట్లున్నదో చూడుడు :—

శ్రీరామ । భూపాలు।డూ...। పట్టాభి షేకుడై । కొలువుండ।గా...
5 5 5 5 5 5 5

ఇది ఖండగతి త్ర్యస్రజాతి త్రిపుటలో పాడుకొనుటకు చక్కగా అమరి యున్నది. త్ర్యస్రజాతి త్రిపుటకు 3 + 2 + 2 = 7 మాత్ర లుండవలెను. ఖండగతిలో ఈ తాళ మున్నదనినయెడల ఇది 5 × 7 = 35 గలది కావలెను. విశ్రాంతి తీసికొనుటకు అనువుగా మూడవ కియయందున్న డూ మఱి మూడు మాత్రల కాలము పొడిగించినయెడల 5 మాత్రలు గలది యగును. ఆ విధముగానే పాదాంతమున గల గా... కూడ అయిదు మాత్రలు కలది యగును.

ఈ విధముగానే ఈ దిగువను చూపిన ఉదాహరణములందు చుక్కలు గలవు. ఎన్ని చుక్కలుండునో అన్ని మాత్రలు గల 'మాతు' (అనగా సాహిత్యము) లోపించినదని గ్రహింపవలెను.

త్ర్యస్రగతిలో నడచు జానపద గేయములు :—

(1) కొండ మీద వెండి గిన్నె
కొక్కిరాజు కాలు విరిగె

దాని కేం మందు ఉ..

వే. పాకు చేదు ఉ..

వెల్. ఉల్లి గడ్డ అ..

మా. నాయి బొడ్డు..

మా. టొక్క దార అ..

(2) గొల్లవారి వాడలకు. । కృష్ణమూ. ర్తీ. నీవు
ఏమి పనుల కొచ్చినావు । కృష్ణమూ. ర్తీ. . . .
పాలు గొన. వచ్చినానె । గొల్ల భా.మా. . . .
పాలు పోసి నన్ను బంపు । గొల్ల భా మా. . . .

× × × ×

(3) సువ్వి సువ్వి రామచంద్ర । సువ్వి సువ్వి కీర్తిసాంద్ర
సువ్వి సీ. తమ్మ మాకు । శుభమ లిమ్. మ్మా.

(4) చందమామ రా. వె.. । జా. బిల్లి రా. వె .
కొం. డెక్కి రా. వె.. । కోటి వేళ్లు తే. వె..

(5) ఎలుక తోడ పిల్లి యొ౯టి । చెలిమి చేసి వింతగాను
మంచి మాట లాడి దాని । పంచ జేరె నుఁడు . . .

— ఇవి గేయములు కనుక పాడుట కనువుగా పాదముల నడుమను అంతములందును విశ్రాంతికిని స్వరము పొడిగించుటకును కొన్ని మాత్రలు లోపించుటవలన అవకాశము కలుగుచున్నది.

చదువుట కుద్దేశించి రచించిన పద్యములం దీ యవకాశ ముండదు ఉండనక్కరలేదు:—

**1.** రగడలు (అప్పకవీయము) :—

హయప్రచార-రగడ—

ఋతు విరామ - మినులు నల్వు
గతుక నొక్క . యంఘ్రి చెల్వు
దనర హయతఁ - దార్ఢ్యఁ డంచు
దనుజ హరణ , దక్షుఁ డంచు
మును శుకాది - మునులు వొగడఁ
జను హయ ప్ర-చార రగడ

తురగ వల్గనము—

ఇరువులన్ హయప్రచార - మినుమడించి కృతుల జెప్పు
దురు విదూరి తాగ్నివరణ - తురగ వల్గనాఖ్య మొప్పు

విజయ మంగళము—

తురగవల్గనంబు రెంటి-తోడ విజయ మంగళంబు
ధూర్తకంసతూల దహన - తుహినహీరసదృశకీర్తి

పరఁగ . . . . . . . . . . . .
వారి వాహ . . . . . . . . . మూర్తి

ఇందు అంత్యప్రాస నియమమును, పఙ్క్తులు పెద్దవయిన యెడల నాలుగు ఖండములందును యతి నియమమును పాటింప వలెను. ఇందు మూడు మాత్రల గణము లేవయినను కావచ్చును లగము మాత్రము పనికిరాదు.

**2.** వృత్తములు :—

సుగంధి, ఉత్సాహ, తరళ, తరలి, విచికిలిత మొదలయినవి మొదటి ప్రకరణములో చెప్పినాను. అందు ఎదురుగా

(అనగా 10 లగములతో) నడచు సుకాంత వృత్తము కూడ ఉదాహరించినాను—"ఇదే యపిన్ మదాన్వితు సుదేవునిన్ వధించెదన్"

3. నేటి గేయములందు విశ్రాంతి కెడమీయక పద్యములవలెనే త్ర్యస్రగతిలో శ్రీ నారాయణరెడ్డి మొదలగువారు కొందఱు రచనలు సాగించుచున్నారు.

"శిల్పకళకు మచ్చ కల్గ-చేసినారు మీరలయో"-ఇందుఎదురుగా నడచే లగము పాదాంతమున కలదు కాని విశ్రాంతి కెడమిచ్చిన ఉద్దిష్ట గణసంఖ్య ఎక్కువగును. "శిల్పకళకు మచ్చ కల్గ. చేసినారు మీరయో." అనినయెడల విశ్రాంతి కలుగును.

అంతే కాక నేటి గేయకవులు ఈ త్ర్యస్రగతి గణములతో పాటు మూడు గురువులు గల మగణములును, రెండు గురువులును రెండు లఘువులును గల తల, భగ, సగ, యలములు యథేచ్ఛముగా కలిపి రూపకతాళములో రచన సాగించుచున్నారు :—

"అయ్యయ్యో మీర లెంత - అమాయకులుగా నుంటిరి
మతము దప్ప వేరే జీవిత పథమ్ములే దంటిరి
మతమే ప్రతివారికి జీవిత సర్వస్వమ్ము కాదు."

4. ఉపజాతి గీతులలో కమలన గీతి - (అప్పకవీయము):—

హగణమైనఁ జాలు నగణ-మైనఁ జాలు హగణ
నగణములును రెండు కలసి - నాటి యంఘ్రి కేడు
తగిన విరతి నాలుగింటఁ - దనరఁ బ్రాస మొదవి
మిగుల మెఱయుచుండుఁ గృతులఁ - గమలనాఖ్య గీతి॥
(4 వ చరణములో యతి తప్పినది)

చతురస్రగతిలో నడచే జానపద గేయములు:—

(1) గుడుగుడు గుంచం । గుండా రాగం
పాముల పట్నం । పడగా రాగం
కత్తైనా .. బద్దైనా ..
వేణ్ణీళ్ళా .. । చన్నీళ్ళా ..

(2) ఉడుతా ఉడుతా హూ.త్
ఎక్కడి కెళ్ళావ్ హూ.త్
కానూ రెళ్ళా హూ..త్
ఏమీ తెచ్చావ్ హూ.త్
కందులు తెచ్చా హూ.త్

× × ×

ఎవరి కిచ్చావ్ హూ త్
అబ్బాయ్ కిచ్చా హూ.త్

(3) అత్తా తెచ్చిన కొత్తా కోకా
కట్టం నన్నాది ఇ.....
మామా తెచ్చిన మల్లీ మొగ్గా
ముడవా నన్నాది ఇ.....
మొగుడూ చేతను మొట్టీకాయా
తింటా నన్నాది ఇ.....

(4) గుజ గుజ రేకుల పిల్లుందా ..
గుజా రేకుల పిల్లుందా ..

స్వామీ దండల పిల్లుందా . .
పహా రాజులు మెచ్చే పిల్లుందా ?

(5) తప్పట్లోయ్ . . । తాళాలోయ్ . .
దేముడి గుళ్లో । బాజాలోయ్ . ,
పండ్లూ ఫలమూ । దేముని కోయ్ . .
పాలూ ఉగ్గూ । పాపాయ్ కోయ్ . .

(6) తారంగం . . తారంగం . .
తాండవ కృష్ణా తారంగం . .
వెన్నా దొంగా తారంగం . .
వేణూ నాదా తారంగం . .
చిన్నీ కృష్ణా తారంగం . .

(7) చిటపట చినుకులు దుప్పటి తడిసెను
తలుపు తీయవే భాలమాల నువు
తలుపు తీయవే భాల మాల॥

ఇందులో తలుపు తీయవే (3 + 5) లో వెరసి 8 మాత్రలు (2 × 4) అనగా రెండు చతురశ్ర గణము లున్నవి.

స్త్రీల పాటలలో మొదటి రెండు పాదములును నాల్గవ పాదమును చిన్నవిగాను మూడవ పాదము పెద్దదిగాను చతురశ్రగతిలో నడచే పాట ఒకటి కలదు. దానికి 'పారిజాత పల్లవి' అని పేరు. అది చాల హృద్యముగా నడచును :-

శ్రీకృష్ణుం డొకనాడు:
శృంగారాహారుండై

శ్రీ కాంతామణి నగరుకు వచ్చెను
చెలువముతోడుతనూ . . ॥

× × ×

భక్తుల వాకిట నుంచీ
పరగున లోపలి కేగీ
కనకపు మేడలు రంగస్థలములు
కలయ వెతుకవోడగే . . ॥

మెత్తని పానుపు వెతికి
మేడా మడుగులు వెతికి
చిత్తరు చవుకెలు వీక్షించుచు తన
చిత్తము కిట్లనెనూ . . ॥

× × ×

గోవిందా కృష్ణ హరి
గోపాలా శ్రీధర గో
వర్ధన గిరిధర వామన కేశవ
శ్రీధర హరి యనుచూ . . ॥

పారిజాత పువ్వూ . .
ఎవరు పాడినా విన్నా
పతులకు కడు సౌభాగ్యం కలుగును
సంతోషమ్మున ఉంద్రహా॥

ప్రాసములు నిల్పి మూడవ పాదమందలి మొదటి అక్షరముతో నాల్గవ పాదమందలి మొదటి యక్షరమును మైత్రి నిలిపి కూడ ఈ వరుసను శ్రావ్యముగా గేయములు రచింపవచ్చును :-

జయ సూచక మగునట్లా
జయ భేరీ ధ్వనులెల్లా
జయమే మనకని మ్రోగుచు నున్నవి
భయ మిక నా కేలా..? ॥

అందము గలవారూ..
చందము గలవారూ..
చిందులు త్రొక్కుచు నాడేవారూ
చిన్న పిల్లలేనూ..।

వెన్నెల లుదయింపా..
కన్నులు వికసింపా..
చిన్న పిల్లలూ కలిగిన యింటికి
చీకటి యుండేనా..? ॥

చిన్నపరెడ్డి పాటలో భీభత్సమయమైన సన్నివేశాన్ని వర్ణించు పాట చతురస్రగతిలో ఎట్లు నడచినదో చూడుడు :-

మూాడు వందలా తుపాకి పొగలో
వొకరి ముఖము నింకొకరు గానకను
తమలో తామే కొట్టుకొనుచు తమ
తల కుడ్లలు పడిపోయిన దెరుగరు
కాళ్లు చేతులూ విరిగిన దెరుగరు

× × ×

షట్పది వంటి ఒక పాట నలుపులవద్ద పాటగా నున్నది :—

(శ్రీ) తరుణికొ నే (శ్రీ) రఘు రాముని
జేరి కవాటము తీవే
జేరి కవాటము తీవే

కళ్యాణిగ (శ్రీ) రఘు రాముడవై తే
కోతుల జేరగ దోయీ . . . ఘన
సేతువు గూర్చగ దో . . యీ

బొబ్బిలి పాట :—

బొబ్బిలి కోటా । యేలేవాడూ । దొరా రంగ రావూ . . .
విజయనగరమూ । యేలేవాడూ । విజయరామరాజూ . . .

ఇందు మూడు ఖండము లున్నవి ఒకొక్క ఖండములో ఎనిమిదేసి మాత్ర లున్నవి. మూడవ ఖండములో 8 మాత్రలు తర్వాత మరి రెండు లఘువులు కలసిన గుర్వక్షర మున్నది. దీనిపై విశ్రాంతికి కావలసిన మాత్రలు అననవచ్చును వంత పాట పాడేవారు 'భళాభళీ' అనగానే ఆ తర్వాతి పఙ్క్తి పాడుటకు ప్రారంభింతురు.

కొన్నిచోట్ల రసాను గుణముగా దురితములో పాట సాగుచుండును. అప్పుడు పాట ఎట్లు నడచునో చూడుడు :

పాపారాయుడు విజయరామరాజును చంపుటకు ముందు కోపావేశముతో అన్న మాటలు :—

ఈటె యెందుకూ । బల్లె మెందుకూ । విజయరామరాజా। నీ . . .
పక్కలో బాకై । ఉన్నా నేనూ । పాపారాయణ్ణి। నీవూ . . .
రాజ బాటనా । వస్తావని ఇ । బాట కాచినానూ। . . . నువ్

దొంగతాటనూ । తీసుకొస్తివి విజయరామరాజా । . . . నువ్
మా కోటలయిన । ముంచినావుగా విజయరామరాజా। . . . ఒరే
(మా చెల్లి) ముండమోసితే । మూడు పల్లెలూ । ఇనాము
ఇస్తావా। . . . ఒరే
ముందరి కూడూ । ముందరి గుడ్డా । నీదే నన్నావా । . . . ఒరే

బంగారు తిమ్మరాజు పాట ఈ విధముగానే నడుచును:-

కోట యవతలీ । సున్నపురాళ్లూ । తీసుకెళ్లమనిరీ । . . .
బురుజు మీదిదీ । అరికె గడ్డీ । పట్టుకెళ్లమనిరీ । . . .

ఈ చతురస్రగతిలో నడచే పద్యములు-వృత్తములు :-

1. కంద పద్యము -

చీకులు పెట్టిన పుట్టలు -
పాముల కిరవైనయట్లు - పామరుఁడు దగన్
హేమంబు గూడఁబెట్టిన -
భూమీశుల పాలఁ జేరు - భువిలో సుమతీ॥

కందార్థము :-

ఘనుఁడగు లింగమనాయఁడు
పనివడి పిలిపించి నన్ను బహు సంతోషం
బునఁ గాంచి కరుణతోడను
దనరఁగ నీ నాటకంబు త్వరితము చెప్పూ
శశిరేఖా చరితామూ—గురుతుగ
శ్రీస్వర్గగేహ గుంటపురి వరదునిపై కృతి
సరవితో నిల్పియు త్వరితమూ—చెప్పూ

(శశిరేఖా పరిణయం వీథినాటకం -
కర్త-గొర్రెముచ్చు అబ్బయదాసుడు.)

2. రగడలు:-

మధురగతి రగడ - (అప్పకవీయము) :-

నాలుగు మాత్రలు - నాటిన గణములు
నాలుగు రెంటికి - నలి విరమణములు
కలసి మధురగతి - కనలును జగణము
తొలఁగిన ధృత కౌ-స్తుభ కవిరమణము॥

హరిగతి రగడ :-

నలసభ గగముల లోపల నేవై । నను నెనిమిది నాల్గిటపై విరమము
గలసిన హరిగతి చెలువగుఁ గృతులం । గవివరు లవునని చెప్పిన నియమము॥

శ్రీనాథుడు మణికర్ణికా ప్రభావము ఈ రగడలో చెప్పెను :
శ్రీమత్కాశీపుట ఖేదన లక్ష్మీ శ్రుతి మణికర్ణిక ఘణికర్ణిక

× × ×

3. చతుష్పద :- (పాదమునకు 16 లఘువులు-4 × 4.)

జలజాసన వి-భ్రమ సంయుతమై
లలి షోడశ మిత - లఘువుల తోడన్
గలసి చతుష్పద - గతులను ధరలోన్
జెలువగుఁ ద్రౌపద - సేవక సులభా॥ (అప్పకవి)

4. వృత్తములు :- పాదప, తోటక, రమణక, మానిని, కవిరాజ విరాజితము మొదలైన వృత్తము లింతకు ముందే తెలియజేసినాను.

కొన్ని వృత్తాలు తెలుగువారికి ఎంత సుపరిచితములయినవో!
ఒక ఉదాహరణము-(మణిప్రవాళ శైలిలో)

స్వాగత వృత్తము –

తండులాలు గృహమందు న సంతి
తిండికై తె పది మంది వసంతి।
కుండలస్న గృహమందు లుఠంతి
ముండనాకొడుకు లెల్ల హసంతి

4. నేటి గేయములలో విశ్రాంతికి అవకాశమీయక పద్యముల వలెనే రచన సాగుచున్నది. ఆదితాళ లయకు అనుకూలముగా ఎనిమిది మాత్రలకు విరిగే గణములు కూడ గలవు; కొన్ని చోట్ల జగణము కూడా కలదు :—

రేపటి ఉదయం నాలో (12 మాత్రలు-3 × 4)
లోపల గుస గుస లాడెను (12 ,, ,, )

మనిషీ నీ భవిష్యత్తు (ఇక్కడ 12 మాత్రలు- $\overline{4+2}^{6}+\overline{1+5}^{6}$)
మహోజ్జ్వలంగా వుందని ( 12 ,, - జగణ, గగ, భ)

లోకులు పూసెదు పూతల } ఇది పూర్తి కాని కందమువలె నుండును
తో కారణమేమి మనకు } రూపకతాళ గతిని నడచును.

అట్లనద్ది యద్దినమున గనుకను } ఆదితాళ గతిని నడచును.
ప్రొద్దుటనే మటి చద్దిమ ద్దలను }

ఇంకా ఈ వరుసను వీరరసప్రధానమయిన పాటలు మరికొన్ని ఉన్నవి.

కప్పి యుంచితే కంపు పోవునా ?
అప్పు పెరిగితే ఆస్తి నిలుచునా ?
ఒప్పుల తడికెకు రంగు పూసితే
ఒప్పుల కుప్పగ పరిణమించునా ?

} ఎనిమిది మాత్రలకు విరుగుచు నడచును.

ఖండగతిని నడచే జానపద గేయములు :-

ఈ వరుసను స్త్రీల పాటలు పెక్కు లున్నవి.

శ్రీరామ భూపాలు డూ .. పట్టాభిషేకుడై కొలువుండగా

(పైని దీని లక్షణము వివరించినాను) దీనివంటిదే—

శ్రీరంగ రంగ రంగా .. నా యన్న కావేటి రంగ రంగా , .

చందమామ పాటలో ఖండగతి పొందిక యెట్లున్నదో చూడండి :—

ధర చోళదేశమున ఓ చందమామా.
ధర్మాంగు డను రాజు ఓ చందమామా
ఆ రాజు భార్యనూ ఓ చందమామా
అతి సత్యవతి యంద్రు ఓ చందమామా
నూరు నోములు నోమి ఓ చందమామా
నూరు మందని గాంచె ఓ చందమామా
వారు శూరులై యయ్యు ఓ చందమామా
వైరులచె హతులైరి ఓ చందమామా
తలిదండ్రు లప్పుడూ ఓ చందమామా
తరగనీ శోకమున ఓ చందమామా
ధన రాజ్యముల బాసి ఓ చందమామా
దాయాదులను బాసి ఓ చందమామా

× × × × ×

శ్రీమహా : ప్లుంను ఓ చందమామా
చ కాంకు డను పేర ఓ చందమామా
రాజు వేషంబునను ఓ చందమామా
రాజు నింటికి వచ్చి ఓ చందమామా

పాద మధ్యమందును పాదాంతమునందును 'ఓ చందమామా. అని కాని 'చం: మామా..' అని కాని నిలుపులవలన విశ్రాంతికి అవకాశ ముండును. 8 ఖండగతి గణము లేర్పడును. ఇది ఖండగతి ఆదితాళమున చక్కగా పాడుకొనుటకు వీలయిన పాట.

మోచేటి పద్మము పాట (పద్మమునకు బదులుగా పెద్దమ్మ అని కొంద అందురు) :—

మోచేటి పెద్దమ్మ నోచేటి వేళా. ।
మొగ్గలు తామరలు పూచేటి వేళా.
బీరాయి పువ్వులూ పూచేటి వేళా. ।
బిందెలతో ఉదకమ్ము తెచ్చేటి వేళా.

× × × × ×

ఆవులూ దూడలూ వచ్చేటి వేళా. ।
అంబోతు రంకెలూ వేసేటి వేళా..

ఏకాదశి పాట :—

చిత్తమ్మ ఏకాశి - చిలుకు దాదోశీ. ।
మాదుమ్మ ఏకాశి - మంచి దాదోశీ.
దశుకుని ఏకాశి - ఇంక నెల్లాళ్లూ. ।
కానెపుల్లలు దీసి - కసువార దీశీ.

ఆవు పేడా తెచ్చి - అరుగుల్లు అలికి. ।
గోవు పేడా తెచ్చి - గోలెంలో కలిపి.

× × × × ×

విరామమే కాక అక్షరమైత్రి పాటించుట కూడా కనబడును. ఒకొక్కచోట తప్పినది. ఖండగతిని రచితములయిన గేయములు చాల కలవు. అందులో విశ్రాంతికి ఎడమిచ్చు దీర్ఘము లున్నవి. ఊర్మిళాదేవి నిద్రలో "అయ్యమీ । రెవ్వర య్యా... మీరింత । యాగడ।మ్మున కొస్తిరి..." ఇది ఒక పాదము; ఇందులో మూడవ గణము ఎడవ గణము ఒక్కొక గురువు గలవి. విశ్రాంతికోసము మఱి మూడు లఘువుల కాలము పొడిగింపవలెను.

ఇంక నీ ఖండగతిలో నడచు పద్యములు—వృత్తములు :—

1. పద్మనాభ వృత్తము (అప్పకవీయము) :—

వేమాఱు నప్పద్మనాభంబునన్ విశ్వ - విశ్రాంతియున్
సప్తతంబుల్ గనంబున్.
గోమారుగా దేవ రాత్రించరుల్ క్షీర - కూపార మధ్యంబునన్
పీఁపుమీఁదన్. ।
భ్రామంగ మంథాచలం బోపికన్ గచ్ఛప స్వామియై మోచె
నీ కృష్ణుఁ డంచున్.
గామించి విద్వాంసులెల్లన్ వచింపంగఁ - గ్రాలున్ ధరిత్రిన్
సదా మానితంబై. ॥

విశ్రాంతికి అవకాశము ఈ వృత్తములో నున్నట్లే మఱి కొన్ని వృత్తములలోను పాదాంతమున నుండును.

2. మంగళ మహశ్రీ వృత్తము (అప్పకవీయము)

పొత్తు లెడఁబాయుటను - బోరు సమయంబునను - బొంగుచుఁ
గురూద్వహుల నెల్లన్.
ముత్తుమురు సేయఁగఁ గుదుర్చును మనీష నది - దుష్ట
సమరావనిఁ గిరీటి.
ఉత్తరకు భజన్నభజ - సాలు మణ్యాజు ల-శ్రాంతులును
మంగళ మహశ్రీ.
వృత్తములఁ జెన్నలర - నిచ్చిరి సువాసినులు - నింపడర
మంగళ మహార్తుల్.

పాదము 26 అక్షరములు గలిగి దీర్ఘమైనది కనుక మూడు ఖండములయి అక్షరమైత్రి యతులతో నున్నది. ఒక్కొక్క ఖండమున రెండేసి ఖండగతి గణములును, మూడవ ఖండమున అంతమందు గగము గలవు. ఆ గగమునకు విశ్రాంతి గలిగించు నొక మాత్ర లోపించినది. అది కలుపుకొన్న యెడల వెరసి ఏడు ఖండగతి గణములు కలవని చెప్పవచ్చును.

లయగ్రాహి (అప్పకవీయము) :—

ఇంబడర రఁగా భ జసన-ం బుల తు దన్ భజ స-నంబు ల పదం పడి
భ యంబులు లయగ్రా ..।
హిం బరఁగు ప్రాస విర,మంబు నలు మూఁడు గుదు-రంబటు
కవీశులు తిరంబుగ వచింపన్. ..।

× × ×

ఇందు ఒక్కొక్క పాదము నాలుగు ఖండము లయినది. నాలుగు ప్రాస యతు లున్నవి. ఆ ప్రాస యతులే నాలుగు పాదము

లందును గలవు. గణములు భజసన, భజసన, భయ ములనుటకంటె ఏడు భల ఘులును గగ మును గలవని చెప్పుట మేలుకదా ?

లయవిభాతి :—

పెనిమిటులు భార్యలును - దనయులను గాంచిరటె - మనములర
దొడ్డ తప-మున నల దశాస్యం.
దనుఁడు మఱి కోసలయుఁ - దన కడుపులోపల భు-వనము
లఖిలంబు నిడు-కొని. . .

ఇది లయగ్రాహి వలెనే నడచును. ఉత్పలమాల మొదలయిన కొన్ని వృత్తములలో మొదటి గురువు రెండు లఘువులు చేసి చంపకమాల మొదలయిన వృత్తములు కలిగించినట్టే లయగ్రాహిలో గల మొదటి గురువు రెండు లఘువులు చేసి లయవిభాతి కలిగించినారు.

పాదములో ఖండగతి గణము లన్నియును 5 లఘువులుగా రచించి తుది రెండక్షరములును గురువులుగా నుంచినయెడల అది లయహారి యగును.

లయహారి :—

నగణములు పదునొకఁడు - సగణమును గురువు నిడి - మిగుల
నలుమఱు యతులు - దగులు లయహారిన్.

× × ×   × × ×   × × ×   × × ×

లయగ్రాహి, లయవిభాతి, లయహారి - ఇందు 'లయ' పద మున్నదిగదా? ఆ లయ ఖండగతి నుండునుగదా? అందున్న గణ

ములు త్రికములతో చెప్పుటకంటె ఖండగతి గణములతో చెప్పుట సమంజసము కాదా ?

ఈ మూడే కాక మఱి యొకటి 'లయకాంత' అను పేరనో మఱియొక పేరనో రచింపవచ్చును.

**లయకాంత :-**

ఇంపయిన తరువులను - సొంపు గల ఫలములును - సంపెగలు
మొదలయిన - పెంపుగల పూవుల్.

ఇట్లే ప్రతి ఖండమందును మొదట నున్న భల ములకు మాఱుగా తగణములుంచి రచింపవచ్చును :-

ఇంపారు తరువులను -సొంపారు ఫలములును - సంపెంగ మొద
లయిన - పెంపొందు పూవుల్. ।

ఇట్లే 'నలల' ములును మొదటను 'భల' ములను రెండవది గాను చేసి చెప్పవచ్చును :-

'నలలభల' ములను - నలుతడవులన్ నిలిపి - లనితనుగు రెండు
గగ-ములు తుదిని జేర్పన్. ।

ఇంకా పక్కన ఖండగీతి గణములను (తగణము, నగము, సలము) రెండేసి ఈ నాలుగు ఖండములందును నిల్పి ఈ రీతి పద్య ములను రచింపవచ్చును.

దండకము (అప్పకవీయము) :-

విద్వాంసు । లెల్లన్ హ।కారంబె । కానీ న।కారంబె । కానీ స।కారంబె । కానీ వ।చింపం ద గున్ ముందు।గా నిందుఁ । గాదేని। యాదిన్ ద।కారంబు । గల్పించి । యామీది। వెల్లం ద।కారంబు।లే

మెండుగా నిచ్చుకున్ వచ్చు నందాక । నిర్మించి । గుర్వీతంముస్ జేసినన్ దండకం బంద్రు । భక్తాన యాయీ భుజంగేంద్ర శాయీ.।...గోపాల బాలా నమస్తే నమస్తే నమః.

ప్రబంధములు రచించిన కవులు ఇంచుమించు అందఱును ఎక్కడనో ఒకచోట దండకము తమ ప్రబంధములలో చేర్చిరి. అప్పుడి పైని చెప్పినట్లు తకారముతో కాక సగణాదులతో సామాన్యముగా దండకములు రచితములయినవి.

అనంతుని ఛందములో రెండు సలములతో ప్రారంభించిన దండక మున్నది :—

సిరినేలు రసికుండు శ్రీవత్స వక్షుండు...కీర్తింతు రెల్లప్పుడున్.

ఇంక, ఖండగతి నున్న రగడలు :-

**ద్విరదగతి రగడ :—** (అప్పకవీయము)

కరమొప్పఁ బంచ లఘు - గణ చతుష్టయముచే
విరమంబు రెంటిపై - ద్విరదగతి పేరిచే ।

**విజయభద్రము :-**

ద్విరద గతి రెట్టింప - విజయభద్రము చెల్లు - విసురపూజిత పాద - వేదసన్నుత నామ
ధర చక్ర కార్ముక గ-దా ఖడ్గ ధారణా-శాపింఛ సమగాత్ర - దళిత దైత్యస్తోమ ।

ఇందు పెద్ద పాదము లున్నవికనుక, పాదము నాలుగు ఖండము లయినది. ఖండమునకు రెండేసి చొప్పున 8 ఖండగతి గణములు కలవు; నాల్గింటను యతి (అక్షర మైత్రి) యును పాదములందు

ప్రాసమును గలదు. అంత్యప్రాస నియమము ఇతర రగడల కున్నట్లే దీనికిని కలదు.

కవులు తఱచుగా ద్విరదగతి రగడనే వాడినారు. ప్రభావతీ ప్రద్యుమ్నములో సూరన చెప్పిన రగడ :—

ద్విరదగతి రగడ –

ఓ హంసి! నీ చేత - నున్న యది నా బ్రదుకు
నా హృదయ మింతి డెం-దము నేకముగ నదుకు
కరుణ నిది పదివేలు - కమ్మలుగఁ గై కొనుము
పరఁగ సతితోడ నా - పలుకుగా నిట్లనుము —
"విద్యున్నిభాంగిరో - వినుము నీ కృప గన్నఁ
బ్రద్యుమ్నుఁ డను పేరు - ఫలితమగు నా కెన్న
... ... ... "

నేటి గేయములలో కూడ ఖండగతిలో నడిచే గేయములే ఎక్కువ కనబడుచున్నవి. శ్రీ అనంతకృష్ణశర్మగారు శ్రీ నారాయణరెడ్డిగారి 'నాగార్జున సాగరం' అనే గేయ కావ్యమునకు వ్రాసిన మంగళాశాసనములో చెప్పినట్లు 'తెలుగుదేశ రచనలలో ౫-౭ మాత్రల ఖండ మిశ్రగతులే యెక్కువ వ్యాప్తిలోనికి వచ్చినవి. అందును మిశ్రముకంటె ఖండమే ప్రబల మేమన దేశ్యచ్ఛందము లయిన అక్కరలు సీసము, ద్విపద, దండకము-వీనియందెల్ల సామ్రాజ్యము చేయుచున్న దిదే. కన్నడభాషలో భిన్నలయము నాధారముగాఁ గొని నడచు షట్పదులలో మిశ్ర రూపమయిన 'భామినీ షట్పది' అనూచానముగా చాలా వ్యాప్తిలో నున్నది. కాని అక్కడ గూడ ఆధునిక స్వాతంత్ర్యముతో రచించు కవులు ఖండగతినే ఎక్కువగా వాడుచున్నారు.'

నారాయణరెడ్డిగారు ఎక్కువగా ఖండగతినే తమ గేయము లను నడపినారు. నండూరి సుబ్బారావుగారు రచించిన పాటలు ఇంచుమించు అన్నియును ఖండగతి గణములలోనే రచితములయినవి. కాని యవి పాటలు గనుకను విశ్రాంతి కెడమగల దీర్ఘము లున్నవి గనుకను లఘువులు కావలసినచోట పొడిగించుట పాటలలో సంప్ర దాయానుకూలమే కనుకను వివిధతాళములలో వాటిని పాడవచ్చును.

శతపత్ర సుందరి యను రజని గేయములలో ఖండగతిని పాడ దగిన గేయము లనేకము గలవు.

స్వాతంత్ర్య స్వప్నం :—

విధుర హేమంత మరిగినదోయి !
మనకింక
మధుర వాసంత మ్మొకలదోయి!
ముసరు చీకటితోడ
మసలు నాకటి బాట
ఎసగు వెన్నెలతోట
పసిమి వెన్నెల బాట
మనసు మసకల ంయి చనెనోయి
మనకింక
తెలినివెల్గొరయు పవలేనోయి !

× × ×

ఏనాడో యేవాడో !

ఈనాడె కాదు ఇంకేనాడో యేవాడో
ఈ గాలి యెరుగనే నేనూ...!

ఈ నేల తిరుగనే నేనూ...!

మనసు నలరించు కమ్మని గాలు లివియవే

తనువు సొలయించు చల్లని దారు లివియవే ॥ఈనాడె॥

మిశ్ర గతిలో గల జానపద గేయములు ఖండగతి గేయము లున్నంత ఎక్కువగా లేవుకాని, తరుచుగానే ఉన్నవనవచ్చును.

జానపద గేయములలో :-

గుమ్మడేడే గోపిదేవి
గుమ్మడేడే కన్నతల్లీ
గుమ్మడిని పొడచూపగదవే
అమ్మ గోపెమ్మా !

తత్వాలు :-

మొదలు మీదుగ తలలు కిందుగ - మొలచియున్నది వృక్షమూ!
మోదములరగ మింటిమీదను - మదగజము విహరించెరా...!
చిదిమిపెట్టిన బంటుకై నడి - చీమ యేనుగు మ్రింగెరా...!
విర్రవీగుచు కేకవేయుచు - యీాగ మంచము మ్రింగెరా...!
గొర్రె యొక్కటి అయిదు పులులను-గొట్టి నెత్తురు త్రాగెరా...!
చిర్రిచెట్టున జాజిపూవులు - శ్రీకరంబుగ పూచెరా...!

× × ×

రామనామం :-

అనురద్వాదశ పత్రకమలము - నంటియున్నది రామనామం ।
సమరసముగా పదియు రెండ - క్షరములాయెను రామనామం !!
చిందిచలనము లేనివారల - బొందియున్నది రామనామం !!
బిందుమండల మధ్యగతమగు - నిండు రూపము రామనామం ॥

× × × ×

భజన పాటలు:—

ఈశ్వరా జగదీశ్వరా పరమేశ్వరా కరుణించరా ।

వేద భిక్షుకులు తలుచుగా పాడెదు పాటలు :—

పల్లవి-

ఏమి జన్మము ఏమి జీవనమూ...ఈ మాయకాయము ।ఏమి॥

అనుపల్లవి—

ఏమి జన్మము ఏమి జీవన
మేమి శాశ్వత మేమి సౌఖ్యము
ఏమి నా ప్రారబ్ధకర్మము
స్వామి నన్నిటుచేసి మరచెను
} మిశ్రముగా పాడు కొందురు.

మిశ్రగతిలో నడచు రగడలు :-

హరిణగతి రగడ :- (అప్పకవీయము)

నరహరి పదియు - నాలుగు లములు,
కరియతిహరిణ - గతికి నెళవులు

కాని నడక చెడినది. మిశ్రజాతి ఏకతాళములో 7 మాత్రలున్నవి. ఖండజాతి రూపకం (2+5) లోను, త్ర్యస్రజాతి త్రిపుట (3+2+2) లోను, చతురస్రజాతి ఝంపె (4+1+2) లోను కూడా ఏడు మాత్రలు కలవు ఈ యేడు మాత్రల పంపకములో వ్యత్యాస మున్నది. కనుక సాహిత్యంలో గల మాటల పొందికను బట్టి ఆ పదము ఏ లయకు లేదా ఏ తాళమునకు చెందునో చెప్పవలెను. అప్పకవి చెప్పిన లక్ష్యలక్షణ పద్యములో పాదములందు గల

మాత్రల వెరసి సంఖ్య పదియు నాలుగు అనెనేకాని అందులో నుండ వలసిన విభాగము చెప్పలేదు. అయితే యతిస్థానము 'కరియతి' అనుట వల్ల ఒక్కొక్క ఖండమందు ఏడు లఘువు లుండుననుట స్పష్టమయి నది. కాని ఆ మాత్రలు ఎట్లుండవలెనో చెప్పలేదు. లక్ష్యముకూడా ఆ పద్యములోనే ఉండునుగదా యని చూడగా 'నరహరి పదియు' ఖండజాతి రూపకం కావచ్చును, లేదా చతురస్రజాతి జంపెకావ చ్చును. 'నాలుగు లములు' అట్లే ఉన్నది. 'కరియతి రమణ' కూడ అట్లే యున్నది. కాని, 'గతికి నెళవులు' మాత్రము త్ర్యస్రజాతి త్రిపుటలో ఉన్నది. దీనికే ఇప్పుడు మిశ్రగతి అను పేరు తఱచుగా వాడుచున్నారు. అప్పకవి ఉద్దేశము అదే అయినయెడల ఆ ఉద్దేశము స్పష్టమగునటుల పద్యము రచించవలెను. ఇక్కడ నున్న పద్యమును బట్టి అనిష్టమైన హరిణగతి రగడలు రచితము లగుటకు అవకాశము కలదు. ఉదా। కరి పాదము ను।కరి పట్టినది

కరి హాఁ యని । కర మేడ్చినది

వృషభగతి రగడ :- (అప్పకవీయము)

ఇరువది యెనిమిది లఘువులు పది-యేనిట విశ్రాంతియుఁగూర్చిన
నిరవగు వృషగతి పద్మాధిప - యిది విను మాదరమున ముదమున॥

ఇది చతురస్రగతిలో నడచుచున్నది కాని మిశ్రగతిలో నడ చుటలేదు. కవులు మాత్రము వృషభగతి రగడలను మిశ్రగతిలోనే నడపించినారు :

బాల బాల రసాలమిది పిక - పాలి పాలిటి యదుర సాలము
గేలిఁ గేలిడి గ్రుచ్చఁ గడు రా-గిల్లు గిల్లుము తత్ప్రివాళము ।

× × × × ×

కలసు కలయ కలంక కేతకీ - కళిక కళికచ పఱచెఁ బిత్తమె
యళిక యళికి వడంకె నీ యిభ-యాన యాననవిల్తుఁ గొత్తమె

వసుచరిత్ర-III. 149.

మాత్రల సంఖ్య విషయములోను యతి విషయములోను అప్పకవి చెప్పినట్లున్నది; కాని గతి విషయములో మాత్రము భిన్న మైనది. అప్పకవి పద్యము చతురస్రజాతి ఏకతాళములో కాక, చతురస్రజాతి ధ్రువతాళము $(1011\text{-}4+2+4+4=14)$ లో కూడ నడచును

'రుగ్మవతి' యను వృత్తమునకును 'చంపకమాలి' యను వృత్తమునకును గణములలో భేదము లేదు. రెంటను భ మ స గ ములే; కాని యతిస్థానమున మాత్రము భేదము గలదు. దానివలన, రుగ్మవతి చతురస్రగతని (ఆదితాళములోను)–$2(4+2+2)=16$ మాత్రలు; చంపకమాలి మిశ్రతాళములోను $[-2(3+2+3)]=$ 16 మాత్రలు ఉన్నవి కనుక భిన్న వృత్తములుగా చెప్పినాడు :–

రుగ్మవతి :– అంగయతిన్ బొం-దై భమసల్ ప
ర్యుంగురు యుక్తిన్ । రుక్మవతిన్ స।
త్యాంగనకై తేఁడా సురశాఖిన్
బొంగుచు గోపీ-పుత్రుఁ డనంగన్॥

$4+4+4+4=16$ మాత్రలు $=2\ (4+2+2)=16$ మాత్రలు

**చంపకమాలి:–భూమి ధర క్రాంతు - పొలుపారన్**
**ప్రేమ భమంబుల్ గో-రి స గంబుల్**

దాము నుతించున్ నంద సుతున్ భా
మా మకరాంకున్ జంపక మాలిన్।
$2(3+2+3)=16$ మాత్రలు

ఇట్లు చెప్పిన అప్పకవి వృషభగతి రగడ విషయములో ఎక్కువ శ్రద్ధతో చెప్పవలసి యుండెను. సమాన గణములు (ఒక్కతీరుననే) కలవి ఇంకా ఉన్నవి. అవి ఎట్లు భిన్నగతులను నడచునో చూపించుటకు ఒక్క దృష్టాంతము :—

హాలముఖి :— కింకరీ కృత సురవరా
పంకజాత దళనయనా
పొంకమౌ రనస గణముల్
శంకలేక హాలముఖికిన్।

త్రికములుగా గణవిభజనము చేయుటవలన రనస గణము లేర్పడినవి. ప్రతి చరణమందున 12 మాత్రలు కలవు.

ఈ చిన్న వృత్తమునే ఎన్ని విధములుగా నడపింపవచ్చునో చూడుడు:-

(1) శౌరి ముద్దు పలుకు వినన్
శౌరి మోము సొగసు గనన్
శౌరి తోడ నెపుడుఁ జనన్
గోరుచుందు మదిని సదా॥

గణములు రనస ములే $3+3+3+3=12$ మాత్ర లున్నవి. ఇది త్ర్యస్రగతిలో నడచును.

(2) శౌరి పాటలను వినుమా
శౌరి రూప మును గనుమా

శౌరి చెంతకును జనుమా
శౌరిఁ జిత్తమున నిడుమా॥

గణములు రనసములే 3 + 5 + 4 = 12 మాత్ర లున్నవి = 8 + 4 చతురస్రగతిలో నడచును.

(3) శౌరి పాటలు వినుటకున్
శౌరి రూపము గనుటకున్
శౌరి చెంతకుఁ జనుటకున్
గోరు చుందును మనమునన్

గణములు ర న స ములే 3 + 4 + 5 = 12 మాత్రలు గలవే = 3 + 4 + 3 + 2...

ఇది మిశ్రగతిలో నడచును చివరనున్న గురువు మఱి 2 మాత్రల కాలము విశ్రాంతికి పొడిగించవలెను.

(4) న్యాయమా ప్రియ నుడువుమా
ప్రేయసిన్ నను నడవిలోఁ
బాయుదే! నిను వెదకుచున్
రోయదే మది పగులకన్।

గణములు రనస ములే 5 + 2 + 5 = 12 మాత్ర లున్నవి. ఇది ఖండ జాతి మఠ్యతాళములో నడచును.

ఈ చిన్న వృత్తము నడక వారకులకే విడిచి అప్పకవి గణములను వివరించుచు లక్ష్యలక్షణ పద్యము రచించె ననవచ్చును. కాని రగడలు గతి ప్రధానమయినవి. ఎన్ని నడకలున్న నన్ని పద్యములను-రుగ్మవతి,చంపకమాలి వృత్తములను ప్రత్యేకించి చెప్పినట్లే చెప్పవలసి

యుండెను. ఈ లోపము అప్పకవీయములోనే కాదు తక్కిన ఛందో గ్రంథములందును గలదు.

**మిశ్రగతిని నడచే వృత్తములు :—** మత్తకోకిల, ధ్రువకోకిల మొదలయినవి.

**నేటి** గేయములలో - మిశ్రగతిని నడచేవి అనేకముగా గలవు. ఈ గతిని నడచే గేయమునకు సాహిత్య గౌరవమును తెచ్చినవారిలో మొదటివారు గురుజాడ అప్పారావుగారు. వారి ముత్యాల సరములు ప్రకటితము లయిన తర్వాత పెక్కుమంది ఆధునిక కవులు ఈ మిశ్ర గతిలో రచన సాగించినారు. ఇది కవులకే కాక శ్రోతలకును ఇష్ట మయిన గతియైనది. ఇందుకు దృష్టాంతములు నే నంతగా చూపింప నక్కరలేదు. కాని, నా గ్రంథ సౌష్ఠవమునకు కొన్ని చూపింపవలె గనుక చూపింతును :—

**రజని గేయములలో** - కన్నె కాకి బావ :—

కాకి చూపుల కన్నె కొలుకుల
కొత్త తీపుల చవులు పూయగ
తేనె బుగ్గలు గుంట లడగా
తీయ పాటలు పాడుతుంటే

× × × × ×

,, ఒక్క పువ్వే :-

ఒక్క పువ్వేటు చాలునోయీ? నీ
కొక్క నవ్వేటు చాలునోయీ?

వలపులోనో సొలపులోనో
కలుగు తీపియె వలయుగాదా ?
అందమందే వలపు సొలపులు
అంతటా లోకమున గలవోయ్ ! ఒక్క పువ్వే।

నారాయణరెడ్డిగారి - వింత జాలి :-

ప్రాఙ్నగాగ్రమునందు పొడిచిన
బాల సూర్యుని కంటి సెగలకు
భగ్గుమనెడు తమిస్రమున్ గన
'పాప' మనిపించూ......

ఇందు నాల్గవ పాదమున విశ్రాంతికోసము 'చూ' తో మఱి ఆరు మాత్రల కాలము ఆగవలెను.

నాగార్జునసాగరం - తృతీయ తరంగం :-

విశ్వ విద్యా నిలయ మదిగో
వివిధ దేశాంతర తరణ జి
జ్ఞాసువుల బౌద్ధమత ధర్మా
ధ్యాస పీఠముగా లసించెను

× × ×

మతాచార్య వదన వినిర్గత
మధుర బోధ సుధా ప్రవాహ త
రంగములు విద్యార్థుల మన
శ్రవణముల కుత్సవము జేసెను

వీరు తప్పెట వాద్యము వలె నడపించుట కిష్టపడక పదముల కూర్పు గణములందలి మాత్రల ననుసరింపక ''run on'' అనునట్లుగా కావిం

తురు "మతాచార్య..." ఇందులో ఎదురు నడచే లగముతో ప్రారంభించినారు. నడకకు లోపము లేదు.

"run on verse" లో లగముగల రచన మంచిదేకాని నడకకు భంగము కలుగనీయరాదు. మిశ్రగతి గణము లున్నంత మాత్రాన ప్రయోజనము లేదు. చూడుడు:-

"అదే భద్రా చలం శ్రీరామమూర్తి నివాస మదియే
చూ చితే! అదే సు

మా! మన రామదాసు నిలయ మ్మదే సుమా క నుము
కను మచట".

ఇది పద్యమువలె నడచునా? "అదే భద్రాచలం. శ్రీరామమూర్తి నివాస మదియే చూచితే? అదేసుమా! మన రామదాసుని నిలయ మ్మదే సుమా! కనుము కను మచట" అని పద్య పంక్తులలో కాక వచనపంక్తులలో వ్రాసి చూచినయెడల అందు మిశ్రగతి ఏమీ కనబడదు.

త్ర్యస్రగతిని నడచు విచికిలిత వృత్తమునకు చెప్పిన పద్యము వలెనే మిశ్రగతిని నడచు తురగ వృత్తమునకు చెప్పిన పద్యముకూడ దాని నడకను గుర్తించుటకు వీలు లేకుండునట్లు అప్పకవీయములో నున్నది చూడుడు:-

నననన సజజగలు తిథివిరమ-ణం బగున్ దురగంబునన్
గనలుచు నగరము పయి విడిసిన - గాంచి తా నొకరుం డెదు
ర్కొని దవులకుఁ గొని చని గిరిగుహఁ - గూర్కు నా ముచికుందుచే
తను యవనునిఁ బొరిగొని తని వసు-ధన్ గణింతురు ధూసురుల్.

ఇట్లున్న యెడల దీని నడక తెలిసికొనుట శక్యమా? ఇది ఎట్లుండిన దెలిసికొనవచ్చునో చూడుడు :-

నవల యుగళము హాభము రగణము - నాల్గు పఙ్క్తుల
నొప్పఁగాఁ
దనరు విరమము నవల యుగళము - దాఁటఁగాఁ దురగంబునన్
జనును గద యిది తురగ మనుటకు - శ్రావ్యమౌ నిటు లుండినన్
మినుకు మెలఁతకు ముదము గలుగును - మిశ్రమౌగతి సాగినన్॥

16 వ శతాబ్దమునాటి కందుకూరి రుద్రయ 'జనార్దనాష్టక' పద్యము లెంత శ్రావ్యముగా కూర్చినాడో చూడుడు :-

నిన్న రాతిరి చవికెలోపల నీవు చెలి కూడుంటిరా
ఉన్న మార్గము లన్నియును నే నొకతె చేతను వింటిరా
విన్నమాత్రమె కాదురా నిను వీధిలోఁ గనుగొంటిరా
కన్నులారా, దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

× × × × ×

అలుకలన్నియుఁ దీఱ నివు నా యండకెప్పుడు వస్తివి
పిలిచి నవరత్నాల సొమ్ములు ప్రేమతో నెపుడిస్తివి
వలచి వలపించియును గూరిమి వదలకెప్పుడు మెస్తివి
కలసి వేడుక దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

జనార్దనాష్టక పద్యములు వృత్తలక్షణము పాటింపక గణములను మార్చుచు మిశ్రగతిలో గేయములవలె కవి రచించెను.

అధునికులలో శ్రీ అనంత కృష్ణశర్మగారు పెనుగొండ గేయము ఈ మిశ్రగతిలో ఎంత చక్కగా నడపించినారో చూడుడు:-

పల్లవి -

పెనుగొండ కొండ - ఈ పెనుగొండ కొండ -
చనిననాళులఁ దెనుఁగు కత్తులు - సానఁబెట్టిన బండ యీ పెను
రంధ్రములఁ బ్రవహించు తురకల - రక్త ధారలు త్రాగి త్రేచిన
ఆంధ్ర కన్నడ రాజ్యలక్ష్ముల - అరితి నీలపు దండ
ఈ పెనుగొండ కొండా।

వెరపు తెరుగని బిరుదు నడకల - విజయనగరపు రాచ కొడుకులు
పొరలఁ బోయఁగఁ గరడు గట్టిన - పచ్చి నెత్తురు కండ
ఈ పెనుగొండ కొండా।

తిరుమలేంద్రుని కీర్తి తేనెలు - బెరగి దించిన కాపు కవనపు
నిరుపమ ద్రాక్షారసంబులు - నిండు తొలకెడు కుండ
ఈ పెనుగొండ కొండా।

ఉదాహరణ వాఙ్మయములో – పైని జెప్పిన త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర గతులలో గల రగడల కూర్పు కనబడును, బసవోదాహరణము త్రిపురాంతకోదాహరణము మొదలయినవి కావ్యములలో ఒక ప్రత్యేక విశిష్టత గల శాఖకు చెందినది. ఇది ఒకరికి కృతిగా రచితము కావగినది. ఇందు క్రమముగా ప్రథమాది విభక్తు లన్నిటను తుదను సంబోధనములోను – విభక్తుల కొక్కటికిని ఒక్క వృత్తము, ఒక్క కళిక, ఒక్క ఉత్కళిక చొప్పున మూడేసి రచన లుండును. ఇవన్నియును ఆయా విభక్తులలోనే కృతిభర్తకు చెందిన పదములు పాదాంతముల నుండును – వెరసి 8 పద్యములు, 8 క[illegible], 8 ఉత్కళికలు [illegible] తర్వాత నొక వృత్తము సార్వ[illegible]త్రికముగా రచితమైనది[illegible]ను. ఒక్కొక్క కళికయును

దాని ననుసరించిన ఉత్కళికయును ఏదైన నొక రగడలో రచితము లగును. పాల్కురికి సోమనాథకవి తెలుగునందు నొకటియును సంస్కృతమున మఱి యొకటియును రెండు బసవోదాహరణములు రచించెను. ఉదాహరణచ్ఛందో రీతి యెట్లుండునో సూచించుటకు అసమగ్రముగానే అక్కడక్కడగల కొన్ని ఖండములు చూపింతును :—

## ప్రథమా విభక్తి

ఉ. శ్రీ గురులింగ తత్పరుఁ డశేష జగన్నిధి శుద్ధతత్త్వ సం
యోగ సుఖ ప్రపూర్తివృషభోత్తమమూర్తి యుతాత్తకీర్తిది
వ్యాగమ మార్గవర్తి బసవయ్య కృపాంబుధి మాకు దివ్య సం
భోగములం బ్రసాద సుఖభోగములం గుణించు గావుతన్

కళిత - మధురగతి రగడ

వెండియుఁ ద్రిభువన । వినుతి సమేతుఁడు ⎫ రెండేసి పాదములు
మండిత స్వర్గ మహిమోపేతుఁడు ⎭ గలవి; ఇట్టివి మరి 8

ఉత్కళిక

భువనోపకార ⎫ ఇట్టివి మరి మూడు; నాల్గవదానిలో ప్రథమా
భవమోదపేర ⎭ విభక్తి;

,, వెలయు శుభకరుఁడు
,, నవి విశ్వగురుఁడు

## ద్వితీయా విభక్తి

చ. వసిగొని యెడ్వఁడేని బసవాయను [illegible]యం

× ×

బసవన పుణ్యమూర్తిఁ దలఁపంగదె చిత్తమ! పాయ కెప్పుడున్.

కళిక — ద్విరదగతి రగడ

వెండియును భక్తాళి - వృద్ధిఁ బెంచినవానిఁ
జండమా యాచార - సరణిఁ ద్రుంచినవాని } ఇట్లే మరి మూడు

ఉత్కళిక

ప్రకృతి వాదము దుడిచి
వికృతి వేషము విడిచి

× ×

నెమ్మిఁ జాలినవాని
మమ్ము నేలినవాని

తృతీయా విభక్తి

ఉ. జంగమపాత్రుచే సమయ సమ్మతుచే భవరోగ వైద్యుచే
... ... ...
సంగతుచేఁ బ్రసాద సుఖసౌఖ్యము నొందెద భక్తిఁ జెందెదన్.

కళిక — ద్విరదగతి రగడ

వెండియును వేదోక్త - విలసత్ చరిత్రుచే
దండి భవ బంధన ల-తాచయ లవిత్రుచే.

× × ×

ఉత్కళిక

సన్నుతుల గడి కట్టి
మన్న[illegible]ద ముట్టి

మెఱయు సువిధజ్ఞుచే
నెఱయు తత్త్వజ్ఞుచే

## చతుర్థీ విభక్తి

చ. అతని ప్రసాద సౌఖ్యమున 'ంగము కీర్తికిఁ గర్ణముల్ గుణ
స్తుతులకు జిహ్వయున్ జరణతోయజ సంగతికిన్ మనంబు స
మ్మతగుణ దివ్య మూర్తికి నమస్కృతియున్ విధించికూడున
ట్లతులిత పుణ్యుఁడైన బసవయ్యకునై ప్రణమిల్లు చిత్తమా!

కళిక — ద్విరదగతి రగడ

వెండియును నిర్మల పవిత్ర గోత్రునకునై
పండిత స్తవనైక - పాత్రగాత్రునకునై
× × ×

ఉత్కళిక

లింగ చిహ్నాలు మోచి
దొంగ లుండఁగఁ జూచి
× × ×
భవరోగ హారునకై
శివరూప ధరునకై।

## పంచమీ విభక్తి

చ. పొసఁగి పోరు దూషకుల పొంగణఁగించి వధించి మించియ
... ... ... ...
బసవన దండనాథువలనన్ గడియింతుఁ బ్రసాద సౌఖ్యముల్

కళిక – ద్విరదగతి రగడ

వెండియును జగదేక-వీర సత్త్వము, వలన
బంగారు బసవ సత్-పండితోత్తము వలన

×　　×　　×

ఉత్కళిక

సార జీవన్ముక్తి
కారణం బగు భక్తి

×　　×　　×

ఓపు ధీరుని వలనం
బాప హారుని వలన

షష్ఠీ విభక్తి

ఉ. దుస్తర కర్మభూసురులు దూషకులై కులమెత్తి పల్కుచున్

...　　...　　...　　...

ర్యస్తుతినించు న బ్బసవరాజున కే నతిభక్తి సేయుదున్।

కళిక – తురగ వల్గన రగడ

వెండియు నవికారసార - విదిత ముదిత మేళమునకు
పండి నిండి పొలుపు సలుపు - భక్తి యుక్తి పాలనునకు

×　　×　　×

ఉత్కళిక

..　　...

ఉన్న గణవిరాజితునకుఁ
జన్న బసవ పూజితునకు॥

## సప్తమీ విభక్తి

చ. అసమ గుణాఢ్యునందు శరణాగతవత్సలునందు జంగమ

. . .  . . .  . . .  . . .

బసరనియందు మా బసవపాత్రునియందు వసింపు చిత్తమా।

కళిక - హయప్రచార రగడ

. . .  . . .

బసవ సత్ప్రబుద్ధునందు
శివగణ ప్రసిద్ధునందు

ఉత్కళిక

నిజమునందు
విజయమందు

## సంబోధన ప్రథమా విభక్తి

చ. ఎసఁగ లలాట వహ్నిఁ గుసుమేషు దహించిన కాలరుద్రునిన్
గసిమసి చేసి దక్షుని మఖంబు హరించిన వీరభద్ర ! యి
వ్వసుమతిఁ బుట్టి భక్తజనవర్యుఁడవైన కృపా సముద్ర ! యో
బసవ ! భవత్ ప్రసాద సుఖభాజనుఁ జేయవె నన్ను నర్మిలిన్

కళిక — తురగవల్గన రగడ

వెండియును సమస్త లోక-విదిత విమల భక్తిబీజ !
దండితేంద్రియ ప్రచండ - తరళ విషమ గుణసమాజ !

× × ×

ఉత్కళిక

పరమ గురుమతానుకూల
భరిత సుగుణ గతివిలోల!

× × ×

సార్వవిభక్తిక పద్యము

ఉ. నీవు దయాపయోనిధివి; నిన్ను నుతించినఁ గల్గు భక్తి; నీ
చే వరవీరశైవరతి చేకుఱు నీకయి యిత్తుఁ గబ్బముల్
నీవలనం గృతార్థత జనించును నీకు నమస్కరింతు నీ
భావమునందు మండి నను బాపకుమీ బసవయ్య! వేఁడుదున్॥

ఉదాహరణ వాఙ్మయము తెలుగు సాహిత్య రచనలలో ఒక శాఖగా ప్రవర్తింపజేసిన కవి పాల్కురికి సోమన. తెలుగు ఛందో రీతులలో ఇదియొక చెప్పదగిన రీతి కనుక ఉదాహరించినాను. ఇంత కంటె ఎక్కువగా వివరించి వ్రాయుటకు ఇక్కడ అవకాశములేదు. ఈ ఉదాహరణములకు సంబంధించిన వివరణము లన్నియును (శ్రీ) నిడుదవోలు వేంకటరావుగారు రచించి ప్రకటించిన ఉదాహరణ వాఙ్మయ చరిత్రలోనున్నవి.

క్రౌంచపదము

వృత్తములందు దీనినిగూర్చి ప్రత్యేకముగా చెప్పవలసిన విష యము లున్నవి:—

1. సంస్కృతములో:- ఇది 25 వ ఛందమున బుట్టిన 16776391 వ వృత్తము.

క్రౌంచ పదాఖ్యాస్యా ననన్నాగ్గా విషుకరవసుముని విరతిరిహ
భవేత్.

Ʋ।। ƲƲƲ ।।Ʋ Ʋ। ।। ।। ।।। ।। Ʋ

భ మ స భ న న న న గ

2. కన్నడములో:—

శీతకరోర్వీవాతశ - శాంకర్ - యుగమిత సురపుర -

నివహద కపెయోళ్ :

ఇందులో వృత్తమందుంపు ప్రాసమేకాక, ప్రతిపాదమందును పైని గుర్తించినట్లు 8వ యక్షరమైన తర్వాత విరమణము, ప్రథమ ఖండమందు ప్రాస యతి; పది యక్షరము లయినతర్వాత మఱల విరమణము మిగిలినపాదమందు 8 లఘువులతర్వాత మఱల విరమణము పాదాంతము నందున విరమణము, తక్కన లక్షణములు సంస్కృత వృత్తములో నున్నవే.

3. కవిజనాశ్రయముగ:-

పంచశరాభా-సంచితపుణ్యా-భమసభ నననయ-పరిమితమైనన్.

4. కావ్యాలంకార చూడామణిలో:—

ప్రాంచితతేజః-కుంచితవైరీ-భమసభ నననయ-పరిచిత రీతిన్.

5. అనంతుని ఛందోదర్పణమున :—

కాంచనభూషా - సంచయమొప్పన్ - ఘనకుచభరమున -

గానసియాడన్.

౮. అప్పకవీయమున :—

పంచమకేశుం - డిచ్చినభాస్వద్ - వరమున మనమునఁ -

బ్రవరముగోరన్

3, 4, 5, 6 - ఈ నాల్గింటిలో చందము మారినది. మొదటి రెండును ఇరువదియేనవ ఛందమయిన అతికృతియందు పుట్టిన వృత్తములుగా నున్నవి. తెలుగు లాక్షణికులు చెప్పిన ఈ నాలుగును ఇరువదినాల్గవ ఛందమయిన సంకృతియందు పుట్టిన 4193479-వ వృత్తముగా నున్నవి. చివరనున్న మూడక్షరములు మొదటి రెండు లక్షణములందును సగణముగా నున్నవి. తెలుగు లక్షణములందు రెండు గురువులుగా నున్నవి. సగణము, గగము నాలుగు మాత్రలు గలవే కనుక నడకలో భేదములేదు. "మైనన్" మయినన్‌గాను; రీతిన్ "వరుసన్" గాను; అడన్ "కదలన్"గాను;'కోరన్' "తలఁపన్"గాను మార్చినచో ఇవియును 25 వ ఛందమునకు చెందిన వృత్తపాదముల వలెనే నడచును. ప్రతిపాదమందున్న మొదటిఖండమందును రెండు ఉపఖండము లేర్పడి ఈ రెండును ప్రాసయుతము లయినవి ఈ ప్రాస లక్షణము సంస్కృత క్రౌంచపదములో లేదు. ద్రావిడభాషలకు చెందిన తెలుగు కన్నడ క్రౌంచపదములందు గలవు :—

| శీకరరోర్వీ | పంకరరాభా | ప్రాంచితతేజః | కాంచనభూషా |
|---|---|---|---|
| వాతశశాంకర్ | సంచితపుణ్యా | కుంచితవైరీ | సంచయమొప్పన్ |

అప్పకవి మాత్రము ఈ ప్రాస నియమము పాటింపలేదు (నాలుగు పాదములలోను ఎక్కడను కనబడదు) :—

| పంచమకేశుం | వంచనతోబా | ప్రాంచితలీలన్ | క్రౌంచపదీవృ |
|---|---|---|---|
| డిచ్చిన భాస్వద్ | దానురుహాస్త- | శంకరనంది — | త్తమ్మునఁ జెప్పా |

తక్కిన లక్షణములలో తెలుగు లాక్షణికులు నలుగురును పాటించిన వడి నియమము అనగా మొదటి అక్షరముతో మైత్రి ప్రతి పాదమందును రెండుచోట్ల కలదు. అప్పకవికూడ ఈ నియమమును పాటించెను. పైనిచూపిన వృత్తపాదములందు కనబడును.

కంకంటి పాపరాజు ఉత్తరరామాయణములో అప్పకవికాక తక్కిన లాక్షణికులు చెప్పిన లక్షణములన్నియును పాటించినాడు:—

తావులుమీరన్ - బూవులువానల్ - తఱచుఁ గురియఁగఁ -
దతఘన భేరుల్ ।

నన్నెచోడఁడు ఈ వడి నియమము (అక్షరమైత్రి నియమము) పాటించెనుగాని పూర్తిగా పాటింపలేదు :— (ఈ వృత్తమును వాడిన తెలుగుకవులలో మొదటికవి ఇతడే)

చంచలనాస్వా - దించుచులేఁదూం ।
ఢ్లకరువు ప్రియులకు - నలరుచు మైరో ।

ప్రాసయుతమైన రెండు ఖండములలోని 10 అక్షరము లయిన తర్వాత 11-వ, 19-వ అక్షరములు మాత్రమే మైత్రిగలవి. మొట్ట మొదటి అక్షరమైన 'చ'తో సంబంధములేదు.

ఈ కారణమున నన్నెచోడుని పద్యము వృత్తము కాదనియు, సీసమువలె రెండు పెద్దఖండములుగా విభక్తమయి మొదటిఖండమున ప్రాస యతియు, రెండవ ఖండమున వడి నియమము (అనగా అక్షర మైత్రి నియమము) కలిగియున్నదనియు అందుచేత 'నిది నన్నెచోడని ప్రాచీనత కొక గొప్ప కారణ' మనియు కీ. శే. మానవల్లి రామకృష్ణ

కవిగారు వ్రాసినారు. కాని, ఇది వారన్నట్లు "గొప్పకారణము" కానేకాదు. ఎందుచేతననగా, ఇందు వృత్తమునకు కావలసిన ముఖ్య లక్షణము-అనగా-అక్షరసంఖ్యా నియమముగలదు, తెలుగు వృత్తము లందు గల ప్రాస నియమముగలదు. లక్షణము లన్నియును నాలుగు పాదములందును తెలుగు లాక్షణికులు చెప్పినట్లే యున్నవి. సీసము లలో ప్రాససీసము, వృత్త ప్రాససీసము, సర్వతః ప్రాససీసము, అక్కిలి ప్రాససీసము ఉన్నవి. వీనిలో ఏదియును నన్నెచోడని క్రౌంచ పదమునకు అవలంబము కాలేదు సర్వతః ప్రాససీసములో పెద్ద పాదములందును ఎత్తుగీతులందును ఖండములందును సర్వత్ర ప్రాస నియమ మున్నది కాని అక్షరమైత్రి గల వడి నియమము కనబడదు. నన్నెచోడని పద్యమందు రెండవ ఖండమున వడి నియమమున్నది. ప్రాస సీసమందు ప్రతిపాదమునను రెండు ఖండములందును పాదాది నున్న అక్షరములోనే మైత్రిగల వడినియమమున్నది :—

కామినిచేనున్న పట్టుతోరముఁజూచి,

ప్రల్లదంబునఁ గ్రెంచి పాఱవైచి

నన్నెచోడని పద్యమందు రెండవఖండమందే ఈ వడి నియమ మున్నది కాని మొదటి ఖండమున వడినియమములేదు. అంతేకాక రెండవ ఖండమందలి వడినియమముగల అక్షరములు తమలోతామే అక్షరమైత్రిగలవి కాని పాదాదినున్న అక్షరముతో మైత్రి గలవికావు. వృత్తసీసపాదములో తెలుగువృత్తములందుగల ప్రాసనియమమేఉంది కాని ఈ ప్రాసము ఖండములందుగాని ఎత్తు గీతులలోగాని కనబడదు. ప్రతి పాదమందును (పెద్దపాదములందే) ప్రాస సీసములో నున్న వడి నియమ మున్నది. నన్నెచోడని పద్యమందు ప్రతిపాదమందును మొదటి

ఖండమందున ప్రాసనియమమున్నది; ఈ రెండు సీసములందునుగల వడినియమము లేదు. అనగా పాదాది అక్షరముతో మైత్రిలేదు. అక్కిలి పాశ్రసీసములో పెద్ద ఖండములో ప్రాసనియమమున్నది కాని మొదటి ఖండమందలి ఉప ఖండములందు గాని రెండవ ఖండ మందలి ఉపఖండములందుగాని ప్రాసనియమము లేదు వడి నియమము ఏఖండమునకు ఆ ఖండముగా చూచుకొని పాటించవలసినదిగా ఉన్నది. నన్నెచోడని పద్యమందు మొదటి ఖండమందలి ఉపఖండములలో ప్రాసన్నమున్నది, వడినియమములేదు. సీసములలో ఈ నాలుగును వృత్తసీసములుగా ప్రత్యేకలక్షణము గల సీస భేదములు; ఇట్లే వడి ప్రత్యేకతగల సీసములు కూడ గలవు ఇవికాక సమసీసములున్నవి. వీనిలో ఏదియును నన్నెచోడని క్రౌంచపద వృత్తములకు అవలంబ ములు కాజాలవు. పాదములందుగల ప్రాస లక్షణము, పాదఖండము లందలి ప్రాసలక్షణము—ఈ రెండును (అప్పకవికాక) తక్కిన లాక్ష ణికులు చెప్పినవేకదా? అక్షరమైత్రి పాదాది వర్ణముతో లేక పోవుటే నన్నెచోడని క్రౌంచపద ప్రత్యేకత. ఈ కారణములవల్ల రామకృష్ణకవిగారు చెప్పినది సరికాదని చెప్పవలెను. ఇంతవఱకును ఇది లక్షణగ్రంథములన్నిటను (సంస్కృతములోగానీ. కన్నడములో గానీ, తెలుగులో గానీ,) వృత్తములలో చేర్చిచెప్పినదేకాని జాత్యుప జాతులలో చేరదగినదిగా ఎవరును చెప్పినది కాదు.

ఈ వృత్తము చతురస్రగతిని చక్కగా నడచును. అంతేకాక చతురస్ర జాతిగణములు ఎనిమిది కలవు కనుక చతురస్రగతిని ఆది తాళములో గూడ నడమనని చెప్పవలెను.

చతురస్ర జాతిగణములతోనే ఇంచుమించు క్రౌంచపద వృత్తమువలెనే నడచు వృత్తములు మఱికొన్ని గలవు అందులో

ముఖ్యమైనవి : 25 వ ఛందమునందలి బంధురము, భాస్కర విలసితము.

బంధురము :—

ఋభువులు దితితన।యులు సమబలులై
యెంతయు మత్సర।ముల్ బెరయన్ ,

భాస్కర విలసితము :-

గోపనికరములు। నేలినవానిన్ గోవృషదనుజుల। నడంచిన వానిన్।

ఈ రెండును చతురస్రగతి ఆదితాళమునకు సరిపోయినవే. అందులో బంధురపాదములందు రెండు లఘువుల కాలము విశ్రాంతికి అవకాశ ముండుటవలన ఆది తాళమున స్వరము పొడిగించి పాడవచ్చును. రెండవదియైన భాస్కర విలసితమున చతురస్ర గణములు ఎనిమిదియును పూర్తిగా ఉండుటచేత విశ్రాంతికి అవకాశము లేదు కనుక ఆదితాళము గతిలో పాడుటకు అనుకూలింపక పోయినను నడప వచ్చును.

## త్రిభంగి

ఈ వృత్తమును గూర్చి కూడ చెప్పదగిన అంశములు కలవు:—

1. కవిజనాశ్రయమునందు గల లక్ష్యలక్షణ పద్యపాదము :-

నన నన సస భము।లునుమసగము యుక్తము। లైనన్ । మృదు
వైనన్ । బ్రస్తుత మైనన్ ।

తనరువా । భవనిభ । మనమలరఁ ద్రిభంగిని । జెప్పున్ । వడి
దప్పున్ । బ్రాసము లొప్పున్ ।

2. కావ్యాలంకార చూడామణి యందలి పద్యము :—

లలి నన ననననములు సస భమ సగ ములు సన యుక్తిఁ జ

రింపన్ బ్రసరింపన్ బాటి వహింపన్

జెలువుగ నవకలి నిలుపఁగఁ దగునెడ వెలయుఁ ద్రిభంగి సు

రక్తిన్ బదయుక్తిన్ బ్రాస నియుక్తిన్

3. అనంతుని ఛందోదర్పణము నందు గల పద్యము :—

నననన ననససలును భమ సగలును - దనరి నటింపఁగ

ణంకన్ నలువంకన్ బెంపు దొలంకన్॥

మునుకొని నఖముఖ మున వెడఁగ దలుపఁ-జనుఁ గడు నొప్పగు

వీణల్ నెరజాణల్ వేణుపుగాణల్॥

4. అప్పకవీయము నందు గల పద్యము :—

విసువక సుకవులు రస ప్రతి పదమున హాస గగ మూఁడొక

తీరై మఱి వేఱై మూఁడొక తీరై

ఇందులో ఒక్క కవిజనాశ్రయమందే పాదమునకు 28 అక్షరములు 36 మాత్రలు ఉన్నవి. తక్కిన మూడు పద్యములందును పాదమునకు 34 అక్షరములును 42 మాత్రలును కలవు. అన్నిటను పూర్వార్థమున ప్రాసయతియును ఉత్తరార్థమున అంత్యప్రాస నియమమును కలవు.

## మూడవ ప్రకరణము

## మాత్రాగణ నిబద్ధములయిన ఛందోరీతులు

ఇవి సంస్కృతములో (అనగా వేదములందు కాదు; లౌకిక భాషలో)ను, ప్రాకృతము అందును పెక్కువిధము లయినవి కలవు. తెలుగులో రగడలు, వైతాలీయాఖ్య పద్యములు, అప్పకవి మతమున గల ఆఱు కందములు, ఉత్సాహము — ఇవి మాత్రాగణములు కలవి. ఇందులో రగడలను గూర్చి చెప్పినాను. ఉత్సాహమును త్ర్యస్రజాతి పద్యములతో నొకటిగా పేర్కొంటిని. ఇక వైతాలీయాఖ్య పద్యములను వివరింతును :—

అప్పకవి వైతాళీయ జాతి వృత్తము లను పేర ఈ దిగువ నుదాహరించినవి :— (గణ గుర్తులతో మాత్రమే ఇచ్చినాను. ఇవి తెలుగు ఛందోరీతులలో ప్రసిద్ధి కెక్కలేదు. అయినను కొన్ని గేయాలలో అప్పుడప్పుడు వీని చాయలు గోచరించును గనుక పోలిక తెలియజేయుటకు ఈ రీతిని ప్రదర్శింతును.

దక్షిణాంతిక :—

| | | మాత్రలు | |
|---|---|---|---|
| పాదములు | IIU I . UI U U | 6 + 8 = 14 | |
| | I UUII . UI UIU | 8 + 8 = 16 | కన్నడములో |
| | IIUII . UI UIU | 6 + 8 = 14 | లేదు |
| | I UU I . UI UIU | 8 + 8 = 16 | |

ఔపచ్ఛాందసము :—

||| |||. U| U| UU   6 + 10 = 16

||U U||. U| U| UU   8 + 10 = 18

||U |||. || U| UU   7 + 9 = 16

| U UU. U U| UU   8 + 10 = 18

వైతాళీయమునకు ఒక్క గురువు చేర్చిన ఇది యగును. కన్నడము లోను ఇట్లే ఉండును.

ప్రవర్తక :—

|| U||. U| U|U   6 + 8 = 14

ఉదీచ్య మొదటి పాదమునకు సమము

||U U||. U U|U   8 + 8 = 16

ప్రాచ్య 4వ పాదమునకు సమము 2వ పాదము |||| U||

||| |||. U| U|U   6 + 8 = 14

ఉదీచ్య 3వ పాదమునకు సమము

||U U| . U U|U   8 + 8 = 16

ప్రాచ్య 4వ పాదమునకు సమము

ఇది కన్నడములో లేదు.

అపాతలిక :—

|| U||. U| UU   6 + 8 = 14

|||| || |. U|| UU   8 + 8 = 16

||| ||U. U U U   7 + 8 = 15

|||| ||U. U UU   8 + 8 = 16

వైతాళీయమువంటిదే కాని తుది గణములు దీనిలో రెండు గురువులై ఉండవలెను. కన్నడములో లేవు.

పరాంతిక :—

I U II . UI UIU   $6+8=14$
I U UII . UI UIU   $8+8=16$
III II . UI U U   $6+8=14$
IIU III . UI U U   $8+8=16$

వైతాళీయము :-

III II . UI UIU   $6+8=14$
III IIII . UI U U   $8+8=16$   కన్నడములోను
III II . U U U   $6+8=14$   ఇట్లే
IIII UU . UI U U   $8+8=16$

చారుహాసిక :-

III III . UI U U   $6+8=14$
IIU IIU . UI U U   $8+8=16$   కన్నడములో
IIU II . UI U U   $6+8=14$   లేదు
IIU UI . UI UIU   $8+8=16$

ప్రాచ్యవృత్తి :-

IIU I . UI UIU   $6+8=14$
I I UII . UI UIU   $8+8=16$   కన్నడములో
II UI . UI U U   $6+8=14$   లేదు
IIU UII . UI UIU   $8+8=16$

ఉదీచ్యవృత్తి :-

III III . UI UIU   $6+8=14$
IIU UII . UI UIU   $8+8=16$   కన్నడములో
III III . U UIU   $6+8=14$   లేదు
IIU UII . UI UIU   $8+8=16$

ఇవి కాక సంస్కృతములో మాత్రాసమత మున్నది. అందు ప్రతి పాదమునందును 16 మాత్రలు చొప్పున ఉండును. 9వ మాత్ర లఘువుగా నుండును. పాదాంతము గుర్వంతము కావలెను. ఇట్టిది తెలుగులో చతుష్పద గలదని అప్పకవి చెప్పిన పద్యము :—

జలజాసన వి-శ్రమ సంయుతమై
లిలి షోడశమిత - లఘువులతోడన్ ।
గలసి చతుష్పద - గతులను ధరలోన్
దెలువగు చౌపద - సేవక సులభా॥

జాత్యుపజాతులు

అప్పకవి చెప్పిన లక్షణము :-

"జాతులు నుపజాతులు నన
భూతలమున రెండు భేద-ములు జాతులలో
జాతులు కందాదిక ముప
జాతులు గీతాదికములు - సరసిజనయనా॥

"కంద భేదము లారు..."

× × ×

కందషల్భేదాభిధానంబులు

"పరఁగఁ గందము పథ్యయు - మరి విపులయుఁ
జపలయును ముఖచపలయు - జఘన చపల
లనఁగఁ గంద పద్యంబు లీ - యాఱువిధము
లఖిల సుకవి కృతులలోన - నలరుచుండు

పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘనచపల— ఈ అయిదును ఆర్య లనియు; గీతి, ఉపగీతి, ఉద్గీతి, ఆర్యాగీతి — ఈ నాల్గును గీతు లనియు సంస్కృత చ్ఛందములో చెప్పబడినవి. కందమన్న పేరు లేదు.

సంస్కృతమున గల ఆర్య లయిదింటికిని సామాన్య లక్షణములు కొన్ని గలవు :-

లక్ష్మైతత్ సప్తగణా, గోపేతా భవతి నేహవిషమేజః।
షష్ఠోజశ్చన లఘువా, ప్రథమార్ధే నియత మార్యాయాః॥
షష్ఠే ద్వితీయ లాత్పర, కేన్లే ముఖలాచ్చస యతిపద నియమః
చరమేఽర్ధే పంచమకే, తస్మాదిహ భవతి షష్ఠోలః

| | | |
|---|---|---|
| $4+4+4$ | $=12$ | అంకెలు మాత్రాసంఖ్యను |
| $4+4+1+3+4+4$ | $=20$ | నిలువు గీతలు యతిస్థానము |
| $4+4+4$ | $=12$ | లను తెలియ జేయును. |
| $4+4+1+4+2$ | $=15$ | |

రెండవ పాదము మూడో గణము నలమో జగణమో కావలెను. దానిలో మొదటి లఘువు తర్వాత విరామము గనుక $1+3$ అని వ్రాయవలసివచ్చినది. పైని చెప్పిన విషయములు సూత్రప్రాయముగా అనంతుడు III. 3–4 లో చెప్పినాడు :–

కంద మరయ నార్యాగీతి కడ గణంబు
నపర షష్ఠంబు గురులఘు లైన నార్య
నలఘు లాటింట గిరిశర స్థలుల నున్న
నగు ద్వితీయ ప్రథాన లఘ్వాదియతులు

ఈ చెప్పిన యతి నియమంబులు సంస్కృతాదులకయ్యె మఱియుఁ దెలుఁగున కెట్లనిన :-

వడియగు నార్యకు రెండవ
యడుగునఁ ద్రిగణంబుమీఁద సంధ్ర కవితకున్

గడపటి పాదమునకు వడి
యడరును ద్విగుణయుత లఘువు కవ్వలిపోటన్.

అప్పకవి చెప్పినట్లు "కంద మూఱు విధములు" అని యనక అనంతుడు సరిగా

సరవిఁ బథ్యా విపుల చపలార్యా ముఖ జఘ
నాఖ్య చపల లనఁగ నార్య లైదు
నొనర గీతి యనఁగ నుపగీతి యుద్గీతి
యార్యా పేరి త యనఁగ నాల్గు ఁజెను.

అనంతుడు చెప్పిన లక్షణము యతి ప్రాస నియమములో కాక తక్కిన విషయములలో సరిపోయినది. కందములో కనబడునట్లు ప్రాసమును సమపాదములలో మూడవ గణము తర్వాత వళియును ఉండవలెనని తెలుగు లాక్షణికులు చెప్పినారు

ముద్రితమైన ఛందోదర్పణ ప్రతిలో ఆర్యాగీతుల లక్ష్య పద్యములు కనబడలేదు. లాక్షణికుల సంప్రదాయమును అనుసరించి లక్ష్య లక్షణములను ఒకే పద్యమందు ఇతర స్థలములలో చూపించిన అనంతుడు ఈ ఆర్యాగీతుల విషయములో చూపింపకుండునా? అజ్ఞానముచేత కొందరు లేఖకులు అనంతుని పద్యములను కందముల వలె నడచునట్లు దిద్దినారని తోచును. అనవసరముగా అతికిన మాటలను తీసివేసినయెడల లక్ష్యలక్షణ పద్యములు యథోచితముగా కనబడును. ముద్రిత ప్రతిలో ఉన్నది :—

పథ్యార్య

క. బేసులు త్రిగణ యుతములై
యా సమపాదములఁ బొరసి యార్య యనఁ 'గడున్'

భాసిల్లుఁ బథ్య యనఁగా
వాసవము ఖ 'సకల' వర్గ'ప్ర'ణుతా॥

ఇందులో 'కడున్' 'సకల' 'ప్ర' నిరర్థకముగా కలిపి కందము వలె నడపించిరి. అది తీసివేసినయెడల అనంతుని పద్యము సరిగా కనబడును :—

చేసులు త్రిగణయుతములై
యా సమపాదములఁ బొరసి యార్య యనన్
భాసిల్లుఁ పథ్య యనఁగా
వాసవముఖ దివిజ వర్గనుతా॥

విపులార్య

క. ప్రకట సమ పాదముల నిలు
వక శబ్దమునవలఁ జొచ్చి వచ్చె 'ననం' ద
క్కక విపులార్య యిగును సే
వక జనమందార 'ధీర' వనజ'దళా'క్షా॥

అనవసరముగా చేర్చిన, మార్చిన పదములు [' '] లలో చూపించినాను.

అట్లు చేసిన చేర్పులు మార్పులు తీసివేసినయెడల విపులార్య స్వరూపము ఎట్లు బయటపడునో చూడుడు :-

ప్రకట సమ పాదముల నిలు
వక శబ్దము నవలఁ జొచ్చి వచ్చినఁ ద
క్కక విపులార్య యగును సే
వక జన మందార వనజాక్షా॥

చపలార్య

క. వరుసను ద్వితీయ మంత్యము
స్ఫురʻణన్మʻథ్యగ జకారములుʻనుʼ దగʻన్ʼ రెం
డరయఁగఁ దనర్చు నేనిన్
ʻసరవి నదియʼ హారి మురారి చపలార్య యగున్॥

కందముగా నుండవలెననుకొని చేసిన చేర్పులు మార్పులు [ ʻ ʼ ] లలో కనబరచినాను.

అనవసరములయిన ఆ చేర్పులు మార్పులు తీసివేసినయెడల అనంతుని రచన బయిల్పడును.

వరుసను ద్వితీయ మంత్యము
స్ఫురద్గమాద్యగ జకారములు దగ రెం
డరయఁగఁ దనర్చు నేనిన్
హారీ మురారి చపలార్య యగున్॥

ముఖచపలార్య

క. చపలా గణప్రకారం
బపార కారుణ్యసాగరా ప్రథమాʻర్థంʼ
ʻబʼపరం బగుచున్నది ముఖ
చపలార్య యనంగఁ జనుʻను జక్కఁగఁʼ గృతులన్॥

కందము చేయగోరి కలిపిన మాటలు [ ʻ ʼ ] లలో నున్నవి.
అవి తీసివేసినయెడల కనబడు ముఖచపలా పద్యము.

చపలా గణప్రకారం
బపార కారుణ్యసాగరా! ప్రథమా
ర్థపరం బగుచున్నది ముఖ
చపలార్య యనంగఁ జనుఁ గృతులన్॥

జఘనచపలార్య

క. మొదలి సగము చపలార్యా
స్పదగణ లక్షణము సౌరక చరమార్ధం'బం'
దుదిత ప్రకార రేఖన్
గదాధరా చనుఁ '(కృ)తుల' జఘన చపలా'ర్య'న్।

అనవసరముగా చేసిన చేర్పులు మార్పులు [ ' ' ] లలో గలవు.

అవి తీసివేసినయెడల సరియైన స్వరూపము.

మొదలి సగము చపలార్యా
స్పదగణ లక్షణము సౌరక చరమార్థం
బుదితప్రకార రేఖన్
గదాధరా! చను జఘనచపలన్।

గీతి

క. లసదార్య మొదలి సగమున
నెసగఁగ రెండరలుఁ జెప్పిరే నది'యే' గీ
తి సమాహ్వాయ మగుఁ గృతులన్
వసుధాధర కృష్ణ యాదవస్వామి 'యనన్'॥

అనవసరముగా చేసిన చేర్పులు [ ' ' ] లలో గలవి.

అవి తీసివేసినయెడల గీతి లక్షణము గల అనంతుని పద్యము.

లసదార్య మొదలి సగమున
నెసగఁగ రెండరలు చెప్పిరే నది గీ
తి సమాహ్వాయమగుఁ గృతులన్
వసుధాధర కృష్ణ యాదవస్వామీ॥

ఉపగీతి

క. ధర నార్య మీఁది సగమున
నిరుసగమున నట్ల చెప్పిరేని 'యదియ' దాఁ
బరఁగు నుపగీతి యనఁగా
సరసిజదళ నేత్ర 'కృష్ణ' శార్ఙ్గధర 'హరి'

అనవసరములైన చేర్పులు మార్పులు [ ' ' ] లలో గలవి.

ధరనార్య మీఁది సగమున
నిరుసగమున చెప్పిరే నది దాఁ
బరగు నుపగీతి యనఁగా
సరసిజదళ నేత్రా శార్ఙ్గధరా॥

అవి తీసివేయగా కనబడు నిజస్వరూపము.

ఉద్గీతి

క. విదితార్య చరమ దళమున్
మొదలి సగము చేసి 'యందు' మొదలి'ంటి' సగం
బదియ పదార్థముఁ జేసినఁ
బొదుపగు నుద్గీతి భుజగ భు'గ్వర' గమనా !॥

అనవసరములయిన చేర్పులు కూర్పులు [ ' ' ] లలో గలవి.

విదితార్య చరమ దళమున్
మొదలి సగముచేసి మొదలి సగం
బది యపరార్థముఁ జేసినఁ
బొదుపగు నుద్గీతి భుజగ భుగ్గమనా॥

అవి తీసివేసినయెడల కనబడు నిజ స్వరూపము.

నేను చూచిన (పరవస్తు గ్రంథాలయములోనిది) ప్రతిలో మొదటివి రెండున్ను ముద్రిత ప్రతిలో నున్నట్లున్నవి. తక్కిన వన్ని యును నే నిక్కడ చూపినట్లుగానే సరియైన పాఠములతో ఉన్నవి. రెండవదానిలో కూడ రెండవ పాదము నే నిక్కడ చూపినట్లే సరియైన పాఠముతో నున్నది. కనుక లేఖకు లెవరో అనంతుని రచనలు తెలిసికొనక కందము లనుకొని దిద్ది అనంతునికి ఉపకారము చేయబోయి అపకారము చేసినారు.

అప్పకవి పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘనచపల అనే ఈ పద్యముల లక్షణము అనంతుని వలెనే వివరించి వానిని ఆయా ఛందములందే రచించెను. అనంతుని పద్యములను కందములుగా మార్చివేసినట్లు అప్పకవి పద్యములను మార్చివేయలేదు. అది మన యదృష్టము. చూడుడు; అప్పకవి పద్యములు :-

పథ్య - ధరలోఁ బథ్యా కందము
హారియగు నాఁబవయెడల నల - మాఁటిటిపై
విరతియు గూడఁగ మూఁటను
నెరయుఁ జతుర్గణములు గము - నిలిచినచోన్॥

విపుల - క్షమ జేసికాలు సమ పా
దములోఁ జొర శబ్దమొకటి - తనరింపన్
సమధిక పథ్యా కందము
గమనిక విపుల యన నలరు - కందమగున్॥

చపల - సమపదముల మొదలం జగ
ణముం గడ యడుగునను ద్విగణ లఘువుపై
నమకొను విరతియు పదియేన్
లముల్ ముకుంద చపలకు నమరున్॥

ముఖచపల - స్థిరచపలా కందము పై
ఖరిన్ మొదలి యడుగు చెప్పఁగఁ గవులు పె
ట్టిరి ముఖచపల యనెడు పే
రరిదిగ వైకుంఠ వరద - యఘువైత్రా॥

జఘనచపల - క్రమఁ బథ్యారీతిఁ బూర్వా
ర్థము చపలా కందము క్రియఁ - దగున పరా
ర్థము జఘనచపలకు మునీం
ద్ర మానస మరాళ - దాశార్హా।

అనంతు డీ పథ్యా పంచ పద్యములను కందముతో చేర్పక ఆర్యలుగా పేర్కొనెను. అప్పకవి వీనిని కందముతో చేర్చి "కంద షట్కాభిధానములు" అను వర్గముక్రింద వివరించెను. కనుకనే పథ్యాదులను ఆర్యా శబ్దముతో చేర్చిన అనంతుడు, పథ్యార్య అనఁగా అప్పకవి కంద నామముతో చేర్చినవాడు కనుక 'పథ్యా కంద', 'విపులా కంద' అనెను. •

కందమునుగూర్చి లాక్షణికు లందఱును ఒకరీతిగానే లక్షణము నిరూపించినారు.

" కందము త్రిశరగణంబుల
నందముగా భజస నలము లట వడి మూఁటన్ ।

బొందును నల జల నాటిట
నొందుం దుద గురువు జగణముండదు బేసిన్ "

ఈ పద్యము తెలుగు దేశమం దంతటను వ్యాపించినట్లున్నది. కంద పద్య లక్షణము లన్నియును ఈ చిన్న పద్యమునందు చక్కగా అమరి యున్నవి. నాలుగు పాదములు గలది; బేసి పాదములు చిన్నవి మూడు గణములు గలవి; సరిపాదములు పెద్దవి అయిదు గణములు గలవి. ఇందుండతగిన గణములు భ, జ, స, నల, గగములు; మొదటి రెండు పాదములు కలిసి పద్యములో సగము. ఇందులో గల ఎనిమిది గణములందును బేసి గణములందు అనగా 1, 3, 5, 7 అయిన గణములందు జగణ ముండదు. అనగా 2, 4, 6 గణములం దుండ వచ్చును. అంతేకాదు 6 వ గణము విధిగా జగణము, లేదా, నలము ఉండవలెను. 8 వ గణము సరిగణమే అయినను తుది గణము కనక గుర్వంతమై ఉండవలెను అన్న నియమము కలదు. అది గగమో (రామా) సగణమో (రమణా) అయిన యెడలనే సాధ్యము గాని భగణ (రాముడ) జగణ (జయంతి) నలము (జగమున) లయిన యెడల గుర్వంతము అగుట సాధ్యము కాదు. వడి సమపాదము లందు ఆఱవ గణము (అనగా పద్యము రెండు భాగములు చేసి ఒక్కొక్క భాగములోనివి 8 గణములని లెక్కించి చూచినయెడల) జగణమో నలమో అయిన తర్వాత వడి, ఈ వడికి మాత్రము సరి పాదములు ప్రత్యేక పాదములుగా చూడవలెను. అందు పాదాది నున్న అక్షరమును ఆఱవ గణము దాటగా ఏడవ గణమందలి మొదటి అక్షరమును మైత్రి పొందవలసిన అక్షరములు. నాలుగు పాదము లందును వృత్తములలో నున్నట్టు ద్వితీయాక్షరము ప్రాసాక్షర

నియతి గలది. ఇన్ని లక్షణములును స్పష్టముగానో సూచనగానో ఆ పద్యమం దిమిడియున్నవి.

ఈ లక్షణ విశేషములకంటె ఈ పద్యములో గల నడకవలన కంద పద్యము సొంపు మనకు బాల్యములో మనసున నాటుకొని పోయినదనుటలో నతిశయోక్తి లేదు. నేను ఐదేండ్ల బాలుడుగా ఉన్నప్పుడే మా తల్లి తండ్రి నేర్పిన పద్యములు జ్ఞప్తియం దున్నవి.

చింతామణి యను బ్రాహ్మడు
పంతానికి గోడమీద పటమున్ వ్రాసెన్
అంతట వర్షము కురిసెను
కాంతామణి కంటిమీద కాకరి పూచెన్॥

ఇటువంటి పద్యాలలో రసమూ లేదు భావగౌరవమూ లేదు. కేవలమూ నడక సొగసు అలవడజేయుటకే ఇవి పనికివచ్చును. ఐతే ఇంత సులువుగా నడక అలవడజేయగల పద్యము లున్నను 'కందము చెప్పినవాడే కవి' అనుటలోను, తిక్కన, సోమయాజి, పోతరాజు, కవిచోడప్ప చెప్పినంత అందముగా తక్కిన కవులు ఈ కందపద్యమును చెప్పలేదనుటలోను అర్థము లేకపోలేదు. లాక్షణికులు చెప్పిన లక్షణములను అన్నిటిని పాటించుచు చెప్పినను కొన్ని పద్యము లున్నంత శ్రావ్యములుగా మఱికొన్ని కం: పద్యము లుండవు. ఈ విషయము తక్కిన జాతిపద్యములకు కూడ వర్తించును. కాని ఉత్పల మాలా శార్దూల విక్రీడితా వృత్తములవంటి పద్యములు ఎవరు రచించినను అందులో ఇంపు, సొంపు, జిగిబిగి లేకపోవచ్చును గాని నడక చెడదు. కంద మట్టిది కాదు. దీనిని రచించుటలో స్వేచ్ఛ

కావలసినంత కలదు. ఆ స్వేచ్ఛను వినియోగించుకొనుటలో సమర్థత గలవారే హృద్యములయిన పద్యములను రచింపగలరు. ఆ స్వేచ్ఛ దుర్వినియోగము చేయువారు "ఇది కందపద్యమా ?" అన్నంత ఎక్కువగా దీని నడకను చెడగొట్టగలరు. దీనికి కారణము లేమనగా:

కందము ననేక రీతుల నడపించుటకు అవకాశమున్నది. ప్రాకృత చ్ఛందములలో గాథా భేదములందు 'ఖంధ' అనే పేర నొకటి గలదు. అది పూర్తిగా మన కందపద్య లక్షణము గలది. కనుక ఆ ఖంధ నుండియే మనకు కందము వచ్చినదని చెప్పవచ్చును. ఈ ఖంధ అనే ప్రాకృత పదము సంస్కృత శబ్దమయిన స్కంధను నుండి వచ్చి యుండును. సంస్కృత ఛందములలో ఆర్యాగీతి కందమువంటిది. దీనిని మన తెలుగు లాక్షణికులు గుర్తించినారు.

అనంతున ఛందములోని ఆర్యాగీతి :-

కందములకు గల నియమము
లం దేమియుఁ గడమ వడక - యడరిన నది యిం
పొందఁగ నార్యాగీతి య
నందగు నిట్లురగభూష-ణ ప్రణుతగుణా॥

అప్పకవీయములోని ఆర్యాగీతి :-

సముదీరిత పథ్యా కం
దము కన్నను నొక్క గురువు - దాకించినచో
క్షమ నార్యాగీతి యగున్
గమలాప్రాదేశ సహజ - కందం బదియే॥

ప్రాకృతములో నున్న ఖంధ సంస్కృత శబ్దమయిన స్కంధకు సంబంధించినదయినా ఆర్యాగీతి వంటిదిగా స్కంధవృత్తమును పేర్కొన లేదు. ఖంధములో నుండదగిన గురు లఘువుల సంఖ్యనుబట్టి ఏర్పడ గల ఖంధలు 28 రకములకు పేళ్లున్నవి. 30 గురువులును 4 లఘువులును గలవి నంద యనే ఖంధ. ఈ విధముగానే 29గు, 6ల; 28గు, 8ల; 27గు 10ల × × × × 4గు, 56ల—గలవిగా ఏర్పడినవి. మొత్తము 64 లఘువులు (మాత్రలు) రెండు భాగములును కలిసిన పద్యములో ఉండును. ఈ విధముగా ప్రస్తరించి లెక్కించి చూచిన యెడల మన కందము లెన్ని విధము లయినవో చూడుడు :— (గణముల వరుసను ఉండదగిన గణములను వివరించి కనబఱుతును )

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| 4 (విధములు | 5- | 4- | 5- | 4- | 2- | 4- | 2- |
| నల | నల | నల | (2వలె) | 3 వలె | నలము | 3 వలె | స |
| భ | భ | భ | | | జ | | గగ |
| స | స | స | | | మాత్రమే | | మాత్రమే |
| గగ | గగ | గగ | | | | | |
| | జ | | | | | | |

అనగా $4 \times 5 \times 4 \times 5 \times 4 \times 2 \times 4 \times 2 = 25600$ విధములు కందమునందలి పూర్వార్ధములో నుండగలవు. కాని మొదటి పాదమందు మొదట గురు లఘువులలో ఏది యుండునో అదియే ద్వితీయ పాదాద్యక్షరము కావలెను, గనుక 15360 విధము లేర్పడును. ఇందులో 5120 గుర్వాది పాదములు గలవి, 10240 లఘ్వాది పాదములు గలవి కనుక పద్యములందలి రెండు సగములును లెక్కించి చూడగా $5120 \times 5120 = 46214400$. పాదములందలి

మొదటి యక్షరము గురువు గలవి; 18,48,57,600 లఘువు గలవి ఉత్పన్నము కాగలవు అయితే, ఇందులో బేసిని జగణ ముండదు, 6వ గణము నలమో జగణమో కావలెను, 8వ గణము గగమో సగమో కావలెను అను నియమములను చూచుకొనినయెడల అభినవ భారతి 2వ సం॥ పుట 292 లో చెప్పినట్లు కందమునకు సరియైన అర్యాల మొత్తము 8,19,20,600 అని లెక్క తేలినది.

ఇన్నివిధములుగా ఏర్పడుటకు అవకాశ మున్నది కనుకనే కందము రచించుటలో కవికి కావలసినంత స్వేచ్ఛ గలదు. నడక లెస్సగా తెలిసిన రసజ్ఞులు కందమును అందముగానే నడపినారు. కాని శాస్త్రదృష్టిని చూచి చెప్పవలెనన్న యెడల ఆ అందమును పోషించు లక్షణము కందపద్య లక్షణములో పూర్తిగా లేదు. అందుకు నిదర్శనముగా చూడుడు :-

ఈ దిగవును వివరించిన పద్యములన్నియు లాక్షణికులు చెప్పిన లక్షణములను పూర్తిగా పాటించినవే కాని ఇంకొకటియు కంద ముగా నడవదు-

1. చిలుక పలుకు చెవిని బడిన
   చెలియ పలికె ననుచుఁ దలఁచి - చెలిని బిలువఁగా
   చిలుక మఱల బలికె నతని
   చెలియ పలుకు కాదటంచు - చెప్పునటులగా॥

నడకనుబట్టి ఇది త్ర్యస్రగతిని నడచు పద్య మనవలెనే కాని కందపద్య మని చెప్పగలమా ?

2. చెలి పలుకె యగుననుచు నొక
   చిలుక పలుకు విని మదిఁ దలఁచి నిలిచి కనఁగా।

చెలి యెచట నున్నదని యా
చిలుక యొక తరువు పయి నిలిచి యొసగె రుతమున్॥

ఇది ఖండగతిని నడచు పద్య మనవలెనే కాని కందమువలె నడచునా ?

3. చిలుక పలుకులు । వినిన దన
చెలి పలికెనని మది । దలచి - చెలియా యనఁగా । -
చిలుక యపుడిటు । పలికె నీ
చెలి యెచట గలదని । చెలియ - చిత్తమలర్పన్

ఇది మిశ్రగతిలో నడచు పద్యమువలె నున్నది గాని కందము వలె నడచునా ?

4. వనము నడుమను విశేష ర
మణీయములగు తరులను సుమములనెటులఁ జే
సెనొకద యా బ్రహ్మ యని క
డు నలరుచుండఁగ వసంతుఁడు పిలిచె నన్నున్.

ఇదేమి ! పద్యమా ? వచనమా ? అన్నట్లున్నది. కందము గతియే కాదు ఏ గతియును లేని రచనగా నున్నదిగదా ?

కందపద్యము చతురస్రగతిలో నడచుననియు, పూర్వార్ధమందు ఎనిమిది, ఉత్తరార్ధమందు ఎనిమిదేసి గణములు కలవు గనుక ఆదితాళములో నడవగల పద్యమనిన్ని మనమందరమును మనసున దృఢముగా నిలుపుకొని యున్నాము కనుక అందుకు భిన్నముగా నడచునది కందము కాదన్నట్లు తోచుట సహజము. అయితే, పైని ఉదాహరించిన పద్యములు లాక్షణికులు చెప్పిన లక్షణమునకు సరిపో

యినవి. అందు గణములే కాక వడి ప్రాస నియమములును గలవు. ఎందుచేత నీ పద్యములలో మొదటి మూడును భిన్నగతులను నాల్గవది వచనము వలెను నడచుచున్నవి? అందుకు నా సమాధానము ఒక్క వాక్యములో చెప్పజాలను. ఇది యొక కొత్త విషయము కనుక విస్తరించి చెప్పవలెను. ఇది ఆంగ్లేయ భాషలో గల accent పదము నకు సంబంధించిన విషయము.

ఆంగ్ల భాషలోనే కాక తక్కిన అన్ని భాషలలోను accent అన్నది కలదు. కొన్ని భాషలలో స్ఫుటముగా గోచరమగును. మఱి కొన్ని భాషలలో అస్ఫుటముగా నుండును. ఈ విషయమును గూర్చి Prof. Blackie ఏమి చెప్పెనో Encyclopaedia (Vol. pp. 80 - 81) లో వాక్యములను జూడుడు : Only a machine could produce a continuous series of sounds in undistinguished monotonous repetitions like the tum, tum, tum of a drum; a rational being using words for a rational purpose to manifest his thoughts and feelings necessarily accents both words and sentences in some way or other. That the accentuation of some languages is more distinct, various and more effective than that of others is beyond question but there are, none so far as we know, in which its power is not self. The statement some times made that the French have no accent can only mean that their accent is less emphatic or less variously so than that of certain other nations. If it means more, it is not merely an error but an absurdity.

ఈ మాటలు తెలుగు భాషకు కూడ వర్తించును. Accent అనే మాటకు "ఊత" అని పేరు పెట్టినాను. ఇంతకంటె ఎక్కువ సార్థకమయిన పేరు ఎవరు తెలియజేసినను కృతజ్ఞతతో గైకొందును.

తెలుగు మాటలలో పది, వల, పలక, వెదురు, ఎనిమిది, చిలుకలు, పలుకడు, పతకము మొదలయిన లఘువులు గల పదము లలో గాని వాడు, వాడుక, ఆదరము, సాగరములు మొదలయిన దీర్ఘాది పదములందును ప్రధానమైన ఊత మొదటి అక్షరముపైనే ఉండును. (అక్షరమనగా స్వరయుక్తమయినది). అక్షరముల సంఖ్య ఎక్కువయినప్పుడు అప్రధానమైన ఊత (Secondary accent) పద మందు మఱియొకచోట నుండును. పలుకు మూడక్షరములు గలది; పల్కు రెండక్షరములు గలది. రెండును ఒకరీతిగానే మొదటి అక్షరమున ఊత గలవి. కాని ఊత యొక్క తత్త్వమును తెలిసికొనుటకు ఒక అంశము జ్ఞప్తియం దుంచుకొనవలెను. పలుకు లో ఊత లేని లు ఊత గల ప తో చేరుటచేత పల్కు అనే పదము కలిగినది. అందుచేత పల్కు లో గురువయిన పల్ పైని ఊత గలదన్నప్పుడు, పల్ లో గల రెండు మాత్రలలోను మొదటి మాత్రకే ఆ ఊత చెందునని గ్రహించవలెను. రెండు మాటల కలియక వలన ఏర్పడిన పదములలో ఆ రెండు మాటల మొదటి మాత్రల మీదను ఊత ఉండును. ఉ నలు వది (ఊత గురుసు అక్షరము ముందే కొంచెము పైగా గుర్తింతును). తల గడ, మను గుడు పులు, చిలుత పులి మొ॥. పలుకుదురు — ఈ పదము క్రియారూప మయినచో 'పలు,కుదురు; అనగా ప్రధానమయినది ప మీదను అప్రధానమయినది కు మీదను ఉండును. (ఊత అప్రధానమయి నపుడు అది యున్న అక్షరమునకు దాపలనే క్రిందితట్టు గుర్తింతును). పలుకుదురు అనగా పళ్లయొక్క కుదురు అని అర్థమైనప్పుడు 'పలు 'కుదురు అని రెండు ఊతలు గలదిగా గ్రహించవలెను. పలికినపుడు

ఊతల భేదములవల్లనే ఏది ఏ యర్థములో ప్రయుక్తమయినదో తెలిసి కొనగలము. ఉ। విజయ విలాసములో

క. అర చందమామ నేలిన
దొరగా నెన్నుదురు నెన్నుదురు బిత్తరికిన్
మరువంపు మొల్లమొగ్గల
దొరగాఁ బల్కుదురు పల్కుదురు జవ్వనికిన్।

అను పద్యమందు (దొరగా) ఎన్నుదురు అనేది క్రియారూపము నెన్నుదురు అనేది (నెఱ + నుదురు = విశాలమైన నుదురు) సమాసము. అందుచేత క్రియారూపమయిన 'నెన్నుదురులో ప్రధానమైన ఊత మొదటి వర్ణముమీదనే ఉండును; సమాస మయినప్పుడు నె'న్నుదురులో ప్రధానమైన ఊత 'నుదురులో ను మీదను, అప్రధానమైన ఊత నె మీదను ఉండును. ఆ విధముగానే 'పల్కుదురు క్రియారూపమైనప్పుడు ప్రధానమైన ఊత ప మీద నుండును; పళ్ల వరుస అనే అర్థములో [పల్'కుదురు] – ప్రధానమైన ఊత కు మీదను, అప్రధానమైనది పల్ మీదను ఉండును.

శ్లేష వలన పద్యము మధురముగా నున్నను, రెండు సరి పాదములందును విశ్రమస్థానమందున్న వడి యక్షరము 'దు' ఊత యేమియును లేనిదయినది అందువలన, పద్యము నడకలో కొద్దిగా నయినను సొంపు చెడినదని చెప్పక తప్పదు.

మాటలలో మొదట లఘువుండి పిమ్మట గురువున్న యెడల ఊత ఆ రెండవ వర్ణముమీద ఉండును. ఉ। ఇ'దే, సు'మా, క'దా మొ.

ఇ'దే య'సిన్ మ'దా న్వి'తున్ సు'దే వు'నిన్ వ'ధిం చె'దన్.।
మ'నో'హరుడు, మ'నోహ'రా. మొ

ఈ ఊతల మార్పులు ఒక్కొక్కప్పుడు జనుల వాడుకనుబట్టి కొన్ని పదములలో కలుగుచుండుటవలన పదస్వరూపమే మారిపోవుచుండును. అ'వన్ > అ'వన్డు > (అ) 'వాన్డు > 'వాఁడు; కొ'లంది > 'కొలఁద > 'కొలది > 'కొల్ది > 'కొద్ది; ఎ'ఱుంగు > 'ఎఱుఁగు > 'ఎఱ్గు మొ

నాలుగయిదు అక్షరములు గల పదములలో మొదటి వర్ణము దీర్ఘమైనను, వెంటనే గురువురాని లఘువైనను దానిమీద నుండును; దాని తర్వాత మాత్రల లెక్కలో ఒకటి విడిచి ఒకటిగా గల వర్ణములపై అప్రధానమైన ఊత ఉండును :– 'పలు,కుదురు'గాక (ఇక్కడ గాక మరియొక పదము గనుకను దీర్ఘస్వరము గలది కనుకను ప్రధానమైన ఊత గలదు). 'పలు,కుదురు సు'డీ (=పలికేరు సుడీ) ‹పలు'కుదురు సు'డీ (పళ్లకుదురు సుండీ). 'రెం'డెడ్ల'బండ్లు (=ఎడ్లు లాగే బండ్లు రెండు); 'రెం,డెడ్ల బండి (=రెండెడ్లు లాగే ఒక బండి).

కొన్ని సంధికార్యములు కూడ ఈ ఊతల మార్పుల వల్లనే కలుగుచుండును. పదాంతమందు గల స్వరములలో బలము గలవి, బలము తక్కువయినవి, బలము లేనివి గలవు. అట్టి పదములపై స్వరాదులు గల పదము చేరినపుడు సంధులు ఎట్లు కలుగునో చూడుడు :–

మ'నోహ'రా + 'అనుచు = మనోహరా యనుచు

(సీతా) 'సీత + 'ఎక్కడ = సీత యెక్కడ త మీద ఊత లేకపోయినను తత్సమ పదము కనుక దాని స్వరూపము కాపాడుటకై చేసిన నియమము కాని జనుల ఉచ్చారణములో ఈ ఊతకు ప్రయో

జనమున్నది కనుక సీతెక్కడ అని వాడుకలోనికి వచ్చినది. శ్రీకృష్ణ దేవరాయలే గంగ + అను=గంగను ప్రయోగించెను.

ఇకారమునకు కొలదిగానైనను బలము కలదు కనుక దీనిపై సంధివై కల్పికము.

అచ్చులన్నిటిలో ఉకారము బలమేమియును లేనిది కనుక ఉత్తునకు సంధి నిత్యము. ఈ విధముగా వివరించి చెప్పుటకు ఇక్కడ అవకాశము చాలదు కనుక ఛందోవిషయములలో ఈ ఊత ప్రభావము ఎట్లుండునో తెలియజేయుదును.

త్రికములతో ఏర్పడిన గణములు కేవలము వృత్తపాదములను కొలుచుటకు సౌకర్యమేర్పడునన్న ఉద్దేశముతో ఏర్పడ్డ గణములే కాని పద్య నడకకు అనుగుణముగా లెక్కింపదగినవి కావు. అందుకు దృష్టాంతముగా ఉత్పలమాల చంపకమాల; శార్దూలము మత్తేభము మొదలయిన వృత్తయుగళములను చూపించవచ్చును. ఈ వృత్త యుగళములలో ప్రతి యుగళమందును గల వృత్తములు రెండును ఒక్కరీతిగానే నడచినను త్రికములయిన గణములతో గణవిభజనము చేసినప్పుడు గణముల వరుస అంతయును మారిపోవును. మాత్రా గణములు గల పద్యముల విషయములో ఈ త్రికములవలన ప్రయోజనము లేదు. అందు కనుకూలమయిన గణములను చెప్పుకోవలెను. అవి త్ర్యస్రములు, చతురస్రములు, ఖండగతి గణములు, మిశ్రగతి గణములుగా వేర్కొనవలెను. ఈ గణములతో ఏర్పడిన పద్యము లందలి పదములు ఆ గణవిభజనకు సరిపోయినరీతిని ఊతలు కలవిగా నుండవలెను.

పైని ఉదాహరించిన హాలముఖ యను వృత్తమునకుండు గణములు త్రికములుగా చెప్పుటకంటె మాత్రాగణములచొప్పున చెప్పుట వలన ఆ పద్యము గతి యెట్లుగా మారుచుండునో తెలియజేసినాను.

త్ర్యస్ర గణముల విభజన -

3 3 3 3

UI UI I I IU 'శారి 'ముద్దు 'పలుకు వి'నన్ = 12 మాత్రలు

చతురస్రగతి గణవిభజన —

5 + 3 = 8 4

UIU I I U 'శారి 'పాట,లను విను'మా = 12 మాత్రలు

ఖండగతి గణవిభజన —

5 5 2

U U IIII U 'శారి' పా టలు'వినుట'కున్ = 12 మాత్రలు

(ఇక్క కున్ విశ్రాంతి కలిగించి మఱి మూడు మాత్రల కాలము అనుస్వారము పొడిగించుట కవకాశ మిచ్చును)

మిశ్రగతి గణవిభజన —

3 4 3 2

UI UII II U 'శారి 'పాటలు 'వినుట 'కున్ = 12 'మాత్రలు

(ఇక్కడ కున్ విశ్రాంతి కలిగించి మఱి రెండు మాత్రల కాలము అనుస్వారము పొడిగించుటకు అవకాశ మిచ్చును)

ఖండగతి మత్యతాళముకు విభజన —

UIU II I IU 'న్యాయ'మా 'ప్రియ 'నుడువు'మా = 12 మా॥

ఈ విధముగానే వృషభగతి రగడ పాదమొకటి 28 మాత్రలు కలది మాత్రాగణములతో విభజించి ఎన్నివిధములుగా నడపవచ్చునో చూపించినాను.

(1) మిశ్రగతిలోనిది సుప్రసిద్ధము –

'చెవిని 'బడినది । 'చెలియ 'పలుకని । 'చిలుక 'పలుకుల
'కలరు 'చుండెను (28 మాత్రలు)

(2) చతురస్రగతి –

'చిలుకల 'పలుకులు 'వినబడ'గా...। 'చెలి 'పలు'కని
'భ్రమ 'పడెను గ'దా...। (28 మాత్రలు)

(3) చతురస్రగతి మరియొక వరుసను –

'చిలుకల 'పలుకులు 'వినినం'తన్... । 'చెలి 'ప'ల్కనియే
'భ్రమ 'నొం'దెన్ (28 మాత్రలు)

(4) ఖండగతిని -

'ఒక 'చిలుక 'పలుకు'విని 'తలంచెన్ 'ఒప్పుగా 'చెలిపలుకె
'యనుచున్ (28 మాత్రలు)

(5) ఏగతినిలేక వచనముగా -

'చిలుక 'పలుకులు 'విన్నంత'నే 'చెలియ 'పలికె 'నని
'తలచినది.

నడకనుబట్టి యేర్పడిన గణములలో ఏ గణమును ఊత లేని అక్షరముతో మొదలుపెట్టరు. మొదలుపెట్టినయెడల నడక మారవచ్చును లేదా చెడవచ్చును. ఇదే యసిన్... అనే పద్యములో ఎదురుగా నడిపించు ఉద్దేశ్యమున్నది కనుక అందుకు అనుకూలముగానే ఊత లేని అక్షరముతో ప్రారంభమయినది. సాధారణముగా తెలుగు

వారి చెవులకు ఎదురుగతిని నడచే పద్యములు అంతగా శ్రావ్యములు కావు కనుకనే భుజంగప్రయాతము వంటి పద్యములు తెలుగువారు రచించిన కావ్యములలో ఎక్కడనో కాని తఱచుగా కనబడవు. కన్నడిగులకును IU, IUI, IUU గణములు ఇష్టములు కావు. చూడుడు :-

"Observe that no foot dare begin with on iambus (like remote I U), such a foot being foreign to true Canarese metres" vide Nagavarma's Canarese prosody edited by Rev. F. Kittel. pp. 76 and 98.

ఉపజాతులను గూర్చి ఉపగణములను గూర్చి చెప్పిన ప్రకరణములో ద్విపద, తరువోజ, సీసము, తేటగీతి, ఆటవెలది మొదలయిన పద్యములలో ఈ ఊత ఎట్లుండునో వివరించి చెప్పుదును. ఇక్కడ మనకు ముఖ్యమయిన కందములో ఊత లెక్కడెక్కడ ఉండవలెనో ఎక్కడెక్కడ ఉండరాదో ఎక్కడెక్కడ ఉండినను లేకున్నను నడక చెడకుండ నుండునో తెలియజేసెదను. ఒక గురువు రెండు లఘువులకు – అనగా రెండు మాత్రలకు సమానము. కందపద్యమందు గల మాత్రలు 64. అందులో మొదటి రెండు పాదములు ఒక ఖండము, మిగిలిన రెండు పాదములును మఱియొక ఖండము. ఈ రెండు ఖండములును అన్ని విషయములలోను సమానము కనుక ఏదైనా ఒక ఖండమును పరిశీలించినయెడల చాలును. ఒకొక్క ఖండములో 32 మాత్రలు గలవు. ఈ ఊత విషయము స్పష్టముగా తెలియజేయుటకు ఈ 32 మాత్రలను చూపించుచు ఏ మాత్రమీద ఊత ఉండవలెనో ఏమాత్రమీద ఉండరాదో ఏ మాత్రమీద ఉండినను లేకున్నను నడక చెడదో గుర్తించి, నేను చెప్పినట్లున్నచో చక్కగా నడక ఉండునని

ఒక ఉదాహరణమును, లేనియెడల నడక చెడునని మరొక ఉదాహరణ మును, ఊత ఉన్నను లేకున్నను బాధ లేదని చెప్పునప్పుడు ఊత ఉన్న ఉదాహరణము, ఊత లేని ఉదాహరణము చూపించి రెండును చక్కగా నడుచునని తెలియజేయుదును. అందుకు ముందుగా లాక్షణికులు చెప్పిన అంశములను తెలియజేయవలెను :—

కందములో రెండు ఖండములు. రెండును సమానములు. ఖండములో 3 + 5 = 8 గణము లుండును. ఇందు బేసి గణములు 1, 3, 5, 7 సరి గణములు 2, 4, 6, 8. ఇందులో తుది గణము గుర్వంతము గనుక సగణమో గగమో కావలెను. తక్కిన గణము లలో ఒక్క జగణము విషయములోనే కట్టుదిట్టము లున్నవి — "జగణముండదు బేసిన్" బేసి గణములందు జగణ ముండకూడదు. 6-వ గణమందు విధిగా జగణము గాని నలము గాని ఉండవలెను. తక్కిన 2, 4 గణములలో ఉండినను బాధలేదు. నలము (ఒక్క 8-వ గణములో తప్ప) ఎక్కడనయినను ఉండవచ్చు. ఈ విధముగా నలము భజగణములతో పొత్తు కలియుటకు గల విశిష్టగుణ మేది? 'రాముడు 'రమణుడు - ఈ రెంటను మొదటి మాత్రపైని ఊత గలదు కనుక భగణముతో పొత్తుగలది. జ'యంతి, స'మాన, హి'రణ్య మొద లయిన జగణములందు ఊత రెండవ మాత్రపై ఉండును. ఈ దిగువ కనబఱచిన నలములలో కూడ రెండవ మాత్రపైనే ఊత గలదు :-

4-వ గణం　5-వ　6-వ　7-వ　8-వ గణం

1. కావున　విభజించి 'యదుగ౯ । గౌతుక । మయ్యెన్
2. పాముల । కిరవైన 'యటల　పామరుడు వగన్
3. వ్రతఫల । ముగనీకు 'గలుగు　। భాగ్యము। లెల్లన్

ఇట్టి నలములే జ గ ణ ము న కు మాఱుగా నుండదగినవని గ్రహించవలెను. న'యటుల=న'యట్లు; కు'గలుగు=కు'గల్గు. ఇట్టి నలములను నేను జగణతుల్య నలము లందును.

భగణముతో పొత్తుగల నలములు - ('ఐనను) 'అయినను; ('చిల్కలు) 'చిలుకలు మొదలయినవి, ఇందు మొదటి మాత్రపైనే ఊఁత. కనుక జగణ ముండలెను లేదా నలమైనను ఉండవలెను అని విధించిన 6-వ గణమందు ఉండగల నలము జగణతుల్యమైన నలమే కావలెను గాని భగణతుల్యమైన నలము కాకూడదు. జగణముండదు బేసిన్ అని చెప్పిన బేసి గణములందు భగణతుల్యములయిన నలములే కాని జగణతుల్యములయిన నలములు ఉండగూడదు. ఇందుకు విరుద్ధముగా నలములను వాడినయెడల కంద పద్యము నడక చెడిపోవును :—

1 2 3 4 5 6

1. పరధన ములకా శ'పడక పరనా రీసో 'దరుడయి
   7 8
   పరులకు హితుడై ।

2. వినఁగా దగున ట్టి'నుడులు వినసొంపు గలుగు 'పలుకులు
   వినబడు నంతన్ ।

3. నీవే పలికిం చు'ఘనుఁడ వీవెగ ద'పలుకు 'చతురుఁడ
   వీవే నాకున్ ।

4. నిను ధ్యానించెద ను'మదిని నినునే ను'గొలుతు 'నిరతము
   నిన్నే దలఁతున్ ।

3-వ గణమందు జగణ ముండరాదు అని లక్షణము చెప్పినది. జగణ తుల్యమయిన నలము కూడ ఉండరాదని నే నంటిని. జగణ తుల్యములయిన నలము లున్నవి కనుక పద్యము నడక చెడినది. శ'పడక, ట్టి'నుడులు, చు'ఘనుఁడ, ను'మదిని ఉండకూడదు.

5-వ గణమునందును జగణ ముండగూడదు గదా? ఇక్కడ జగణ తుల్యమయిన నలము కూడ ఉండగూడదు అని నే నంటిని; ఉన్నది కనుక నడక చెడినది; పు'గలుగు, ద'పలుకు, ను'గొలుతు ఉండఁగూడదు. పు'గలుగు=పు'గల్గు ద'పలుకు= ద'పల్కు; ను'గొలుతు=ను'గొల్తు.

6-వ గణమున జగణమునకు మాఱుగా జగణతుల్యమయిన నలమే ఉండవలెను కాని భగణ సగణ తుల్యమైన నలముండగూడదు. ఉన్నది గనుక నడక చెడినది: ,దరు'డయి, 'పలుకులు. 'చతురుఁడ, 'నిరతము.

పై నుదాహరించిన పద్యపాదములే సవరించి చూపెదను. గణము లుండవలసిన ట్లుండుటచేత పద్యము నడక సరిగా నున్నది. చూడుడు :-

1. పరనారీ సో,దరుఁ'డయి, పరధన, ముల'కా శ'పడక
   పరులకు హితుఁడై ।
2. విన సొంపుగలుగు 'పలుకులు, వినఁగాఁ, దగు'న ట్టి'నుడులు
   వినబడు నంతన్ ।
3. నీవెకద పలుకు 'చతురుఁడ. నీవే పలికిం చు'ఘనుఁడ
   వీవే నాకున్ ।
4. నినునే నుగొలుతు 'నిరతము, నిను ధ్యానించెద ను'మదిని
   నిన్నే తలఁతున్ ।

7-వ గణము కూడ జేసి గణము కనుక ఇక్కడను జగణ ముండ రాదు కనుక జగణతుల్యమయిన నలము కూడ ఉండరాదు.

1. కవి యెఱుఁగును గవి కష్టము ।
   కవి యొక్కఁడు కృతిని జేయఁ-గఁ 'గవికి తెలియున్॥

నడక చెడినది.

2. అట యిట తిరుగుచు వనమున ।
   నిటలాక్షుని సాంబమూర్తి-ని 'విమల భక్తిన్

నడక చెడినది.

ఇవి ఉండవలసినట్లు సవరించిన నడక సరిగా నుండును :-

1. కవి యెఱుఁగును గవికష్టము ।
   కవి యొక్కఁడు కృతిని జేయఁ 'గవికిన్ దెలియున్॥
2. అట యిట తిరుగుచు వనమున ।
   నిటలాక్షుని సాంబమూర్తి 'నిరుపమ భక్తిన్

నాల్గవ గణము (అనగా సరి పాదమునందలి మొదటి గణము) నందు జగణ ముండవచ్చు నన్నట్లు లక్షణము చెప్పుచున్నది. కాని, జగణ మున్నను, జగణతుల్యమయిన నల మున్నను నడక చెడిపోవుటయో మాఱిపోవుటయో కలుగక తప్పదు. చూడుడు :-

1. సుతు లనములు వేవురు దమ
   యుతులై యుదయించి సాంఖ్య-యోగాఖ్యానో
   న్నతిఁ జేసి ముక్తులయి భూ
   రి'తేజు లందఱును నూర్ధ్వ-రేతసు లయినన్॥

2. దివిజాధిప నీ కెఱుఁగిం
ప'వలసె నీయాజ్ఞ నాకు - బడయఁగవలసెన్॥

3. కురుకుల విభుఁడగు ధర్మ
స్థిరమతియగు నీతఁ డనుచు - ధృతిఁజేసి యుధి
ష్ఠిరుఁడను నామము దా ను
చ్చ'రించె నాకాశవాణి - జనవినుతముగాన్॥

4. అనిలజు పుట్టిన దివసము
న 'నచట దుర్యోధనుండు - నరనుత ధృతరా
ష్ట్రునకున్ గాంధారికి న
గ్ర'నంద నుఁడు ఘనుఁడు పుట్టెఁ - గలియంశమునన్॥

5. పరమ ద్విజ శుశ్రూషా
పరులయి శూద్రాదు లవని బరిగిరి ధర్మ
స్థిరమతులయి ధర్మజు ధ
ర్మ'రాజ్య మభివృద్ధిఁ బొందె - మహిమాస్పదమై

6. సుర గరుడ విషోరగ య
క్ష 'రాక్షస పిశాచ భూత గంధర్వులు సో
పరు ధిక్కరింపరు బ్రాహ్మణ
పు'రస్కృతులఁ బుణ్యవతుల - భూతల పతులన్॥

7. ... ... ...
ము'కుందుఁడు భయాతిరేక-మునఁ బదిమారుల్॥

8. ... ... ...
పి'తా'మహుఁడ నెవ్వరిడు - పేర్కొన నీకున్॥

ఇందులో 7, 8 లో ముకుందుఁడు, పితామహుఁడనే పదము లందు మొదటియక్షరములు పదాద్యక్షరములు కనుక కొద్దిగానైనను బలము గలవి. అందుచే నడక ఎక్కువ చెడలేదు; మాటిన దనవలెను. తక్కినవానిలో తొలి యక్షరము ఒక మాటలోని తుది వర్ణము గనుక ఊత ఏమియును లేనిది. కనుక నడక నెడినది. చెడలేదన్నవా రైనను సహజమైన నడకకు భిన్నముగా నున్నదని యైనను ఒప్పుకొనక తప్పదు. ఈ స్థలమున జగణ ముండుట కొంచెము కిష్టము కనుకనే చపలార్య రెండు ఖండములందును, ముఖచపలార్య మొదటి ఖండ మందును ఈ నాల్గవ గణమందు జగణము విధిగా నున్నది.

అంతే కాదు ఈ నాల్గవ గణమందు జగణమో జగణతుల్యమైన నలమో ఉంచి కందము నడకకు భిన్నమైనా గ్రాహ్యమైన గతిలో కంద పద్యములను నడపింపగలమా యని ప్రయత్నించి చూడఁగా ఈ దిగువ నుదాహరించినవి స్ఫురించినవి :—

1. వనజాస్య నీదు మొగమే ల 'నాకుఁ గనుపింప కిట్టు

లాతిగఁ దోచున్ ।

వనజారి యిట్టు లలరఁ గ పు'నపుడు వనజంబులెల్ల

ముకిళించుఁ గదా॥

2. పవతులకుఁ కెలిమి, మునులకును 'వలపు శిలలకును రసము

నుండునె ధరణిన్ ।

కవివరుల మాట దినకరుని 'వెలుఁగు పైరులకు వాన

'నిష్ఫల మగు నే॥

ఇందులో కందపద్య లక్షణము లాక్షణికులు చెప్పినట్లే ఉన్నది. గణములు యతి ప్రాస నియమములు అన్నియును గలవు. కాని కందము నడక లేదు. అయినను ఇందులో అందమయిన నడక మఱి యొకటి లేకపోలేదు.

కొందఱు కవులు మఱియొక యందము గల నడకను సరి పాదములు నడపినారు. అందులో త్ర్యస్రగతి గణములు అమరి యున్నవి :—

1 — నడలి కరుణ నాద మెసగ - నాక్రందించెన్॥
2 — మగువ పొలుపు దెలుపు నొక్క - మారుత మొలసెన్
3 — సన్నగిలుట కౌఁగిలింత - సడలున్ నేర్పుల్ ।
4 — యన్నుకొనుచు నాము దిన్న-యట్లే రాగా॥
5 — శీతకిరణ కడుపు చొచ్చి - జీర్ణింపని యీ ।
6 — ఇంతి జలకమాడి జిలుగు-లిడి తడి యొత్తెన్-।
7 — గట్టి మనసు రాలుసేసి - కరగవు మఱి నీ-।
8 — అనిల తనయు సింహనాద - మదరెం బెలుచన్॥
9 — వనిత సెలవి వార నవ్వి - వానికి ననియెన్॥
10 — అంపినగరు సొచ్చి వెలఁదు - లారతు లిడఁగా॥

ఇందులో 'మగువ పొలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్' చాల చక్కగా నున్నదని అనేకులు మెచ్చుకొందురు. నిజమే ఆ

మారుతము యొక్క గతిని తెలియజేయునట్లుగా ఉన్నది. భావము నకు తగిన నడక పొసగినది. తక్కినవానిలో ఈ సొంపు కనబడదు. ఏదైనా కందమునకు సుప్రసిద్ధముగా నున్న నడక మారినదని చెప్పక తప్పదు. ఆ సుప్రసిద్ధమయిన నడక ఎట్లుండునో అందఱును ఎఱుగుదురు. అయినను జ్ఞప్తికి తెచ్చుటకు మంచి పద్యముల నుదాహరింతును :-

కందమందలి ఖండములో తుదిగణము గుర్వంతము కనుక పద్యమంతయును లఘువులతో నడపదలచినను 31 అక్షరములకంటె ఎక్కువగుటకు వీలులేదు. గురువులతో నడపదలచినను జగణ మొకటి 6 వ గణముగా నుండవలెను. కనుక 17 అక్షరములకంటె తక్కువగుటకు వీలులేదు. చూడుండి :

1. కరిదిగంచు మకరి సరసికి, గరిదరికిని మకరి దిగుచుఁ -
గరకరి బెరయన్

2. రామా మేఘశ్యామా, నీ మోముం జూపకున్న -
నే నెట్లుందున్

నడక చెడుటకు అవకాశము గురువులున్న పద్యముతో కలుగదు; లఘువు లున్న దానితోనే కలుగును. కనుక లఘువులు గలదే సంఖ్యలతో విస్తరించి ఊత లెక్కడెక్కడ ఉండునో [*] చుక్క గుర్తు పెట్టియును, ఎక్కడెక్కడ ఉండరాదో [ × ] కత్తెర గుర్తు పెట్టియుచు, ఎక్కడెక్కడ ఉండినను ఉండకున్నను నడక చెడదో అక్కడ ప్రశ్నార్థకపు [?] గుర్తు పెట్టియును తెలియజేయుదును.

1 2 3 4 5 6 7 8 9 10 11 12
* × ? × ? ? ? × * × ? ×

13 14 15 16 17 18 19 20 21 22
* × ? × ? × * × × *

23 24 25 26 27 28 29 30 31 + 32
× × * × ? × * × *

* × * × * × * × * × * ×
అ డి 'గె ర । వ ని 'క డు । వ డి 'జ ను ।
1 2 3 4 5 6 7 8 9 10 11 12

* × × × * × * × × * × × * × * ×
చ డి గి న । ద ను 'మ గు । డ 'వ డు గ । డ ని 'వ డ
13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28

* × *
యు డు 'గు న్
29 30 31, 32

* × * × × * × × * × × ×
'క రిఁ 'ది గు చు 'మ క రి 'స ర సి కిఁ
1 2 3 4 5 6 7 8 9 10 11 12

* × * × × × * × × * × ×<br>
'గ రి 'ద రి కి ని 'మ క రిం ది గు చుం<br>
13 14 15 16 17 18 19 20 21 22 23 24

* × * × * × *<br>
'గ ర క రి 'బె ర య న్<br>
25 26 27 28 29 30 31, 32

* × × * × × * × × × * ×<br>
'గ రి కి 'మ క రి 'మ క రి కిం 'గ రి<br>
1 2 3 4 5 6 7 8 9 10 11 12

* × * × × × * × × * × ×<br>
'భ ర 'మ ను చు ను 'వ త ల 'కు త ల<br>
13 14 15 16 17 18 19 20 21 22 23 24

* × * × × × *<br>
భ టు 'ల రు దు ప 'డ న్<br>
25 26 27 28 29 30 31, 32

మాత్రల వరుస :—

* 1. పద్యమునకు ఇదే మొదటి అక్షరము కనుక ఇది విధిగానే ఊత గలదై ఉండును. కాని 33 వ వర్ణము రెండవ ఖండములో మొదటిదైనా పూర్వపదాంత వర్ణమయితే ఊత లేకపోవచ్చును. అప్పుడు నడక చెడుతుంది.

నిగనిగని...చొ।

క్కు 'గదురఁ జేయు జగత్పతి (రెండవ ఖండ ప్రారంభము; అనగా పద్యమందలి 3 వ పాదము)

× 2. ఇది ఊత ఉండరాని స్థలము. మొదటి అక్షరము గురువు అయితే ఊత లేని ఈ రెండవ మాత్ర దానితో కలిసిపోవును. విడి లఘువయి ఊత లేనిదయిన యెడల నడక చక్కగా నుండును. ఉ॥ 'నిగ 'నిగని; ఊత ఉన్నచో నడవదు. ఉ చొ।క్కు 'గదుర.

? 3. ఊత ఉన్నా లేకపోయినా బాధలేదు; చక్కగానే నడచును. చీమలు పెట్టిన పుట్టలు (చీ రెండు మాత్రలు కనుక మ మూడవది) ఊత లేదు.

బహు 'విధముల బహు ముఖముల...ఊత ఉన్నది.

× 4. ఊత ఉంటే నడవదు.

అనిన 'నతఁడు ప్రవరుని కనియె...

5. యాచన 'కవినుత వినుతా...ఊత ఉన్నది

శ్రీవిష్ణుని వలన ,, లేదు

? 6. యాచన కవి నుత ,, లేదు

(శ్రీ)విభుని 'వలన... ,, ఉన్నది

? 7. నా పాలిటి 'పెనుభూతము ,, ఉన్నది

(శ్రీ)విభుని వలన ,, లేదు

అన్నీ చక్కగానే నడచును.

× 8. ఊత ఉంటే నడవదు.

గడగడ పాప 'భయమునను . . ఊత ఉన్నది నడక చెడినది

గడగడ పాప భయంబున . . ఊత లేదు నడక బాగున్నది

* 9. గడగడ పాప భయమునను . . ఊత లేదు నడక చెడినది

గడగడ పాప భ'యంబున . . ఊత ఉన్నది నడక బాగున్నది

Secondary accent ఉన్నా బాగుండును :-

కనకపు సింహా,సనమున . .

× 10. పరధనముల కాశ 'పడక . . ఊత ఉన్నది నడక చెడినది

పరధనముల కాశింపక . . ఊత లేదు నడక బాగున్నది

? 11. అడిగెద నని కడు వడి 'జను . . ఊత ఉన్నది

చీమలు పెట్టిన పుట్టలు . . ఊత లేదు

ఏదైనా చక్కగా నడచును.

× మునులార మీర లిపుడు 'న ఊత ఉన్నది కనక నడవదు॰
ను నీగతిఁ బడుచు దనంబును . .
మునులార మీర లిప్పుడు ఊత లేదు నడక బాగున్నది.

నను నీ గతి బడుచుదనమునం . .

* 13. ఊత ఉండవలెననియే నా యభిప్రాయము. జగణ ముండ
వచ్చు నన్నవారికి ఇక్కడ ఊత లేకపోయినను బాధ
లేదు. చూ. పై నిచ్చిన ఉదాహరణములు.

× 14. మీద చెప్పినదానినిబట్టి ఉండును.

? 15. దురిత విదూరులు విరోధి దుర్దమ బలులుం...లేదు

కర'మరుదుగ నాకుఁ జెప్పెఁ గైకొని యేమున్...ఉన్నది
ఏదైనా నడచును.

× 16. సరిపాదములు త్ర్యస్ర గతి లో నడపించినప్పు డుండును.
చూడు పైనిచ్చిన ఉదాహరణములు.

? 17. కరమరుదుగ నాకుఁ జెప్పె...లేదు

అడిగినఁ 'దను మగుడ ...ఉన్నది
ఏదైనా నడచును.

× 18. తొలి నీవు 'పలుకు విధమున...ఉన్నది నడక చెడినది.

తొలి పల్కిన యట్టు లామె దూషిత యయ్యెన్

ఊత లేదు నడక బాగున్నది.

* 19. తొలి నీవు పలుకు విధమున...లేదు. నడక చెడినది.

తొలి పల్కిన 'యట్టు' లామె ఉన్నది నడక బాగున్నది.

× 20. భూమీ సురుఁ డరిగెఁ చుహీన భూధరశృంథ ।

ఊత లేదు నడక బాగున్నది.

అనినిను దూరి'కొను చుందు...ఊత ఉన్నది నడక చెడినది

× 21. ఆ పని యెట్లగు 'దెలియగ నానతి యిమ్మా

ఊత ఉన్నది నడక చెడినది.

ఆ పని యెట్లగునో తెలియ నానతి యిమ్మా

ఊత లేదు నడక బాగున్నది.

* 22. ఇది జగణమో నలమో—అనగా జగణతుల్యమయిన నలమో ఉండవలసిన చోటు అందు రెండవ మాత్ర ఊత తప్పకుండ ఉండవలెను.

ఆ పని యెట్లగునో 'తెలియ నానతి యిమ్మా

ఊత ఉన్నది నడక బాగున్నది.

ఆ పని యెట్లగుఁ దెలియగ నానతి యిమ్మా

ఊత లేదు నడక చెడినది.

× 23. నిటలాక్షుని మొగమును 'గన నివ్వెర చెందెన్

ఊత ఉన్నది నడక చెడినది.

నిటలాక్షుని మొగము గనగ నివ్వెర చెందెన్

ఊత లేదు నడక బాగున్నది.

× 24. ఊత ఏమీ ఉండరాని స్థలము (6వ గణములో చివర మాత్ర వడికి పూర్వమున నిలిచినది)

నను జూడఁగ వచ్చితే 'వనజదళనయనా

ఊత ఉన్నది నడక చెడినది.

నిను జూడగ వచ్చియుంటి నీరజనయనా

ఊత లేదు నడక బాగున్నది.

* 25. యతి స్థలము ఊత ఉండవలెను.

తడవాయెను పోయి వచ్చె-దను సెలవిమ్మా

ఊత లేదు నడక చెడినది.

తడవాయెను పోయివత్తు - 'తరుణీ సెలవా ?

ఊత ఉన్నది నడక బాగున్నది.

× 26. ఊత ఉండగూడదనుటకు పైనున్న ఉదాహరణములే చాలు.

? 27. బలిసెం బుట్టములు నరుచి - బడలిక లూర్పుల్ ఊత లేదు.

అడుగులు ధరనూఁది చిందు - నల 'బలములకున్ ,, ఉన్నది

ఏదైనా నడచును.

× 28. ఊత ఏమీ ఉండగూడని స్థలం.

కంటెను బావంబు లొండు కలవె 'నృపులకున్

వ్రత వశమున వచ్చి మా పురంబు 'తెరువుగా

ఊత ఉన్నది నడక చెడినది.

* 29. ఊత ఉంటేనే నడక బాగుండగలదు :-
వనజేక్షణ యిట్లు వలుక వరుసయె ? 'ప్రతులై
లేకున్న నడక చెడును చూ. 28. ఉదా॥

× 30. ఊత ఉండగూడని స్థలం , ఊత ఉంటువట్లు రచించుట
అసంభవము. దాని వెంటనే గురువు గల అక్షరముండును
గనుక

* 31/32 కలిసి గురువు.

కందపద్యము చక్కగా రచించినవారు ఇవన్నియు ముందుగా చూచుకొని రచించినారా ? అని అందురేమో ? నడక చక్కగా మనసున పట్టించుకొన్నవారు కనుకనే వారు రచించిన పద్యములు శ్రావ్యములుగా నున్నవి. కనుకనే ఆ పద్యముల రచన పరిశీలించి ఊతలు ఎట్లు నిలుపుటవలన అవి శ్రావ్యములుగా ఉన్నవో ఇంత వివరించి చెప్పితిని. ఎంత దొడ్డవాడయినను ఒకొక్కప్పుడు ఏ కారణముచేత నయినను అతని రచనలో నడక చెడినప్పుడు ఎందుకు చెడినదో చూపించినాము.



# నాల్గవ ప్రకరణము

## తెలుగులో పద్యరచనా ప్రారంభము

### ఉపజాతుల లక్షణము

ఏ దేశమందైనను ఏ భాషలోనైనను పద్యరచనకు పూర్వము చాలా కాలము గేయరచనయే యుండెనని చెప్పగలము. సవరలు మొదలయిన ఆదివాసులకు ఇంకను పద్యరచన అలవడలేదు. గేయ రచనా దశలోనే ఉన్నారు. వేదకాలమందలి మంత్రములు కొంత గేయ లక్షణము కొంత పద్య లక్షణము గలవి. ఈ మంత్రకర్తలకు పూర్వులయిన ఆర్యులు కేవలము గేయరచనలనే చేసియుందు రన వచ్చును. వేద ఋక్కులందు అక్షరసంఖ్యా నియమమే కాని గురు లఘువుల వరుస పాదములన్నిటను వృత్తములలో నున్నట్లు ఒక్క తీరున ఉండదు.

గేయమునకును పద్యమునకును భేద మేమి? గేయము చదివి చూచినను, పద్యము పాడిచూచినను ఈ రెంటికిని గల భేదము బోధ పడగలదు. ఈ గేయమును చదివి చూడుడు :-

" రాజేంద్ర ! వినుము విరాజితమగు గజరాజ
మోక్షణ కథను ।
మహా సుధను రహిత మనోవ్యధను ।
రాజిల్లు భువి సుధారాశి త్రికూటాద్రి
యోజనాయుత మున్నతత్వంబు వి

భ్రాజితంబుగ కాంచనంబున రాజితంబుగ యోమయంబున
రాజిలంగెడి శృంగములు మూఁడతుల
మణిధాతువుల వెలుంగును॥

పాడినప్పుడు గల శ్రావ్యత చదివినప్పుడు ఎట్లు కలుగగలదు? దీనిని ఆనందభైరవి రాగము-ఆటతాళములో చక్కగా పాడుకొందురు. ఇక నీపద్యమును పాడుటకు—అనగా ఏదో ఒక రాగములో లయతో సంబంధము లేకుండా పాడుట కాదు; రాగము తాళము పాటించి పాడుటకు ప్రయత్నించి చూడుడు :-

" సంబుద్ధి యెడలించి సప్త విభక్తులు
పలికిన భక్తి సద్దళి యనంగ ।
సంబుద్ధితోఁ గూడ సప్త విభక్తులు
పలుక నొప్పారు బద్దళి యనంగ ।
సంబుద్ధితోడ విషమ విభక్తులతోడఁ
బలికిన కృతియు విద్దళి యనంగ ।
గళిక లుత్కళికలు గమనింపఁ బలికిన
కావ్యంబు నుత్ఫుల్లకంబు ననఁగ ।
నవనిఁ జాటు ప్రబంధంబులందు మిగుల
వాటుకొని యొప్పుచుండు నీనాల్గు దెగలుఁ ।
గానఁబడు నుదాహరణముల్ గానలోల
కామెపల్లీశ వల్లవీకామ కృష్ణ। " (అప్పకవీయము)

(ఉదాహరణ రచనలు నాల్గు తెగలని చెప్పిన పద్యము)

ఇది ఏ రాగములోనైనను పాడగలము గాని పాటవలె తాళము పాటించి పాడగలమా?

అక్షరజ్ఞానము గలిగి వ్రాయుటయు చదువుటయు అలవడు వఱకును పాటలే ఉండును గాని పద్యము లుండవు. ఆ పాటలు అనుశ్రుతముగా వచ్చియుండును. కొన్ని కట్టుదిట్టములతో వల్లె వేయుటవలన వేదమంత్రములు నిల్చియున్నవి. కాని దేశీయ గేయము లట్లు నిల్చియుండగలవా? అందుచేత తెలుగులో పద్య రచన పుట్టక మునుపు గేయము లెట్లుండెనో మనమేమి చెప్పగలము? అయినను అవి యుండెనని చెప్పుట కాధారము కలదు.

దేశి రచనలను గూర్చి భరతుని నాట్య శాస్త్రములోను మతంగుని బృహద్దేశిలోను పార్శ్వదేవుని సంగీత రత్నాకరములోను కొన్ని శ్లోకము లున్నవి :-

దేశికార ప్రబంధోఽయం హార వక్త్రాభి నిర్గతః
అసంఖ్యా కాస్తు కథితాః నజ్ఞాయంతేఽల్పబుద్ధిభిః॥

× × ×

ఏలా నాదవతీ రమ్యా వర్ణాలంకార శోభితా
గీయతే మట్టతాలేన నాదయుక్తా పదేపదే॥

× + ×

లఘుభిర్గమకైర్యుక్తా రాగో మాళవకైశికీ
ఏలా సద్భావతీ నామ ప్రతి తాలేన గీయతే।

× + ×

ఏలా భద్రావతీ నామ శూద్రజాతి సముద్భవా।

× × ×

ఏలా యాంధేంకి కాయాం చస్యాదన్తే నియమాదిహా

ఈ రచనలనుబట్టి ఏలా మొదలయిన దేశి గేయము లసంఖ్యేయ ములుగా ఉండెనని తెలియుచున్నది. అయితే అందులో ఆ కాలమందలి తెలుగువారి గేయముల పరిశీలనము జరిగిదో లేదో ఏమి చెప్పగలము ?

క్రీ. శ. 12 – 13-వ శతాబ్దము పాల్కురికి సోమనాథుడు రచించిన పండితారాధ్య చరిత్ర—నాదప్రకరణమందు :-

“ పదములుఁ దుమ్మెద పదముల్ ప్రభాత
పదములుఁ బర్వత పదము లానంద
పదములు శంకర పదముల్ నివాళి
పదములు వాతేశు పదములు గొబ్బి
పదములు వెన్నెల పదములు సంజ
వర్ణన మఱి గణవర్ణన పదము
లర్ణవ ఘోషణ ఘూర్ణిలుచుండఁ
బాడుచు నాడుచుఁ బరమ హర్షమునఁ
గూడి సద్భక్త సంకుల మేఁగుచేర ”

× + +

అని పెక్కురీతుల పదములను పేర్కొన్నాడు. ఇవే కాక, ఇంకను పెక్కురీతుల పదములున్నవి. కాని ఎట్టి ఛందోరీతుల నవి రచితములో మనము చెప్పలేముగదా ? ప్రభాత పదములు మేలుకొలుపు పాటలు కావచ్చును. వెన్నెల పదములు చందమామ పాటలు కావచ్చును. నివాళి పదములు మంగళహారతులు కావచ్చును. కాని, ఈ పాటలు నన్నయకు పూర్వము ఎట్లుండెనో తెలిసికొనుటకు

ఆధారము లేదు. అర్వాచీన కాలమందలి పాటలనుబట్టి తెలిసికో దగిన దేమనగా పాల్కురికి సోమనాధుని కాలమున ఉండిన పాటల వంటివి పూర్వకాలమందును ఉండవచ్చును. తుమ్మెద మొ॥ పాటలు నేటికిని జానపద గేయాలలో వినబడును :—

ఉ॥ శ్రీ గిరి డను పువ్వు - తుమ్మెదా - మూడు
లోకమ్ము లాయెనే - తుమ్మెదా -
సాకారమైయుండు - తుమ్మెదా - పర
మేకాంతమున జూడు - తుమ్మెదా.

ఏల- కానరానీ యడవిలోన
వానలేనీ మడుగు నిండె
వానలేనీ మడుగుమీదా నో - యేగంటి లింగా
మానరానీ అగ్ని పొడమేరా ।

ఆనంద గీతము—ఆనందమానంద మాయెనూ మన శ్రీ
రామూలు పెండ్లికొడు కాయెనూ.

ఇటువంటి కొన్ని పూర్వకాలమున నుండి యుండును.

కొంత సంస్కృతి వృద్ధిపొందిన తర్వాత పాడుకొనుటకే కాక చదువుకొనుటకును తగినట్టి రచనలు గావించు ప్రయత్నముల ఫలితముగా పద్యము లేర్పడినవని ఊహించవచ్చును. సంస్కృత ములో వృత్తరచన ప్రారంభించినట్లే దక్షిణదేశ భాషలలో మొదట తమిళ భాషలో క్రీస్తుశకము అరంభించిననాటికే పద్యరచన జరిగినది. ఆ పిమ్మట కన్నడమందును మఱి కొంతకాలమునకు తెలుగు భాష లోను పద్యరచన జరిగినట్లు శాసనములవలన దెలియుచున్నది.

నన్నయకు పూర్వ ముండిన ఛందోరీతులలో —

(1) అద్దంకి శాసనమునందలి తరువోజ (క్రీ. శ. 848-9 నాటిది) -

పట్టంబు గట్టిన ప్రథమంబు నేణ్డు - బలగర్వ మొప్పంగ
బైరేచి సేన

పట్టంబు గట్టిఞ్చి ప్రభు బణ్డరంగుఁ - బఞ్చిన సామంత
పడువతో బోయ

కొట్టముల్ పణ్ద్రెండు గొని వేంగి నాణ్టి - గొఱచి యా
త్రిభువనాంకుశమాన నిల్పి

కట్టెపు దుర్గంపు గడు బయల్ సేసి - కందుకూర్ బెజవాడ
గావిఞ్చి మెచ్చి॥

(2) యుద్ధమల్ల శాసనమునందలి మధ్యాక్కరలు (క్రీ శ.898)-

స్వస్తి నృపాంకు శాత్యస్తవత్సల సత్య త్రిణేత్ర
విస్తర శ్రీయుద్ధమల్లుఁ డనవద్య విఖ్యాత కీర్తి।
ప్రస్తుత రాజాశ్రయుణ్డు త్రిభువనా భరణుణ్డు సకల
వస్తుసమేతుణ్డు రాజ సల్కి భూవల్లభుణ్డ కీర్తి॥

× × ×

(3) కందుకూరు గ్రామమున క్రీ. శ. 9-వ శతాబ్దము నాటిది గుణగ విజయాదిత్యుని కాలమునకు చెందిన సీసపద్యము- (శిథిలమైనది)

శ్రీ నిరవద్యుండు...సిత్త—మాతృక శిల లభ్యముకాదు.

(4) దీర్ఘాసి శాసనము (క్రీ. శ. 1075) సీసపద్యము—

శ్రీ శకునేందులు భూసతిపై...

ఈ పద్యములవలన నన్నయనాటికి రెండు శతాబ్దములయి దేశి కవిత యుండెనని తెలినది. నన్నెచోడ కవిరాజు తన కుమారసంభవము (1-23)లో

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్ర విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

నన్నెచోడని పద్యమునుబట్టియు, కందుకూరు గ్రామమందలి సీసపద్యమును బట్టియు దేశి కవితను చాళుక్యరాజు పుట్టించెనని అనుకొనుచుండగా శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు చోడరాజునకు దక్కవలసిన కీర్తి చాళుక్యరాజునకు దక్కినదని క్రీ. శ. 6-వ శతాబ్దమునాటి మాలెపాడు శాసనములో తెలుగులో ద్వీరదగతి రగడ గలదని-

'అణపోతులు రేవణకాలు పుద్దణకాలు

ఇచ్చిన పన్నస పెఱ్వాఱు ఇఱె రేనికిన్'

ఉదాహరించినారు. (చూ. పరిశోధన-జయ-ఉగాది సం.)

శ్రీ రెడ్డిగారు రెండు పంక్తులు మాత్రమే ద్విరదగతి రగడగా చూపించినారు. పద్యమంతయును ఈ రగడలోనే ఉన్నది అని శ్రీ వేకుమళ్ల కామేశ్వరరావుగారు పద్యమంతా కనబఱచినారు :- (చూ. పరిశోధన—జయ శరత్తు).

ఇంకను ఎన్ని శాసనములు దేశి కవిత కలవి దొరుకునో!

నన్నయ, నన్నెచోడడు సంస్కృత మార్గమందలి ఛందములను వాడినను దేశి కవితయందలి తరువోజ (ద్విపదలు రెండు చేరి అక్షరమైత్రితో ప్రాసములున్ను గలిగి నాలుగు పాదములతో వృత్తమువలె కనబడు) పద్యములను, సీసములను, ఆటవెలదులను, తేటగీతులను రచించినారు. కనుక ముందుగా ద్విపద, ఆటవెలది, తేటగీతి, సీసము అను నీ ఉపజాతి పద్యముల పరస్పర సంబంధము లను కనబఱచెదను. దానికి ముందుగా ఈ ఉపజాతులందు గల గణము లెట్లుండునో చెప్పవలసియున్నది. అక్కరలు మొదలయిన మఱి కొన్ని పద్యములందును ఈ గణములే ఉండును కనుక ఈ గణముల విషయము ముందుగా తెలిసికొనుట మంచిది.

సంస్కృతమందు గాని ప్రాకృతమందు గాని ద్రావిడభాష లందు గాని గురు లఘు భేదములవలననే గణములు ఏర్పడును. కాని గణముల కూర్పులో భేద మున్నది. వృత్తములు అక్షరసంఖ్యా నిబద్ధములు కనుకను అందు గల పాదములు సమానాక్షరసంఖ్య గలవి

కనుకను అందలి గణములను త్రికములుగా పేర్కొన్నారు. మాత్రా గణ నిబద్ధములయిన ప్రాకృత చ్ఛందములందు ఏ యే పాదములను ఎన్నెన్ని మాత్ర లుండవలెనో తెలియజేసినారు. అట్టి మాత్రాగణ నిబద్ధములయిన తెలుగు పద్యములలో కొన్నిట మాత్రల సంఖ్యను తెలియజేయుచు, లయగ్రాహి మొదలయిన పద్యములు మాత్రా సంఖ్య నిబద్ధములే అయినను వృత్తములకు చెప్పినట్లే త్రికములయిన గణములనే పేర్కొనుచు లాక్షణికులు లక్షణ పద్యములను కూర్చినారు. సీసములు మొదలయిన పద్యముల గణములను తెలియజేయుటకు సూర్య, ఇంద్ర, చంద్ర గణములను పేర్కొనిరి. కాని ఆ గణముల పేర్లు మాత్రము త్రికములలోని మ గణాది గణముల పేర్లతోనే పేర్కొన్నారు. మగణమును, యగణ జగణ లగములు ఎదురు నడక గలవి కమక ఆ గణములను విడిచినారు.

ఈ సూర్య, ఇంద్ర, చంద్ర గణములనే కన్నడిగులు బ్రహ్మ, విష్ణు, రుద్ర గణము లన్నారు. ఈ గణముల ప్రస్తారము రెండు గురువులతోను, మూడు గురువులతోను, నాలుగు గురువులతోను సాగినది. సూర్యాది తెలుగు గణములకును, బ్రహ్మాది కన్నడ గణములకును ఈ ప్రస్తారము ఒక రీతిగానే సాగినది కాని, అందుండి ఏర్పడిన గణములను ఎన్నుకొనుటలో తేడా కలదు చూడుడు :—

# తెలుగులోని–సూర్యేంద్ర చంద్రగణ ప్రస్తారము

**సూర్య**

| | |
|---|---|
| U | U |
| I | U |

→

| | | మాత్రలు |
|---|---|---|
| U I | హగణము | 3 |
| †I I I | నగణము | 3 |

2 గణములు

**ఇంద్ర**

| | | |
|---|---|---|
| U | U | U |
| I | U | U |

→

| | | మాత్రలు |
|---|---|---|
| U I U | రగణము | 5 |
| †I I I U | నగము | 5 |
| U U I | తగణము | 5 |
| †I I U I | సలము | 5 |
| U I I | భగణము | 4 |
| †I I I I | నలము | 4 |

6 గణములు

**చంద్ర గణములు**

| | | | |
|---|---|---|---|
| U | U | U | U |
| I | U | U | U |

→ ఇవి తొలగించ వలసిన గణములు

| | | మాత్రలు |
|---|---|---|
| U I U U | రగము | 7 |
| †I I I I U | నగగము | 7 |
| U U I U | తగము | 7 |
| †I I U I U | సవము | 7 |
| U I I U | భగము | 6 |
| †I I I I U | సవము | 6 |
| U U U I | నులము | 7 |
| †I I U U I | సహము | 7 |
| U I U I | రలము | 6 |
| †I I I U I | నహము | 7 |

లఘువులు మొదటనున్న గణములకు ఆ తొలి లఘువునకు పూర్వము ఒక లఘువు చేర్చవలెను.

అట్లు చేర్చిన లఘువులను ఎడమప్రక్క † పెట్టి చూపించినాను. ప్రక్కను ఆ గణముల పేర్లు సూచించినాను. ఏ యే గణములలో ఎన్నెన్ని మాత్రలు గలవో ఆ పేర్ల ప్రక్కనే గుర్తించినాను.

```
  U U I I  తలము   6
†I I U I I  సలము   6
  U I I I  భలము   5
†I I I I I  నలలము  5
---------
14 గణములు
```

## కన్నడమందలి బ్రహ్మ విష్ణు రుద్ర గణముల ప్రస్తారము

```
బ్రహ్మ        విష్ణు          రుద్ర గణములు

  U U         U U U          U U U U
†I I U      †I I U U       †I I U U U      †I I U U I
  U I         U I U          U I U U         U I U I
†I I I      †I I I U       †I I I U U      †I I I U I
---------     U U I          U U I U         U U I I
4 గణములు    †I I U I       †I I U I U      †I I U I I
              U I I          U I I U         U I I I
            †I I I I       †I I I I U      †I I I I I
            ---------        U U U I       ---------
            8 గణములు                      16 గణములు
```

తమిళములో గల గణములు :-

I తేమా గణములు – గగ గల
UU UI =2 గణములు
పుళిమా గణములు– య జ స న
IUU IUI IIU III =4 ,, } వెరసి 6

ఈ గణములనుండి య జ గణములను తీసివేసినయెడల కన్నడ బ్రహ్మ గణములు (4). ఆ గణముతోపాటు గగము సగణము కూడా తీసివేసినయెడల మన సూర్య గణములు (2).

II కరువిళమ్ – నల నగ జల జగ
IIII IIIU IUII IUIU = 4 గణములు
కూవిళమ్ - భ ర
UII UIU = 2 ,,
తేమాంగయ్ - మ త
UUU UUI = 2 ,,
పుళిమాంగాయ్ - సగ సల యగ యల
IIUU IIUI IUUU IUUI = 4 ,, } వెరసి 12

ఈ గణములనుండి జల జగ యల యగ గణములను తొలగించినయెడల కన్నడ విష్ణు గణములు (8); వీన్నితోపాటు సగము గణము కూడ తొలగించినయెడల మన ఇంద్ర గణములు (6).

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| III కురువిళంగాయ్ | – | నవ | నలల | జలగ | జలల | జగగ | 8 |
| | | IIIIU | IIIII | IUIIU | IUIII | IUIUU | |
| | | | | జగల | నగగ | నగల | |
| | | | | IUIUI | IIIUU | IIIUI | |
| కూవిళంగాయ్ | – | జగ | భల | రగ | రల | | 4 |
| | | UIIU | UIII | UIUU | UIUI | | |
| తేమాంగణి | – | తగ | తల | | | | 2 |
| | | UUIU | UUII | | | | |
| పుళిమాంగణి | – | సలగ | సలల | యలగ | యలల | | 4 |
| | | IIUIU | IIUII | IUUIU | IUUII | | |
| తేమాతణ్బు | – | మగ | మల | | | | 2 |
| | | UUUU | UUUI | | | | |
| పుళిమాతణ్బు | – | యగగ | యగల | సగగ | సగల | | |
| | | IUUUU | IUUUI | IIUUU | IIUUI | | |

వెరసి 24

ఇందులో జలగ, జలల, జగగ, జగల, యలని, యలల, యగగ, యగల అను నీ యెనిమిది గణములను తీసివేసినయెడల మిగిలిన 16ను కన్నడ రుద్రగణములు ఇంకా మేటి రెండు - మగ, సగగ తీసివేసినయెడల మన చంద్రగణములు 14-లఘువు తర్వాత వెంటనే గురువు గల IUI, IUU, IUII,

IUIU, IUUI, IUUU, IUIIU, IUIII, IUIUU, IUIUI, IUUIU, IUUI, IUUUU, IUUUI గణములు కన్నడిగలకును తెలుగువారికిని గ్రాహ్య ములు కావు. సూర్య గణములు 3 మాత్రలు గలవిగాను, ఇంద్ర గణములు 4. 5 మాత్రలు గలవిగాను చంద్ర గణములు 6, 7 మాత్రలు గలవి గాను నియమించుకొనుటవలన స,గగ, గణములు సూర్య గణములలోను, సగ, మ గణములు ఇంద్ర గణములలోను; మగ, సగగములు చంద్ర గణములలోను ఉంచుకొనలేదు.

ఈ గణములు గల ద్విపద, తరువోజ, సీసము, తేటగీతి, ఆటవెలది ఎట్టి పరస్పర సంబంధము గలవో ముందుగా తెలియ జేసెదను :-

ద్విపద - గోపికా వల్లభా - గోవింద నిన్ను
గోపాల మాధవా - గురుదేవ కొలుతు

ఈ రెండు పాదములను ఒక పాదముగా కూర్చిన తరువోజ పాదము.

— గోపికా వల్లభా - గోవింద నిన్ను - గోపాల మాధవా -
గురుదేవ కొలుతు

ఇందు గల పదములే స్థానములు మార్చి కూర్చిన సీసపాద మగును.

— గోపికా వల్లభా - గోవింద మాధవా - గోపాల గురుదేవ -
కొలుతు నిన్ను

సీసమునకును ద్విపదకు ఇంత పొత్తు కలదు కనుకనే స్త్రీల పాటలలో సీసమందలి పాదములలోని మొదటి అందమును ద్విపద

పాదమును చేర్చిన కూర్పు తఱచుగా కనబడుచుండును :- (ఇంద్ర గణములతో భల నలల ములు కూడ నుండును).

శ్రీరామచంద్రునకు సీతపై గల ప్రేమ
శ్రీరామచంద్రుపై సీతకును గలదు॥
పాపమ్మ చరితంబు భక్తితో వింటేను
స్త్రీలు శుభవతులగుచు మేలునొందుదురు ।

ఇక సీసమునకును ఆటవెలదికిని గల పొత్తు చూడుడు :—

గ్రుడ్డివయితి వీవు కుంటిదానను నేను
నగరి కెట్లు మనము నడవగలము ?
నడవగలను నేను నా మూపుపై కెక్కు
తిన్ననయిన బాట తెలియజెప్పు
దిక్కులేని నరుని దేవుడే రక్షించు
తెలియజేయు బ్రదుకుతెరువు మనకు
రమ్ము పోదమింక రాజమార్గమునందు
భయము లేదు మనకు పగటివేళ.

ఇవి స్పష్టముగా కనబడు ఆటవెలదులు. ఇవి సీసమందలి పెద్ద పాదములు కూడ నగును. మరియొక ఆటవెలది ఎత్తుగీతిగా చేర్చ వచ్చును. నన్నయకు మఱికొందఱకు సీసములలో ఆటవెలదులను చేర్చుటే ఎక్కువ ఇష్టమయినది.

కాని, ఈ పాదములు ఆటవెలదులకు నిండు కొలుపునట్లు సీసములకు కొలువవు. కొన్ని గణములందు ఊతలు మొదటి మాత్ర

యందు లేక ఊత ఉండరాని రెండవ మాత్రపై పడుటచే నడక కొంపు సీసముగా చదువునప్పుడు సడలుచుండును. చదువువారు ఈ విషయము పాటింపరు కనుక చక్కగానే నడచును.

సీసమునకును తేటగీతికిని కూడ పొత్తు గలదు కాని సీసముతో ఆటవెలది కలసినంత ఇంపుగా తేటగీతి కలియదు. ఇంద్రగణములందు ఖల నలలములు చేర్చుకొనుచుండవలెను :-

సీ. చెలియ ! కం।టివె ? నీవు । సిరులొలుకు । సుమబాల ।
భాగ్యవం।తుండైన । భర్త । బడయు

తే. గీ. చెలియ ! । కంటివె ? । నీవు 'సి।రు'లొలు।కు 'సుమ ।
బాల । భాగ్యవం।తుండైన । భర్త । బడయు॥

ఊతలు తే. గీ. మొదటి పాదములో చివరనున్న మూడు గణములందును బడినవి. అయినను గణములు, వడి (అక్షరమైత్రి గాని, ప్రాస యతి గాని) అన్నీ ఉన్నవి; తే. గీ. కాదనలేము. సీసముతో పొత్తు కలియుటలో ఆ. వె. కిని, తే. గీ. కిని ఈ వ్యత్యాసము కలదు కనుకనే నన్నయ మొదలయినవారు సీసములందు తఱచుగా ఆటవెలదులనే చేర్చుకొనిరి.

తేటగీతికిని ఆటవెలదికిని కూడ పొత్తు లేక పోలేదు :-

ఆ. వె. అఖిల । సుకవి । కృతుల । యందు న।లరుచుండు
తే. గీ. అఖిల । సుకవి కృ।తులయందు । నలరు।చుండు॥

ఆ. వె. విజయ । పాండ।వులకు । వినుము 'జ।యమ'గును
తే. గీ. విజయ । పాండవు।లకు విను।ము 'జయ।మగును॥

తేటగీతికిని ద్విపదకును కూడ పొత్తు గలదు.

తే. గీ. కాల।చంద్రుని । బద్ధ భా।వం బె।ఱింగి
 ద్వి. కాల చం।ద్రుని బద్ధ । భావం బె।ఱింగి

ఇట్టివి పల్నాటి వీరచరిత్రలోను పాల్కురికి సోమనాథుని ద్విపదలలోను కలవు:-

తే. గీ. వడి జూప।ప్రీతి । సేవన । యోర।సంగ
 ద్వి. వడి జుప । ప్రీతి సే।వన యోర।సంగ

ద్విపదులలో నడవని పాదములు ద్విపద కావ్యములందు నా కెక్కడను కనబడలేదు. అందులో పాల్కురికి సోమనాథుని ద్విపద లందు శ్రావ్యత, రచనలో జిగిబిగి ధారాశుద్ధి మొదలయిన సుగుణము లను వివరించి చూపినవారు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు, పరిశోధన సంపుటి 2, సంచికలు 3, 4 లో వారు రచించిన "సోమన సృష్టించిన ఛందస్సు" అను వ్యాసము చదువదగినది. వారన్నట్లు ద్విపద దేశి యగు ఛందమే కాని సంస్కృత ప్రాకృత పద్యరచనకు చెందినది కాదు.

ఇక ప్రాసములు చరణములందు గల గీతులును గలవు:- (చూ. అప్పకవీయము)

పవడ గీతి:-

> అవని । ముగురు । భాను । లాదిత్య।వతు లిద్ద
> అవల । నేగు । రర్కు । లర్థ।మునకుఁ
> బవడ । గీతి । యందుఁ । బ్రాసముల్ । సమకూఱు
> నవియె । యాట।వెలది । యందు । లేవు॥

కమలని గీతి :-

> హగణ । మైనఁ । జాలు । నగణ॥ మైనఁ । జాలు । హగణ ।
> నగణ।ములును । రెండు గలిసి॥ నాటి । యంఘ్రి । కేడు ।
> తగిన । విరతి । నాలు।గింటఁ॥ దనరఁ । బ్రాస । మొదవి
> మిగుల । మెఱయు।చుండుఁ । గృతులఁ॥ గమల।నాఖ్య । గీతి॥
> (యతి భంగం)

విషమ గీతులందు ఎత్తుగీతి :-

> సురనాథు మీఁద - సూర్యు లిరువురు రెంట విరతి
> ధరణిఁ బ్రాసంబు - దనరు హరి యెత్తుగీతి యందు॥

ఇంద్ర గణములలో 4, 5 మాత్రల గణము లున్నవి. సీసము లకు గాని పైని పేర్కొన్న గీతాదులకు గాని 5 మాత్రల ఇంద్రగణ ములు నిండుగాను శ్రావ్యములుగాను ఉండును, చూడుడు :-

> మందార మకరంద మాధుర్యమును గ్రోలు
> మధుపంబు వోవునే మదనములకు ? (భాగవతము)

సర్వ లఘు సీసమందలి ఇంద్రగణములు అయిదు మాత్రలు గలవి ఉన్నప్పుడే అవి చక్కగా నడచును :-

> మృగమదము తిలకమును నగుమొగము చెలువమును
> నలఁతి పవడముఁ దెగడు నధరపుటము ।

లయహారి వృత్తము కూడ చక్కగా అయిదేసి లఘువులతో నడచును.

నాలుగేసి మాత్రలు గల ఇంద్రగణములతో నడచిన సీస పద్యము అంత శ్రావ్యముగా నుండదు.

సరసత నెఱుగక సవతులు సతతము । నోరిమి చూపక

పోరుచుంద్రు

లోకములో ఆయా దేశ పద్యములు ఎట్లు నడచుచున్నవో పరిశీలించి లాతణికు లా నడకనుబట్టియే అందుగల గణములను వివరించినారు కనుక ప్రతి గణమందును మొదటి మాత్ర ఊత గలదే యగుచుండును. ఆ ఊత ప్రధానమయిన ఊత కావచ్చును లేదా అప్రధానమైన ( Secondary ) దైనను కావచ్చును. ఊతలు తిన్నగా పాటింపక రచితములయిన పద్యపాదములు చక్కగా నడవవు :-

ముషిణి పండును మోదుగు పువ్వును'బలె— ఇదే పువ్వు'వలెనె అని ఉన్నయెడల నడక చెడదు.

కీ. శే. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు తమ నాటకముల లోని పద్యముల నడక ఉద్దేశపూర్వకముగా చెడగొట్టినారు. నాటకము లాడునప్పుడు పద్యములు చదువవలెనే కాని రాగాలు పెంచి రాగభావమునకు అనుకూలముగా చేతులు త్రిప్పుటవలన అర్థభావము సాహిత్య రసభావము చెడిపోవునని వారి అభిప్రాయము. ఇది నిజమే కాని పద్యముల నడక చెడగొట్టి రచింపవలసిన అవశ్యకత లేదు. Blank verse వంటిది కావలెనన్న ఉద్దేశముతో వారాపనికి పూనుకొనిరి. Blank verse లో rhyme ఉండదు కాని నడక చెడదు. యతి ప్రాసములు లేకుంటే Blank verse అగును. అవి ఉంచి ఊతలు (accents) పాటింపక పద్యములు కూర్చినయెడల వారి ఉద్దేశము నెరవేరదు. అంతకంటె చక్కని నడక గల గద్య (rhythmic prose) - తాళబద్ధమయిన గద్య- మేలు. వారి పద్యముల రచన ఎట్లుండునో చూడుడు :—

తే. గీ. 'ఖంజెకును 'సుందరత 'గేదె - 'కొడలి 'శుభ్ర
త 'మునిఁడికిఁ 'దీపి 'కపికిఁ 'జిత్త 'స్థిరత 'వె
లుతురునకు 'బర్వు 'కవికిఁ 'గణములు 'గులట
కును, గృ'తజ్ఞత 'యాకాశ - 'కుసుమ'మటులు॥

కన్నడిగులు సీసాదులలో పుష్టిగా అయిదు మాత్రల గణములనే ఉంచుకొందురు. వారి ఛందోరీతిని అనుసరించి మన తెలుగు లాక్షణికులు ఒక రీతి పద్యమును చేర్చుకొని దానికి "కర్ణాట చతుష్పద" అను పేరు పెట్టిరి :-

మొగిఁ బంచ లఘు గణంబులు మూఁడు రవియుఁ
దగు తుదం బ్రాసంబు - దాఁక రెంటివయి
నగు విశ్రమమ్ము కర్ణాట చౌపద యె
సఁగుఁ గృతుల సత్కవుల - సమ్మతముతోడ॥ (అప్పకవి)

త్ర్యస్ర, చతురస్ర, ఖండగతి గణములను గలుపుకొనుచు పెక్కు రీతుల పద్యములు ఎన్నెన్నో రచించుటకు అవకాశము గలదు. రసజ్ఞులయిన కవులు నేడిక్కడ సూచించిన పద్యములకంటె ఎక్కువ శ్రావ్యములయినవి రచింపగలరని నా నమ్మకము :-

1. తెలివిమాలిన మిడుత - దీపంబునన్ జచ్చు
తెలివిమాలిన చేప - వలలోనఁ జిక్కు
జ్ఞానసంపద గలిగి - మానవుం డయ్యయో
మోహవల్లులఁ జిక్కి మోసపోవు.

2. సౌందర్య సార సముదాయమున కామె - పదవమేతై
యుండు కాకయున్న

లాలిత్య నిధికి నధిదేవతయొ! కాక యా । మాలతీకాంత
సామాన్యురాలె ?

8. మీరు నాతోడ నేను మీతోడ - మిత్రత్వమునఁ గూడి
కలసి మెలసి
యున్నచో మనకు మేలగును గాక - ఒరులవలనఁ గీడు
మన కేల కలుగు ?

## సీస పద్యములు

సీసములను గూర్చి ప్రత్యేకించి చెప్పదగిన అంశములు పెక్కు లున్నవి. సీసపద్య రచన నన్నయకు పూర్వమే ప్రారంభించినట్లు శాసనములందలి సీసపద్యముల వలన తెలియగలదు. నన్నయ రచించిన సీసములను అనంతుడు అప్పకవి మొదలయిన లాక్షణికులు చెప్పిన విషయములను చూడగా సీసములు–అందు సామాన్య లక్షణము ఒక్కటే అయినను – అనేక విధములుగా గనబడుచున్నవి. కాని ఈ సీస భేదములను గూర్చి లాక్షణికు లందఱును ఒకే విధముగా చెప్పలేదు. అందఱిలోను ఎక్కువ భేదములను పేర్కొని లక్ష్యలక్షణ పద్యములను కూర్చి చెప్పినవాడు అనంతుడు. అతడు పది భేదములను చెప్పెను :–

1. సమ సీసము–సామాన్య సీసము; విశిష్ట లక్షణ మేమియును లేదు.

ఇంద్రులు । తమలోన -। నిద్ద ఱిద్దఱుఁ గూడి
యతులకు । నాధార।-మై తనర్చు
'మూఁడు చోఁ।టుల నుండ । - మొగి నిద్ద ఱర్కులు
గదియ నా।క్రియ నొక్క। - పదము మెఱయ

నిటువంటి । పదములిం। - పెనఁగంగ । నాల్గింట
సమధర్మ । గతి నతి। - శయము । నొందు
నట్టి ధార్మమునకు। - నాస్పదం।బై పేర్చి
యాతత । చ్ఛందో వి। - భాతిఁ దనరి

ఆ. వె. ఆట।వెలఁది।యొండె। - దేటగీ।తియు నొండె
విమల । భావ । మమర। -విష్ణు।దేవుఁ
డొప్పు । ననుచుఁ । బొసఁగఁ। - జెప్పిన।సీసంబు
పసిఁడి।యగు ధరిత్రిఁ । పద్మ।నాభ।

2. వృత్తప్రాస సీసము – పెద్ద పాదముల నాల్గింట మాత్రమే వృత్త పాదముల కున్నట్టి ప్రాస ముండవలెను. ప్రతి పాదమందును వడి నియమమున్నది. పాదాద్యక్షరముతోనే తక్కిన మూడుచోట్లను మైత్రి ఎత్తుగీతి కి నియమము లేదు.

— శ్రీ । శ్రిత । వత్సుండు । - సింధుర । వరదుండు॥ చింతిత
ఫల దాన-శీలుఁ । డితఁడు
ఆశ్రితా।వనలోలుఁ। - డాభీర । కాంతా కు॥చాగ్ర కుం।కుమ
భూషి।-తాంగుఁ । డితఁడు
ఆక్రాంత । జయ ధాముఁ। - డాశాంత।విశ్రాంత ॥ యశుఁడు
ధా।రాధర।-శ్యాముఁ । డితఁడు
విశ్రుత । విభవుండు। - విమల బ।లాఢ్యుండు ॥ వికసిత।వదనార।
-విందుఁ । డితఁడు

గీ అనుచు | మునులును | దివిజులు | నభినుతింపఁ| జూపు |
చెవుల పా।న్పున వెన్ను।-మోపి|యుండు

నంబు|జోదరు|డంచు ని|ట్లాంధ్ర |- కృతులఁ| జెప్పి|రేని
వృ|త్తప్రాస |-సీస | మగును॥

3. సమప్రాస సీసము - నాలుగు పెద్ద పాదములందే కాక ఎత్తుగీతి బేసి పాదములందును ఒకే ప్రాసాక్షర ముండవలెను. అన్నిచోట్లను వడి పాటించవలెను. అనగా ఎత్తుగీతి రెండు పెద్ద పాదములవలె (1 + 2; 3 + 4) కనబఱచినయెడల 6 పాదములు కనబడునుగదా? ఆ ఆరు పాదములందును వృత్తములకున్నట్లు ప్రాసాక్షరములును, సర్వత్ర వడి సీసములో నుండునట్లు వడియును పాటింపవలెను.

.— భామినిచే నున్న - పట్టు తోరముఁ జూచి |- ప్రల్లదంబునఁ
ద్రెంచి - పాఱవైచి
యాదుని ద్రోహ మం-త్యంతమై తనుఁబట్టి |-యతి దరిద్రుని
జేయ - నార్తిఁ బొంది
భూమి వెల్వడిపోయి - పురపురఁ బొక్కుచుఁ |- బుండరీకాక్ష
యో-భువన వంద్య
స్వామి నా యపరాధ - శత సహస్రంబులు|-సైరింపవే
కృపా-జలధి యనుచు

గీ. ప్రేముడించు కౌండిన్యుని - భీతిఁ బాపి|-పృథుల సౌఖ్యంబు
లొసఁగి గాం-భీర్య మమరఁ
బాముపైఁ బవ్వళించిన - ప్రభుఁడ వనిన|-ప్రాస సీసంబు
విలసిల్లుఁ - బద్మనాభ॥

4. అక్కిలి ప్రాస సీసము- పెద్ద పాదముల రెండు ఖండములందును ఎత్తుగీతి నాలుగు పాదములందును 12 చోట్ల వృత్తముల కుండు ప్రాసాక్షరము కనబడవలెను. సర్వత్ర అక్కిలి వడి సీసములో నుండునట్లు వడి పాటింపవలెను.

— ఉరగతల్పుని గాని - యుల్లంబులో నిల్పి । శరధితల్పుని గాని - సన్నుతింప
మురసంహారుని గాని - మ్రొక్కులఁ గయిసేయ । నర మృగేం ద్రులఁ గాని - నమ్మి కొలువ
గరుడవాహను పేరు - గాని పీనులఁ జొన్పఁ । బురుషోత్తముని గాని - పూజ సేయ
హరిప్రసాదముఁ గాని - యర్థిమైఁ గొననోల్లఁ । బరమాత్ము పనిఁ గాని - భక్తిఁబూన

గీ. ధరణి నివి నాదు నిత్య వ-ర్తనము లనుచుఁ । బరఁగు ప్రతిఁ గాని నీవు చే-పట్టవనిన
జరుగు నక్కిలి ప్రాస సీ-సంబు కృతులఁ । బరభృతాతసి పుష్పాభ - పద్మనాభ॥

5. సర్వతఃప్రాస సీసము — అన్నిచోట్లను అనగా 24 యతిస్థలము లందును ఒకే అక్షరమయిన ప్రాస ముండవలెను. అక్షర మైత్రి ఉండనక్కరలేదు.

— నీరద వర్ణుండు - నీరేరుహాక్షుండు । నీరధి బంధనో-దార బలుఁడు

కారుణ్యరస రాశి - గౌరీ రసజ్ఞాని । హారిశోభితనామ -
గౌరవుండు

ధీరుండు త్రిభువనా-ధారుండు దశరథ । త్సారమహేంద్ర
కు-మార వరుఁడు

మారీచ దమనుండు - నారాచ విద్యావి।శారదుం డసుర
వి-దారణుఁడు

ధారుణీసుత నయన చ-కోర సరసి।జారి యన సర్వతః
ప్రాస-చారు సీస

మారయఁగ సత్క-విజన వి-స్ఫార నుతులఁ। దేరు శ్రీ పద్మనాభ
శృం-గార సార॥

6. అవకలి ప్రాస సీసము - సర్వత్ర అనగా 24 యతి స్థలములందును ప్రాస నియమమే కాని ఏ ఖండమున కా ఖండమందే ప్రాసాక్షరము. అక్షరమైత్రి ఉండనక్కరలేదు.

— వరదుఁ డుద్యద్గుణా-కరుఁడు వియన్నదీ।పాదుఁడు భక్తి
ప్ర-మోదకరుఁడు

సింధు బంధనుఁ డబ్జ-బంధు తారాధీశ । నేత్రుఁడు కాశ్యప -
గోత్రజుండు

సుగ్రీవ విభుఁడు ద-శగ్రీవ తమనుండు । లలిత కంబుగ్రీవ -
విలసితుండు

పూతనా జీవిత - నూతన స్తన్యపా।నాకి లోలుఁడు నిత్య -
శోభనుండు

భువన వంద్యుఁ డనుచు - నవకలి ప్రాస సీసముల నిన్ను
బొగడు - నమరసమితి
శరణ భరణ నిపుణ - వరయోగి విమల హృత్పద్మ సద్మ
దేవ - పద్మనాభ॥

7. అక్కలి వడి సీసము - అన్నిచోట్లను వడి - అనగా అక్షరమైత్రి నియమము గలది. కాని ఏ ఖండమున కా ఖండమే చూచుకొనవలెను.

— పద్మాక్షి యాతడే - బలి రసాతలమేలు।మని పంపనేర్చిన - యధిక బలుఁడు
హరిణాక్షి యాతఁడే - యల విభీషణు లంకఁ । బట్టంబు కట్టిన - బల్లిదుండు
తొయ్యలి యాతఁడే - ధ్రువుని నున్నతపదం।బునఁ బ్రతిష్ఠించిన - భూరి యశుఁడు
ధవళాక్షి యాతఁడే - ధనువు ద్రుంచిన యట్టి । రఘువంశ తిలకుండు - రాఘవుండు

గీ. బాణ బాహావిఖండన - ప్రముఖుడితఁడు । నీలగళసుస్తికర బాణ - నిపుణుఁ డితఁడు
ననుచు నక్కలి వడి సీస - మమర వేల్పుఁ । బడఁతు లభినుతింతురు నిన్ను - పద్మనాభ॥

8. వడి సీసము - అన్నిచోట్లను అక్షరమైత్రి వడి నియమము. అందును ఎత్తుగీతితో కలిపి 6 పాదములందును పాదాది నున్న అక్షరముతోనే ఆ పాదమందలి అక్షరమైత్రు లుండవలెను.

— కరుణా సముద్రుండు - గజరాజ వరదుండు । గర్వితాసుర
శిరః - ఖండనుండు
విహగేంద్ర వాహుండు - విభుదేంద్ర వంద్యుండు । విశ్వరక్షా
చణ - వీక్షనుండు
రతిరాజ జనకుండు - రఘువంశ తిలకుండు । రణబలో
దగ్రుండు - రమ్యగుణుఁడు
గోకులాధీశుండు - గోపికా రమణుండు । గోవిందుఁ డురుకళా-
కోవిదుండు

గీ. అనుచు వడి సీసముల నిన్ను - నభినుతింతు । రఖిల విద్యా
విశారదు - లైన మునులు
పన్నగాధీశతల్ప నా - పాలి వేల్ప । భక్తజనకామ్య లాభ
శ్రీ । పద్మనాభ॥

9. విషమ సీసము - సీసమందలి పెద్ద పాదముల నాల్గింటికి మాఱుగా ఉత్సాహ 4 పాదములున్ను వానిక్రింద ఎత్తు గీతి - తేటగీతి గాని ఆటవెలది గాని చేర్చినయెడల అది విషమ సీస మగును.

10. సర్వలఘు సీసము - సీస పెద్దపాదము లన్నియును లఘువులతోనే ఉండవలెను. ఇందుండవలసిన ఆఱు ఇంద్రగణములును ఐదేసి లఘువులును తుది నుండు రెండు సూర్యగణము లును నగణములుగాను ఉండవలెను. అనగా ప్రతి పాద మందును $(6 \times 5 + 2 \times 3 = 36)$ ముప్పది యాఱు లఘువులు కనబడును. ఎత్తుగీతి లఘువులతో నుండనక్కర లేదు. ఏదైనను సరియే.

ఈ పది విధములయిన సీసములలోను-సమ సీసము, సర్వతః ప్రాస సీసము, (సమ) ప్రాస సీసము, అవకలి ప్రాస సీసము, విషమ సీసము, సర్వలఘు సీసము - ఈ ఏడును అప్పకవీయములో ఉన్నవి. కాని పేళ్లలో కొద్దిగా భేదమున్నది. అనంతుని సమప్రాస సీసమునకు అప్పకవి చెప్పిన వృత్తప్రాస సీసమునకు సరిపోవును — దీనికే పూర్వ ముద్రములందు అక్కలి ప్రాస సీసమను పేరు ఉండెను. అనంతుని అవకలి ప్రాస సీసమునకు అప్పకవి చెప్పిన అవకలి వడి సీసము సరిపోవును. "ఆది నేవడి నిల్పిరావడే పదమెల్లఁ జేయ నయ్యాది వడి సీసమగును" అని అప్పకవి, "మును గైకొన్న యతి పాదమం దెల్ల వదలిన వడి సీస మనఁగఁ బరఁగు" అని అనంతుడు చెప్పినట్లే చెప్పి అందుకు లక్ష్యముగా ఇచ్చిన పద్యములో ఆ లక్షణము పాటించ లేదు. కనుక అప్పకవి చెప్పిన వడి సీసము అనంతుని అక్కలి వడి సీసమునకు సరిపోవును కాని అనంతుని వడి సీసమునకు సరిపోదు.

అప్పకవి సీసభేదములను ఏడింటిని (అనగా సమ, సర్వతః ప్రాస-అక్కలి ప్రాస, వృత్తప్రాస, వడి, అవకలివడి, విషమ, సర్వ లఘు సీసములు) పేర్కొని—

" సప్త విధము లివియు శబ్ద శాసనుండు
పంచ మామ్నాయ ఫక్కిలోఁ బల్కఁగాని
కడమ నవులాయు సీసముల్ విడిచిపెట్టి
చెలఁగి సమ సీసపద్యమే చెప్పినారు॥ "

అని వ్రాసెను. కాని ఇది సత్యము కాదు. పోతనామాత్యుడు తన భాగవతములో అన్ని చోట్లను వడి నియమము (అక్షరమైత్రి) గల

సీసములను ఎక్కువగా చెప్పెను. భాగవతము-ఏకాదశ స్కంధమున 72-వ పద్యము సర్వలఘుసీసములో లాక్షణికులు చెప్పినట్లు ఇంద్రగణ ములకు మారుగా 5 లఘువుల గణము లున్నవి. ఈ సీస లక్షణము తెలియక పోవుటచేత, ఆనంద 1904 ముద్రిత ప్రతిలో పుట అడుగున "ఈ సీసము లక్షణ సమన్వయము కాక యున్నది" అని గ్రంథసంపా దకులు తెలియ జేసినారు. కూచిమంచి తిమ్మకవి మొదలయిన కవులు కొందఱు ఈ లాక్షణికులు చెప్పిన సర్వ లఘుసీసములను రచించి నారు. గణపవరపు వేంకటకవి మాత్రము తన ప్రబంధములో సలము లయిన ఇంద్ర గణములతోనే సీసములు రచించెను (చూ. 75,231 పద్యములు).

నన్నయ 13 విధములయిన సీసములను చెప్పినాడు. అందులో అక్కిలివడి ఆవకలి ప్రాస వృత్తప్రాస సీసములు మాత్రము లాక్షణి కులు చెప్పినవి కలవు. అందును వృత్తప్రాస సీసములని చెప్పవలసినవి రెండే ఉన్నవి (అది పర్వమందలి రెండవ ఆశ్వాసమున 21-వ పద్యము మూడవ ఆశ్వాసమున 27-వ పద్యము). ఈ రెండును అనంతుడు చెప్పిన వృత్తప్రాస లక్షణము గలవే కాని అందులో రెండవ దాని యందు(III. 27) ఒకే ప్రాసాక్షరము సీసపాదముల నాల్గింటను, ప్రతి పాదమందును నాలుగు చోట్లను అనగా 16 చోట్ల కలదు. మొదటి దానియందు (II 21), ఒకే ప్రాసాక్షరము సీసపాదముల నాల్గింటను-ప్రతి పాదమందును (ఖండమున కొకటి చొప్పున) రెండు చోట్ల—నాల్గు పాదములందును 4 × 2=8 చోట్ల కలదు. ఎత్తు గీతిలో ప్రాసాక్షరములు భిన్నముగా ఉండుటచేత అప్పకవి చెప్పిన వృత్త ప్రాసమునకు భిన్నముగా నున్నవి. అనంతుని వృత్త ప్రాసమునకు

పరిపోవు చున్నవి. కాని, అనంతుడు చెప్పని విశేష నియమములు కూడా ఇందు కలవు.

II. 21 —

— అంత దేవహితు-లమృతము గానక । యెంతయు నలిగి బ-లీంద్రుఁ గూడి

మంతనంబుండి యమర్త్యుల తోడి పొ। త్తింతయ చాలు నిం కేల యనుచు

సంతన కట్టి యు-త్సాహ సమేతు లై । యంతంబు లేని రథా శ్వములను

దంతుల సమిత ప-దాతుల నొడగూర్చి । యంతకా కారులై యార్చి యమర ।

8 చోట్ల [ంత] ప్రాస పాదములలో ఖండద్వయములందును వడి [అక్షర మైత్రి] ఖండములందును కలవు.

ఆ. వె. వరులఁ దాఁకి యేసి । రురుతర శర పఙ్క్తి ॥ జాతవాతరయవి ధూత మగుచుఁ

జెదరఁ జలద పం క్తి - చెదర వజ్రాయుధు । హృదయ మువిల కొనఁగఁ ద్రిదశగణము ॥

భిన్నాక్షరముల ప్రాస - యతి

III. 27-

— పలుకుల ముద్దును - గలికి క్రాల్గన్నుల । తెలివును వలుద చ-న్నుల బెడంగు

నలఘు కాంచీపద - స్థలముల యొప్పును । లలితావ నేందు మం-డలము రుచియు

నకుశిలనీటిల కుం - తలములకాంతియు । నెల జవ్వనంబుఁ -
విలసనమును

నలస భావంబున - బొలుపును మెలుపును । గలుగు నగ్గిరికన్ -
తలచిఁ తలఁచి

16 చోట్ల (-ల) ప్రాస అదే ప్రాస యతి

ఆ. వె. ముదిత యందు దనదు - హృదయంబు నిలుపుటఁ
జేసి రాగమడర - భాసురముగ
రమణ తోవ నాంత - రమున రేతస్స్యంద
మయ్యె నవని పతికి - నెయ్య మొనర ॥

భిన్నాక్షర ప్రాసయతి

అక్కిలి ప్రాస, సమప్రాస, అవలి ప్రాస అక్కిలి వడి, వడి, విషమ అని అనంతుడు చెప్పిన సీసభేదములు కవిజనాశ్రయములోను, కావ్యాలంకారచూడామణిలోను ఉన్నవి. కాని, అక్కిలి ప్రాస సీసము సరిగా అనంతడు చెప్పినరీతిగా లేదు. ఎనిమిదిచోట్ల సనఁగా సీసమందలి నాలుగు పెద్ద పాదములలో పూర్వ ఖండములందును, గీతి నాలుగు పాదములందును ప్రాసాక్షరము ఒక్కటిగా ఉండిన జాలును. సీసము పెద్ద పాదములందలి ఉత్తరఖండములందు ఈ నియమము లేదు. లక్షణ గ్రంథములలో ఇట్టి అంశములు భిన్నములుగా ఉన్నను లాక్షణికులు అందఱును ఏవో సీస భేదములను పేర్కొనిరన్న విష యమే ఇక్కడ మనము గుర్తించవలసినది.

లాక్షణికులు పేర్కొన్న విషమ సీసమును నన్నయ మాత్రమే కాదు, ఇతర కవు లెవ్వరును తమ కావ్యములందు రచించినట్లు కన బడదు. సర్వ లఘు సీసమును తక్కిన కవులు కొందరు రచించినారు కాని నన్నయ రచించినట్లు కనబడదు. అందుచేత అప్పకవి చెప్పిన రెండు విషయములలో ఏదియు సత్యము కాదు. తాను చెప్పిన ఏడు విధములయిన సీసములును నన్నయ భారతములో రచించెను అనునది పూర్తిగా సత్యము కాదు. కడమ కవులు తక్కిన నాలు విధ ముల సీసములను విడిచిపెట్టి ఒక్క సమ సీసపద్యమే రచించినారన్న దియు సత్యము కాదు. నన్నయ రచించిన సీసము లన్నియును వెరసి 251. అవి యెట్లు భిన్న గతులలో రచితము లయినవో ఒక పట్టికలో చూపింతును. ఇంతకుముందు నేను యతి అనే పదమును అక్షర మైత్రికి సూచకముగా నుండునని వాడుచుంటిని గాని అంతకంటె వడి శబ్దమే మేలు. సాంకేతికాక్షరముల తెలివిడి :-

సీ. అనగా సీసమందలి పెద్ద పాదములు. గీ. అనగా ఎత్తు గీతమందలి నాల్గు పాదములు. సీ. వడి। ప్రాస. అనగా సీస-పెద్ద పాదమందలి ఖండములలో మొదటి ఖండమందు వడి (అక్షరమైత్రి గల యతి) రెండవ ఖండమందు ప్రాస (ప్రాస యతి). గీ. ప్రాస। వడి అనగా ఎత్తు గీతి చరణములు 1 + 2 ఒక పాదముగాను, 3 + 4 ఒక పాదముగాను మార్చగా మొదటి ఖండమందు అనగా 1, 3 చర ణములందు ప్రాస రెండవ ఖండమందు అనగా 2, 4 చరణములందు వడి అని అర్థము. వడి అనగా అక్షరమైత్రి గలదని అర్థము.

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| సీ. వడి | సీ. వడి | సీ. వడి | సీ. వడి |
| గీ. వడి | గీ. ప్రాస | గీ. వడి\|ప్రాస | గీ. ప్రాస \| వడి |
| **5** | **6** | **7** | **8** |
| సీ. ప్రాస | సీ. ప్రాస | సీ. ప్రాస | సీ. ప్రాస |
| గీ. వడి | గీ. ప్రాస | గీ. వడి\|ప్రాస | గీ. ప్రాస \| వడి |
| **9** | **10** | **11** | **12** |
| సీ. వడి \| ప్రాస | సీ. వడి\|ప్రాస | సీ. వడి\|ప్రాస | సీ. వడి \| ప్రాస |
| గీ. వడి | గీ. ప్రాస | గీ. వడి\|ప్రాస | గీ. ప్రాస \| వడి |
| **13** | **14** | **15** | **16** |
| సీ. ప్రాస \| వడి | సీ. ప్రాస\|వడి | సీ. ప్రాస\|వడి | సీ. ప్రాస \| వడి |
| గీ. వడి | గీ. ప్రాస | గీ. వడి\|ప్రాస | గీ. ప్రాస \| వడి |

ఇందుకు తెలివిడి :-

1. సీ. వడి / గీ. వడి } సీస - పెద్ద పాదములందు మొదటి ఖండ మందును; రెండవ ఖండమందును, గీతమందలి అన్ని చరణము లందును వడి (పద్యమంతయు వడిగలదే. అనంతుడు చెప్పిన అక్కిలి వడి సీసము నకుగాని అప్పకవి లక్ష్యముగా చూపిన వడి సీస మునకుగాని సరిపోవును.

2. సీ. వడి } సీస పెద్ద పాదములందు పూర్తిగానే వడి
గీ. ప్రాస } గీత మందు పూర్తిగానే ప్రాస (ప్రాస యతి).

8. సీ. వడి } అనగా సీ. పెద్ద పాదములందు పూర్తిగా వడి.
గీ. వడి|ప్రాస } గీ. మొదటి ఖండములందు అనగా 1, 3 చరణములందు వడి

రెండవ ఖండములందు అనగా 2, 4 చరణములందు ప్రాస

16. సీ. ప్రాస|వడి } అనగా సీస పాదములును ఎత్తుగీతి పాదములును ఆఱు పాదములుగా ఉంచినప్పుడు
గీ. ప్రాస|వడి } పూర్వ ఖండములందు ప్రాస. ఉత్తర ఖండములందు వడి. ఎత్తుగీతిలో పూర్వ ఖండములు బేసి చరణములు ఉత్తర ఖండములు సరి చరణములు.

ఉండగల ఈ 16 విధములయిన భేదములలోను 12, 14, 15-విధములయిన సీసములు నన్నయ సీసములలో నాకు కనబడలేదు. తక్కిన విధములను బట్టిచూడగా నన్నయకు ఈ మూడును సమ్మతములు కాకపోవు; కాని ఆ రచనలు జరుగలేదు అని చెప్పవలెను.

నన్నయ సీసములు—ఎన్నెన్ని ఏ యే విధముల సీస భేదములలో నున్నవో చూడుడు:—

| నం. | | |
|---|---|---|
| 1. | 158 | (పూర్తిగా వడి సీసములు) |
| 2. | 3 | మాత్రమే |
| 3. | 2 | ,, |
| 4. | 2 | ,, |
| 5. | 3 | ,, |
| 6. | 33 | (పూర్తిగా ప్రాస సీసములు) |
| 7. | 1 | మాత్రమే |
| 8. | 4 | ,, |
| 9. | 16 | సీ. వడి।ప్రాస / గీ. వడి అయినవి |
| 10. | 6 | మాత్రమే |
| 11. | 1 | ,, |
| 12. | — | లేవు |
| 13. | 21 | సీ. ప్రాస।వడి / గీ. వడి అయినవి |
| 14. | — | లేవు |
| 15. | — | లేవు |
| 16. | 2 | మాత్రమే |

ఒక్కొక్క పద్యమందు పాఠాంతరమువలన అది ఏవిధమయిన సీసమో సరిచూచుకొని నిర్ణయించవలసి ఉండును. ఉ॥

— ద్వైపాయనుండును - ధౌమ్యుండు నాదిగా । భూసురుల్
సూత్ర వి।న్యాస మమరఁ

జేసి శాంతిక విధుల్ - సేయంగ సుప్రశ। స్తంబైన రమ్య
దే-శంబునందు

వాసవాదిష్టుండై - వసుధను నేతెంచి । పేర్మితో నవ్విశ్వ-కర్మ
పురము

నిర్మించె నదియును - నిరుపమ లీలలఁ । దనరి యింద్ర ప్రస్థ-
మనఁగ నింద్రు

ఆ. పురముతోఁ గుబేరు - పురముతో వరుణుని । పురముతోడ
నీశు - పురముతోడ

నురగపురముతోడ - నురువిలాసంబుల । సరియనంగ నొప్పె ।
ధరణిమీఁద॥

ఇది ఆనందముద్రణం—ప్రతి. ఇందు సీస పెద్ద పాదములం దన్ని టను పూర్వఖండములందు వడియు ఉత్తరఖండములందు ప్రాస స్పష్టముగా కనబడుచున్నవి. ఎత్తుగీతిలో నాలుగు చరణములందును ప్రాస స్పష్టముగా కనబడుతున్నది. కనుక దీనిని $\frac{10\ \text{వ।ప్రా}}{\text{వ।ప్రా}}$ గా నిర్ణయింతును. అంతేకాక పూర్వఖండములందు అనగా బేసి చరణములందు ప్రాసముతోపాటు వడి కూడ గలదు. ఉత్తర ఖండములందు (నాల్గవ చరణమున) సరి, ధరణిలో ప్రాసమే కాని వడి లేదు కనుక ఇది $\frac{11\ \text{వ।ప్రా}}{\text{వ।ప్రా}}$ గా నిర్ణయింతును అని ఆలోచించుచుండగా వావిళ్ల వారి ప్రతిలో ఎత్తుగీతి -

పురముతోఁ గుబేరు - పురముతో వరుణేంద్రు । పురవరంబు
తోడ - నురగరాజ

పురవిభూతి తోడ - నురువిలాసంబుల । సరి యనంగ వొప్పు -
ధరణిమీద॥

అను పాఠము కనబడినది. రెండును సంభావ్య పాఠములే కనుక రెంటికి సమానమైనదని దీనిని 10వ గడిలోనే పెట్టుకొంటిని.

ఆది. I. 70 – ఇమ్మహాభారతం బిమ్ముల ... అను సీసము పాఠభేదములవలన బాధ లేకపోవుటవలన ఇది $\frac{13 \text{ ప్రా.వడి}}{\text{వడి}}$ అను విధమున నిర్ణయింపగలిగితిని. ఇట్లు సులువుగా వర్గీకరణమునకు లొంగిన సీసములు చాలా కలవు. ఈ విధముగానే ఆది. III. 155-అంగనాజనుల యుత్తుంగ...అను సీసము సులువుగా $\frac{8 \text{ ప్రాస}}{\text{ప్రాస।వడి}}$ లో చేర్పగలిగితిని.

కొన్ని సీసములందు ఈ వడినియమములను నిర్ణయించునపుడు కొన్ని పదముల స్వరూపములును గోచరమగు చుండును.

సభా. I. 47 సీ॥ అయంబునందు నా-లవ భాగమొండె... ఇక్కడ నాలు + అవ అని స్వరము విడినదని ఒప్పుకొనక తప్పదు. ఆ పాదమందే మూఁడవ భాగ మొండెనం - దర్థ మొండె అనియును గలదు. ఇది తప్పేమో యనుకొని నాలగు భాగము, మూఁడగు భాగము అని పాఠాంతరము కలదని కొందఱు సవరించుటకు చూచిరి. ఇది 'ఛందోరీతు'లను విషయమునకు అప్రస్తుతము కనుక ఇక్కడ ఇంతకంటె ఎక్కువగా చర్చించుటకు అవకాశము లేదు.

కాని, నన్నయ పాటించిన సీస లక్షణము గుర్తించిన యెడల సరియైన పాఠము మనకు లభ్యము కాగలదని చెప్పుట అప్రస్తుతము కాదు గదా?

సభా. I. 25.

సీ. మీ వంశమున నర - దేవోత్తములరైన । సద్ధర్మ మార్గంబు - నలుపుదయ్య
ధర్మ విదుండవై - ధర్మార్థకామంబు । లొండొంటి బాధింప - కుండ నుచిత
కాల విభక్తముల్-గాఁ జేసి సేవింతె - ధర్మువునంద చి-త్తంబు నిలిపి
యిమ్ములన పరరా-త్రమ్ము లం దెప్పుడుఁ । జింతింతె నిజబుద్ధి - జేయఁదగిన

ఆ. రాజకృత్యములఁ ది-రంబుగా నిఖలని-యోగ వృత్తులందు - యోగ్యులైన
వారిఁగరము గాఁ-వమ్మునఁ బంచితె । నీవు వారిదయిన - నేర్పెఱింగి ॥

ఇది 13 వ సీ । ప్రా । వడి / గీ । వడి కావలసి యున్నది. కాని, ఇక్కడ మూడవ పాదమందలి పూర్వ ఖండమున ప్రాసయతి ఉండవలసిన చోట వడి కనబడు చున్నది. ఇక్కడ ఒక చోట నన్నయ తాను చేసి కొన్న నియమమును తప్పె ననగలమా? వ్రాతప్రతులు చూడగా రెండు మూడు ప్రతులలో మాకు సరియైన పాఠము దొరికినది "కాల విభక్తముల్ గ్రాలంగ సేవింత" అని యున్నది. ఇది సరియైన

పాఠమనుటకు నన్నయ చేసికొన్న నియమము నిలబడుటయే కారణము.

అర. II. 230–సీ. 'ఇన్నలోపాఖ్యాన - మెప్పుడు'... ఇది పూర్తిగా వడి సీసము; మొట్టమొదటి సీస భేదమునకు లక్ష్యముగా నుండ దగినది. కాని, మూడవ చరణము (ఎత్తు గీతిలో) 'మత చరిత్రుఁడైన - ఋతు పర్ణుఁగీర్తింప...'అని ముద్రిత గ్రంథములలో నుండుట వలన నన్నయ చేసికొన్న వడి నియమము తప్పినది. వావిళ్ల వారి ప్రతిలోను అట్లే ఉన్నది కాని పుట అడుగున 'ఋషిచరిత్రుఁడైన' అనియు 'ఋజుచరిత్రుఁడైన' అనియు పాఠము లున్నవని తెలియజేసినారు.మా వద్దనుండిన వ్రాత ప్రతులు చూడగా ఋజు చరిత్రుడైన అను పాఠము కనబడినది. ఆ పాఠము గ్రహింపదగినది. అప్పుడు నన్నయ చేసికొన్న నియమము నిలబడ గలదు.

ఆది. II. 127–"జనమే జయుని చేయు - సర్ప యాగమునకు। విఘ్న మందఱముగావింత మతఁడు। ధర్మార్థి గావున-ధారుణీ సురులమై। యడుగుద మీ క్రతువుడుగు మనియు।" ఇదికూడ సర్వత్రవడి నియమము గల సీసము. ఒక్క రెండవ పాదమందలి రెండవ ఖండమందే వడికి మాఱుగా ప్రాసమున్నది. తాళపత్ర ప్రతులు పరిశీలింపగా మాకు సరియైన పాఠము కనబడినది "యడుగుద మిష్టి సే-యకుమటనియు" అని ఉన్నది. ఆ పిమ్మట వావిళ్ల వారి ముద్రిత ప్రతిలో ఈ పాఠము పుట యడుగున పాఠాంతరముగా చూపించి ప్రాసము గల పాఠమే సరియైన పాఠమనుకొని గ్రంథములో ముద్రించినారు.

సభా. I. 136–"అతి సమర్థుండు బృ-హద్రథుండను వాఁడు -" ఇది కూడ సర్వత్ర వడి యుండవలసిన సీసము. కాని ముద్రిత ప్రతు

లలో నాలవ పాదము - అమరంగఁ బెండ్లియై - సమమైన ప్రీతి నఁ। య్యిరువురయందు—"అని ప్రాస యతి గల పాఠ మున్నది. కాని పెక్కు వ్రాత ప్రతులలో "అమరంగఁ బెండ్లియై - యనుపమ ప్రీతి" యను వడి నియమము గల సరియైన పాఠమున్నది.

ఈ నియమములు సీసములందును అందుగల ఎత్తుగీతులలో మాత్రమే కాదు విడిగా నున్న ఆటవెలదులలోను తేటగీతులలోను ఉన్నవి. అందుకొక ఉదాహరణము-

ఆది. VII. 112 -

— ఎట్టి రాజులును మ-హీసురోత్తము లెదు రరుగుదెంచు నప్పు-డధిక భక్తి
నెరఁగి ప్రియము వలికి। తెరు విస్తురిట్టిద, ధర్మ మీవు దీనిఁ-దలఁప వెట్టు ? ॥

ఇది నాలుగు చరణములందును వడి నియమము గలదియై యుండవలెను. 3-వ చరణమున వడికి బదులుగా ప్రాసయతి కలదు. సరియైన పాఠములు 'దివిరి దెరలి' పుట యడుగున ముద్రిత ప్రతిలో గలవు. మా వద్ద నుండిన వ్రాత ప్రతులలో 'తెరలి' కనఁబడినది. 'తెరలు' తొలఁగు అను నర్థములతో నన్నయ, తిక్కన్న ప్రయోగించి నారు. ఈ పద్యమునకు పూర్వమందున వచనములో తెరువు తొలంగుమని" ఉన్నది. కనుక ఇక్కడ 'తెరలి' యను పాఠమే కావలసినది—అర్థ పుష్టికిని నన్నయ కోరిన ఛందో నియమమునకును ఇక్కడ 'ఎరఁగు' (నమస్కరించు) అనుటకు తగిన ప్రసక్తి లేదు. తొలఁగుటే ముఖ్యము. అదిగాక కవిత్రయము వారు "ఎఱగు" శకటరేఫ

కలదిగాను అర్ధాను స్వారము లేనిదిగా ప్రయోగించినారు. ఏదో ఈ విషయము జ్ఞప్తికి వచ్చినది కనుక చెప్పినాను. ఇంతకంటె దీనిని గూర్చి ఇక్కడ చర్చింపరాదు. కాని, ఇక్కడ చెప్పవలసిన అంశ మొక్కటి మాత్రము కలదు. నన్నయకు సంబంధించిన ఛందోరీతులు వివరించినపుడు నన్నయ చేసికొన్న నియమములు తెలిసికొనక అప పాఠములను నిఘంటువులలోనికి ఎక్కించిన యెడల భాషా స్వరూప మును చెడగొట్టిన వారవుదురు. ఇప్పుడు నన్నయ భారతమునకు పదకోశము వ్రాయ బూనుకొన్న వారు నన్నయ నియమములను తెలిసికొని సరియైన పాఠములు ముందుగా నిర్ణయించుకొనని యెడల వారి పదకోశము దుష్టము కాక తప్పదు.

మఱియొక అంశము చెప్పి ఈ ప్రసంగము ముగింతును. ఛందోరీతులలో తెలుగు కవులు సంస్కృతమున లేని ప్రాస నియ మములను (తక్కిన ద్రావిడులతో పాటు) పాటించుచున్నారు. వడి విషయములో తమిళుల కున్న నియమముల కంటె ఎక్కువగా నియమములను చేసికొన్నారు. దీని వలన ఎన్ని బాధలు కవులు పడినను భాషాజిజ్ఞాసువుల కొరకు మేలు కలిగినది. ఈ తెలుగు వారి ఛందోరీతులలో ఒక భాగముగా నున్న ప్రాసముల నున్న అర్ధాను స్వారములును బట్టియు, వడి స్థలముల నున్న అక్షరము లను బట్టి ప్రాచీన భాషా రూపములను గుర్తించుటకు ఒక మార్గము కనబడినది. ఈ అంశములను మరియొక ప్రకరణమున వివ రింతును.

## అక్కరలు

అక్కరలు దేశి పద్యములలోనివి. ఇవి కన్నడమందును గలవు. అంతే కాదు తెలుగులోకంటె ఎక్కువ వ్యాప్తిలోనే ఉన్నవన వచ్చును. తెలుగు అక్కరలకును, కన్నడ మందలి అక్కరలకును సాదృశ్యమును కొద్దిగా భేదమును గలదు. తెలుగులో సూర్యగణము లుండుచోట్ల కన్నడములో బ్రహ్మ గణము లుండును. (అనగా నగణ హగణములే కాక గగనగణములు కూడను); తెలుగులో ఇంద్ర గణము లుండుచోట్ల కన్నడములో విష్ణు గణము లుండును, (అనగా నల, నగ, సల, భర, తలే కాక మగణ సగణ గురువు కూడను), తెలుగులో చంద్రగణము లుండుచోట్ల కన్నడములో రుద్రగణము లుండును. (అనగా నగగ, నహ, నలల, భల, భగ, మల, సవ, నహ, తల, రల, నన, నలల, రగ, తగ లే కాక మగ, సగగ ములు కూడను).

ఈ క్రింది పట్టికలో అక్కరల పేళ్లు గణముల వివరణము తెలియ యుదును. తెలుగు పేళ్లు నవబఱతును. కన్నడమునకు గల పేళ్లు పైని వివరించినదానినిబట్టి తెలిసికోవచ్చును.

| అక్కరల తెలుగు పేళ్లు | అందలి గణముల సంఖ్య పేళ్లు | గణముల వెరసి | కన్నడమందలి పేళ్లు |
|---|---|---|---|
| మహాక్కర | సూర్య 1, ఇంద్ర 5, చంద్ర 1 | 7 | పిరియక్కర |
| మధ్యాక్కర | ఇంద్ర 2, సూర్య 1, ఇంద్ర 2, సూర్య 1 | 6 | దొరెఅక్కర |
| మధురాక్కర | సూర్య 1, ఇంద్ర 3, చంద్ర 1 | 5 | నడువణక్కర |
| అంతరాక్కర | సూర్య 1, ఇంద్ర 2, చంద్ర 1 | 4 | ఎడెయక్కర |
| అల్పాక్కర | ఇంద్ర 2, చంద్ర 1 | 3 | కిరియక్కర |

ఇందు మహాక్కరకు పిరియక్కర, అంతరాక్కరకు ఎడెయక్కర, అల్పాక్కరకు కిరియక్కర అను పేళ్లు సరిగా ఉన్నవి. కాని తక్కిన రెంటికిని సరిగా లేవు. అక్కరలయం దంతను గణముల సంఖ్యనుబట్టి నడుమ నున్నది గనుక నడువణక్కర యను పేరు కన్నడమున సార్థకముగా నున్నది, కాని లక్షణమునుబట్టి దీనికి సరియైన తెలుగు పేరు మధురాక్కర; అర్థమునుబట్టి సరియైన తెలుగు పేరు మధ్యాక్కర; లక్షణమునుబట్టి కన్నడము పేరు దొరె అక్కర, దొరెయక్కర యనగా సమాన భాగములు గల అక్కర అని అర్థము.

అనగా పాదము రెండు సమభాగములు చేయగా రెంటను గణముల తీరు సమముగానే ఉండునని అర్థము.

ఈ అక్కరలలో నన్నయ ఎక్కువగా మధ్యాక్కరలను వాడినాడు కనుకను ఆతర్వాత ఎఱ్ఱన మరికొద్దిమంది కవులు, నేడు విశ్వనాథ సత్యనారాయణగారు మఱియొకరిద్దరు మధ్యాక్కరలను వాడుచున్నారు కనుకను ముందుగా మధ్యాక్కరలను గూర్చి చర్చించి ఆ తర్వాతను తక్కిన అక్కరలను గూర్చి తెలియజేయుదును.

మధ్యాక్కరకు లక్షణమును బట్టి సరియైన కన్నడ అక్కరము దొరెయక్కర గదా? దానికి కన్నడ లాక్షణికులు చెప్పిన అంశములలో మనకు రెండు ముఖ్యమయినవి కలవు. చివర నున్న బ్రహ్మగణము గుర్వంతమయి యుండవలెను. అనగా గగమో లేక సగణమో కావలెను. మధ్య నుండు బ్రహ్మగణము మూడు మాత్రలదైనను, 4 మాత్రలదైనను కావచ్చును. మొత్తముమీద ప్రతి చరణమందును 26 మాత్ర లుండును. ఆ మాత్రల పంపకము ఈ దిగువను ఒక ఉదాహరణముగా నీయబడినవి :

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | |
|---|---|---|---|---|---|---|
| IIIU | IIII | III | IIUI | IIUI | UU | |
| IIIU | IIII | III | IIUI | IIIU | UU | |
| IIII | UII | IIU | IIIU | IIUI | IIU | |
| IIUI | UII | IIU | IIII | IIIU | IIU | |
| 5 | 4 | 3 | 5 | 5 | 4 | (12 + 14) = 26 |
| 5 | 4 | 3 | 5 | 5 | 4 | (12 + 14) = 26 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 4 | 4 | 4 | 5 | 5 | 4 | (12 + 14) = 26 |
| 5 | 4 | 4 | 4 | 5 | 4 | (13 + 13) = 26 |

ఈ దొరె అక్కరకు బ్రహ్మగణములలో 3 గాని 4 గాని మాత్రలు; విష్ణు గణములు 4 గాని 5 గాని మాత్రలు గలవే కావలెను. అంతకంటె ఎక్కువ మాత్రల విష్ణు గణములు ఈ దొరె అక్కరకు అక్కరలేదట. కనుక మన ఇంద్రగణములే అయినవి.

మన ఇంద్రగణములలో 5 మాత్రల గణములు ఈ మధ్యాక్కరకు వినియోగించినయెడల మన మధ్యాక్కర పాదమునకును, పాదానికి 23 మాత్రలు ఉండగలవు.

$5 + 5 + 3 + 5 + 5 + 3 = 26.$

అయితే ఈ మధ్యాక్కరను గూర్చి ఇంతగా చెప్పుట యెందుకని కొందరు అనుకొనవచ్చును. అప్పకవి మొదలయినవారు పాదమునకు 2 ఇం + 1 సూ + 2 ఇం + 1 సూ అనుటవలన $4 + 4 + 3 + 4 + 4 + 3 = 22$; $5 + 5 + 3 + 5 + 5 + 3 = 26$ కావచ్చును. అందుచేత 22 మొదలు 26 అక్షరములవఱకును మారుచుండవచ్చును. లాక్షణికులు చెప్పినది స్పష్టముగానే ఉన్నది. మఱి [illegible] విషయము [illegible]లము మధ్య నుండుటవలన ఒకరీతి సాలభ్యము కూడా కనబడుచున్నది.

ఆది రామణీయక నిధికి - అధిదేవతయై కాకయున్న

(5 + 4 + 3 - 5 + 5 + 3) 25

సదనమో సౌందర్య సార - సముదాయ మునకోయి సఖుడ

(5 + 5 + 3 - 5 + 5 + 3) 26

నన్నయ మధ్యాక్కరలలో 4 గణముల తర్వాత వడి :—

ఏ నేఁడు । లఘుదెంచె । నర్జు।నుం డేగి - యింత కే। తెంచు

(5 + 5 + 3 + 5 - 5 + 3 = 18 + 8 = 26)

అతని మధ్యాక్కరలన్నీ ఇట్టి గణవిభజనకు కుదిరినయెడల ఇంతగా చెప్పనక్కరలేదు. కాని ఇంత సులువుగా అవి గణవిభజనకు లొంగవు. వడి స్థలములో చిక్కులేదు. ఈ వడి స్థలమువలన ఏర్పడిన ఖండములందు రెండవ ఖండములో తఱచుగా 5 + 3 = 8 మాత్రలు కనబడుచున్నవి. ఒకప్పుడు 7 మాత్రలున్నా చివరి అక్షరము పాదాంతము కనుక ఒక మాత్ర పొడిగింపవచ్చును. వడికి పూర్వమందలి గణములే విడకుండ నున్నవి.

యుద్ధమల్లుని శాసనమందలి మధ్యాక్కరలలోను నాల్గవగణము తర్వాతనే వడి గలదు. బహుశా ఆ కాలములో వడిస్థలము అక్కడనే ఉండెను కాబోలు. తిక్కన్న నన్నెచోడుడు మధ్యాక్కరలు వాడలేదు. నన్నయ ఫక్కిని రచించుటకు ప్రయత్నింప బట్టి కాబోలు ఎఱ్ఱాప్రగడ మధ్యాక్కరలు చెప్పినాడు. ఐతే అతడు మూడవ గణము తర్వాతనే వడి పాటించినాడు. లాక్షణికులు ఈ ఎఱ్ఱాప్రగడ మధ్యాక్కరలను చూచి కాబోలు వడి స్థలము మూడు గణముల తర్వాతనే ఉండవలసినదిగా నిర్ణయిం[illegible] కాని వారే చెప్పిన

లక్షణము ప్రకారము నన్నయ మధ్యాక్కర పాదములు కొన్ని విడ బడకుండ నున్నవి :—

తన దివ్యశక్తి న'ప్పాశముల విడిచి' - తన్ముని నాథు
ఆది. VII. 112

నంగురు కులహాని 'కరుఁడై ధారుణీ'-నాథ నీ సుతుఁడు
(సభా. II. 182).

అమరంగ ధర్మువు 'రక్షించుఁ బ్రీతి' - నని శత్రులందు
(అర. I. 225)

కలుగు తెఱంగియు పాయ 'పూర్వమునఁ'-గడఁగి తత్సిద్ధి
(అర. I. 234).

అరుణ సరోరుహ 'దళమృదులంబు' - లైన యత్తరుణి
(అర. III. 299).

పరఁగనాకారణమున 'నిట్టి దుఃఖ' - భారము దాల్చె
(అర. III. 299)

అరిగె నీశాను దిక్కునకు 'నీయనుజుఁ'-డనిల వేగమున
(అర. III. 373).

తోనేఁగె నుత్తర'ము మించి' ధర్మని-త్యుఁడు ధర్మజుండు
(అర. IV. 3)

అన్నిటిని మించి చిక్కు పెట్టునది :-

'పదుంబ్ర' బోలెడు సుతుల నూర్వుర - బడయంగ వలతొ
'పదుంబ్ర' నూర్వుర కెనయగు సుతుల - బడయంగ వలతొ
(అర. IIr 348)

పీటి మధ్య నున్న గణములు లాక్షణికులు చెప్పినట్లు లేవు.

వ్రాత ప్రతులలో లాక్షణికులు చెప్పిన లక్షణమునకు విరుద్ధముగా నున్న పంక్తులను కొందఱు సవరించి అచ్చు వేయించినారు. ఆ పని వలన నన్నయ భాషకు విరుద్ధమయిన ప్రయోగములను చేయవలసి వచ్చినది. చూడుడు :—

1. నీ పరోక్షంబున రాజు 'గావలె' - నెమ్మినిట్లేఁగ
(ఆది. IV. 175)
2. ఏ మేము మున్ను 'పూజింపుదుము' రుద్రు-నిందని వేడ్క
(అర. II. 255)

'కావలె' 'పూజింపుదుము' వంటి ప్రయోగములు మఱి యెచ్చటను నన్నయ భారతమందు కనబడవు. ఇవి అర్వాచీనుల ప్రయోగములు గాని, పూర్వ కవి ప్రయోగములు కావు. కనుక 'కావలయు' 'పూజింతుము' అనియే నన్నయ ప్రయోగించియుండునని నిశ్చయింపక తప్పదు. అయిదాఱు వ్రాత ప్రతులలో ఇట్లే ఉన్నది. అప్పుడు పైని చూపించిన పాదముల వలెనే ఈ రెండు పాదములును లాక్షణికులు చెప్పిన గణలక్షణమునకు విరుద్ధముగా నుండును. చూడుడు.

1. నీ పరోక్షంబున రాజు గావలయు - నెమ్మినిట్లేఁగ
2. ఏ మేము మున్ను పూజింతుము రుద్రు-నిందని వేడ్క
వ్రాత ప్రతులలోని పాఠములు.

ఇట్లు పరిశీలించి చూడగా నన్నయ మధ్యాక్కరల పాదములు కొన్ని అప్పకవి మొదలయిన లాక్షణికులు చెప్పిన లక్షణమునకు విరుద్ధములుగా ఉన్నవి. నన్నయ వంటి కవి ఇట్టి లక్షణ విరుద్ధము లయిన పాదములను రచించునా ? అయితే ఇట్టి పాదములను బట్టి నన్నయ మధ్యాక్కరలకు వేఱుగా లక్షణము చెప్పవలెనా ? ఈ విషయమును పరిశీలించిన వారిలో మొదటి వారు వేకుమళ్ల రాజగోపాలరావు, బొడ్డపాటి రాజన్న పంతులు గార్లు. మఱి కొంతకాలమునకు వరుఖల చిన సీతారామ శాస్త్రిల వారు.

వీరిలో రాజగోపాలరావు గారు చెప్పిన దేమనగా నన్నయ కన్నడ లక్షణమును ననుకరించి యుండును. అందువలన సూర్యగణముగా నుండ వలసినది కన్నడ లక్షణమును బట్టి సగణమయినను గగమయినను కావచ్చును అని తేలినది. చివరి గణము కూడ సూర్య గణమే కదా ? అది కూడ గగమో సగణమో కావచ్చునా ? అను ప్రశ్నకు నన్నయ దానిని పాటించినట్లు కనబడదని రాజగోపాలరావు గారు ఒప్పుకొన్నారు. అందుకు రాజన్న పంతులు గారు ఆక్షేపించి వారు. చివరనున్న సూర్యగణము గగమో సగణమో చేయని నన్నయ మధ్యనున్న సూర్యగణమును గగముగానో సగణముగానో కూర్చునా ? అని వారి ఆక్షేపము. కాని, వారి ఆక్షేపము సరియైనది కాదు. పాదాంతమున నున్న లఘువు గురువుగా పలుకరాదని నన్నయ చెప్పెనా ? అదిగాక వ్రాత ప్రతులలోను శాసనములలోను పాదాంతమున నున్న లఘువు గురువుగా నుంచుట కనబడు తున్నది. యుద్ధమల్లుని శాసనములో 'గట్టించెం' అని చివర నున్నది. దాని పై పాదము చివరను 'గాను' తర్వాత రెండవ పాదము మొదట 'స్థమ

తాత' అనగా 'గానున్దమతాత' అయినది. అందు పాదాంతమున 'గానున్' గగమయినది, మధ్యనున్న సూర్యగణములు కూడ కొన్ని చోట్ల ఆ శాసనములో బెజవాడ 'గొమర' 'స్వామికి' ధాముద్ధత్తించె 'లింగం' అని గగము సగణములు కనబడు చున్నవి. అయితే, ఇవి హగణములుగానో నగణములుగానో చదువుటకు వీలులేక పోలేదు. కాని గగము లెక్కడ? అను ప్రశ్నలకు సమాధానముగా మాత్రమే చూపించినాను. దిద్దుటకు గాని అట్లు చదువు కొనుటకు గాని వీలు కాని గగములను, సగణములను చూపింప గలరా? అనిన యెడల శాసనములో లేవు కాని నన్నయ మధ్యాక్కర పాదములందు కన బడుచున్నవి. అవి సవరించుటకు సాధ్యము కాకుండ నున్నవి కనుక నన్నయ ఉద్దేశ పూర్వకముగానే ఆ సూర్యగణములుండ వలసిన చోట కర్ణాట లక్షణమును ననుకరించి గగమో సగణమో నిల్పినా డనవచ్చు నని రాజగోపాలరావు గారు చెప్పినారు. వారు చెప్పినది నాకు సమ్మతమే. దానిని బట్టి కొన్ని పాదములు లక్షణ సమన్వితములు కాగలవు:—

— నంగురుకుల హాని కర్తుద్దై । ధారుణి - నాథ నీ సుతుఁడు

$13 + 13 = 26$

— సమరంగ ధర్మువు రక్షిం । చుం బ్రీతి - నని శత్రులందు

$13 + 13 = 26$

పైని కనబఱచిన పట్టికలో కన్నడ మధ్యాక్కర దొరెయక్కర, పాదములందు ప్రతిపాదము నందును 26 మాత్ర లుండునని చెప్పినది ఇక్కడ సరిపోయినది.

ఇంతవఱకే రాజగోపాలరావు గారి యభిప్రాయములు నన్నయ మధ్యాక్కర పాదములను కొన్నిటిని లక్షణ సమన్వయము చేసికొనుటలో నాకు తోడ్పడినవి. ఇంకను లక్షణము కుదరని పాదములు చాలా గలవు. ఆ పాదముల విషయమున వారేమీ తగిన సమాధాన మీయలేదు. రాజన్న పంతులు గారు రాజగోపాలరావు గారి యభిప్రాయములను ఆక్షేపించినారే కాని తామేమీ లక్షణ సమన్వయము చేయలేదు. ఇక శాస్త్రిగారు ఉపగణము లను పేరను సూర్యేంద్రగణముల సంఖ్య పెంచి, ఆ గణములను బట్టి లక్షణ సమన్వయము చేయ బోయినారు. తొలిసారి పెంచిన గణముల వల్లను కొన్ని పాదములు కుదరలేదని మరియొకసారి ఆ గణములకు మఱికొన్ని గణములు కలిపినారు. కుదరని గణములను ఇట్లు సూర్యేంద్ర గణముల లోనికి తెచ్చుకొను చుండుట వలన ఈ గణముల సంఖ్య ఎంతవఱకు ఎక్కువయిన దనగా ఏ వచన వాక్యమయినను ఆ గణములను బట్టి మధ్యాక్కర కావచ్చును (వడి ప్రాసములు మాత్రముండవు) అన్నంత వఱకు ఎక్కువయినది. దాని వలన వారు చెప్పినది అతివ్యాప్తి దోషమునకు ఆస్పదమయినది. కనుక వారు చెప్పినది నాకు తోడ్పడలేదు. శాస్త్రిగారు చెప్పినట్లు "దిద్దుబాట్లు లేనట్టియుఁ దప్పుల కుప్పలు కానట్టియుఁ బ్రతులు దుర్లభంబులై యుండుట చేత నన్నపార్యుని యక్కరల వైఖరి నిర్ణయింప శక్యము గాకున్నది" అనుట ఇప్పటికిని సత్యమే. అయినను ఇంకను పరిశీలించి కాదగిన లక్షణ సమన్వయము చేయవలెనను పట్టుదలతో చూడగా నాకొక మార్గము కనబడినది.

కన్నడ పిరియక్కరలోను, దానికి సరియైన తెలుగు మహాక్కరలోను మొదట నుండవలసిన బ్రహ్మగణము గాని, (సూర్యగణము

గాని) తన స్థలము మార్చుకొని 2-వ గణముగా గాని 4-వ గణముగా ఉండ వచ్చునని లాక్షణికులు చెప్పినారు. అట్లే దొరె అక్కరలో 3-వ గణమయిన బ్రహ్మగణమున్ను మధ్యాక్కరలో మూడవ గణముగా ఉండు సూర్యగణమున్ను 2-వ గణముగానో 4-వ గణముగానో ఉండ వచ్చునన్న అనుమతి ఉండెనేమో? ఉండునన్న యెడల 'ఒక్క పదుంద్రు బోలెడు . .' అను మధ్యాక్కర (అర-II-348 తప్ప తక్కిన మధ్యాక్కర పాదములన్నీ లక్షణ సమన్వయ మయినట్లే చెప్పగలను :—

తన దివ్యశక్తి నప్పాళముల్ 'విడిచి' - తన్మని నాథు
అమరంగ ధర్మువు రక్షించుఁ 'బ్రీతి' - నని శ్రుతులందు
గలుగు కొటింగి యుపాయ పూ'ర్వమున' - గడఁగి తత్సిద్ధి
అరుణ సరోరుహ దళమృదు 'లంబు' - లైన యుత్తరుణి
పరగనా కారణమున నిట్టి 'దుఃఖ'-భారము దాల్చె
అరిగె నీశాన దిక్కునకు నీ 'యనుజుఁ'-డనిల వేగమున
తోనేఁగె 'నుత్తర'ము మించి ధర్మని-త్యుఁడు ధర్మజుండు
నీ పరోక్షంబున రాజు గా'వలయు' - నెమ్మినిట్లేఁగ
ఏ మేము మున్ను పూజింతుము రుద్రు-నిందని వేడ్క

ఈ విధముగా లక్షణ సమన్వయము చేసినాను, చేసి 40 సంవత్సరములయినది. ఇంత వఱకును దీనిని కాదని—నాకు తెలిసినంత మట్టుకు ఎవరును వ్రాయలేదు. అయినను ఇది మిత్థమని నేను చెప్పలేదు. సంభాద్యత తెలియ జేసినాను. ఇంతకంటె ఎక్కువ సమంజసముగా ఎవరు ఈ పాదములను లక్షణ సమన్వయముగా పొందుపఱచినను సంతోషింతును.

నన్నయ రచించిన మధురాక్కర (కన్నడమున నడువణక్కర) లాక్షణికులు తెలియజేసిన లక్షణముగలది :—

తనర జనకుండు నన్నప్రదాతయును భయత్రాత ।
యును ననఁగ నింతులకు మువ్వురొగిన గురువులు వీర ।
లనఘ యపనేత మఱియు నిరంతరాధ్యాపకుండు ।
ననఁగ బురుషునకి యేవురన యంబును గురువులు ॥

నన్నయ ఆదికవి కనుకను మార్గకవితను అవలంబించిన వాడు కనుకను దేశి కవిత యెడల అభిమానము గలవాడు కనుకను. ఇతడు ఏయే వృత్తములను ఎన్నెన్ని వాడెను జాత్యుపజాతి మొదలయిన పద్యములను ఎన్నెన్ని వాడెను అను విషయము తెలిసికో దగినది గదా ? అదికాక తెలుగులోనికి ఛందోరీతులు ఎట్లు వ్యాప్తిలోనికి వచ్చినవను విషయము మనకు ముఖ్యమైనది. ఈపద్యముల జాబితాలు ఇచ్చిన ప్రయోజనముండదు. హాని వలన తేలిన విషయము ముఖ్యము కాని పట్టికలు అంత ముఖ్యమయినవి కావు.

నన్నయ తన మహాభారతమును చంపువు వలె గద్య పద్యలతో రచించెను అందులో ఆశ్వాసాంత గద్యలు కాక వచనములు చిన్నవి, పెద్దవి అన్నియును చేరి సుమారు 1500 కలవు. తర్వాత ఎక్కువ సంఖ్యగల పద్యములు కందములు వేయికంటె ఎక్కువ కలవు. ఆ తర్వాత చెప్పదగినవి సీసములు (251) ఇందులో నుండు ఎత్తుగీతులలో ఆట వెలదు లెక్కువ. ఇవికాక ప్రత్యేకించి (విడిగా) చెప్పిన ఆటవెలదులు 150, తేటగీతులు 140 కలవు. ద్విపదలు వాడదులే కాని 10 తరువోజ లున్నవి. మొత్తము మీద వృత్తములకంటె

ఎక్కువగా జాత్యుప జాతులనే నన్నయ వాడినాడు. వృత్తములలో తఱచుగా కనబడునవి చంపకమాలలు (230), ఉత్పలమాలలు(200) మత్తేభములు (70) శార్దూలములు (55). తక్కిన వృత్తములు త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర గతులలో నడచేవి మాత్రమే అక్కడక్కడను అత్యాంతము లందును వాడెను. త్ర్యస్రగతిలో నడచు సుగంధి, ఉత్సాహములును; చతురస్రగతిలో నడచు మాలిని, కవిరాజవిరాజితము అంబురుహము మొదలయినవి; ఖండగతిని నడచు స్రగ్విణి, పద్మకము, లయగ్రాహి మొదలయినవి; మిశ్రజాతిని నడచు మత్తకోకిల, తరళ మొదలయినవి. తెలుగులో అంతగా వ్యాప్తి చెందని వసంత తిలక, పృథ్వి మొదలయినవి స్రగ్ధర, మహాస్రగ్ధర వంటి కష్టమైన వృత్తములు కూడా రెండు మూడుసార్లు కనబడును. అక్కరలలో మధ్యాక్కరలే ఎక్కువ, తక్కిన అక్కరలలో ఒక్క మధురాక్కరయే కనబడినది.

రగడలు, క్రౌంచ పద వృత్తములు, త్రిభంగి నన్నయవాడ లేదు.

మఱికొన్ని వృత్తములు తర్వాతి కవులు వాడిరి. కోలాచలము శ్రీనివాసరావు గారు తమ నాటకములలో జనరంజకముగా నుండునని చిన్న చిన్న క్రొత్త వృత్తములను ఇదేయనిన్ మదాన్విమతున్ దేవునిన్ వధించెదన్ వంటివి రచించిరి.

నన్నెచోడడు కూడ నన్నయ తర్వాత ప్రాచీన కవులలో ఎన్నదగిన కవి కనుకను గర్భ పద్యముల రచనకును బంధ కవిత్వమునకును చతుర్విధ కందములు మొదలయిన వినోద చమత్కార కవిత్వము

నకును పేరుపొందిన మొదటి కవిగా ఎన్నదగిన కవి గనుకను అతని కుమార సంభవ మందలి ఛందోరీతుల గుఱించి ప్రత్యేకించి చెప్ప వలెను.

నన్నెచోడడు నన్నయ తర్వాతివాడని నిర్ణయించినను నన్నయవలెనే ప్రాచీన కవి కనుకను, ఇతని కుమార సంభవము అను ప్రబంధము కలదన్న విషయమే సుమారు 50 సంవత్సరముల క్రిందట కీ॥ శే॥ మానవల్లి రామకృష్ణకవిగారు బయటికి తీసిన వఱకును మనకు తెలియకుండెను కనుకను ఇతని ఛందోరీతులను లాక్షణికు లెవరును పరిశీలింపలేదు కనుకను ఇతని కావ్యమందు క్రొత్త ఛందోరీతు లుండువని యనుకొనుటలో వింత లేదు. కాని సంప్రదాయము సమానము కనుక ఛందోరీతులలో పెక్కు వ్యత్యాసములు లేవు. అయినను ఉన్నవి చూడదగినవి. కవితా రీతులలో మార్గదేశి యనునవి కలవని చెప్పినవాడు నన్నెచోడడే. చాళుక్య రాజులు దేశకవిత పుట్టించి ఆంధ్రవిషయమున తెనుంగును నిలిపిరని చెప్పిన వాడు నితడే. 'మార్గ కుమార్గము దేశి యమార్గము వసలంగఁ దమకు మది వదలక దుర్మార్గ ప్రవర్తులనఁదగు మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులకున్' అని ఇతడు కుకవి నింద చేయు సందర్భమున చెప్పిన పద్యము స్పష్టముగా అర్థము కాక పోయినను మార్గ దేశి కవిత్వములు ఎందుకును పొందకుండ మిశ్రముచేసి "తండులాలు గృహమందు వసంతి, తిండికై తె బహుమంది వసంతి" అను రీతిగా కవిత్వమును చెప్పుచుండెడి వారిని కుకవులనుగా ఎంచి నిందించె నేమో ? నన్నయ భారతము వలెనే ఇతని కుమారసంభవమును చంపువు కనుక ఇందులో వచనములు వేయి కెక్కువగానే ఉన్నవి.

ఆశ్వాసాంత గద్యలును కలవు. నన్నయ గ్రంథములో వలెనే ఈ గ్రంథమందును వచనముల తర్వాత కందములు ఎక్కువ. దేశి రచనలలో ఆటవెలదులు తేటగీతులు సీసములును ఎక్కువగానే ఉన్నవి. నన్నయ రచించిన అక్కరలు నన్నెచోడుడు వాడలేదు. రగడలు ఈ ఇరువురిలో నెవరును వాడలేదు. నన్నెచోడుడు వాడిన క్రౌంచపదము నన్నయ వాడలేదు. వృత్తములలో ఇరువురును చంపకమాల ఉత్పలమాల మత్తేభము శార్దూలము ఎక్కువ తఱచుగా వాడినారు. తక్కిన వృత్తములలో క్లిష్టమయిన స్రగ్ధర, మహాస్రగ్ధర ఇద్దఱును వాడిరి. అందులో నన్నెచోడుడు ఎక్కువగా వాడెను. మొట్టమొదటి పద్యమే స్రగ్ధరలో నున్నది. తక్కిన వృత్తములు నన్నయ వాడినన్ని పెక్కురీతి వృత్తములను నన్నెచోడుడు వాడలేదు, కాని ఇద్దఱును రాగములలో రక్తి రాగములన్నట్లు వృత్తములలో రక్తి వృత్తములనదగినవి పెక్కు వృత్తములను వాడిరి. రక్తివృత్తము లనగా త్ర్యస్ర, చతురస్ర, ఖండ మిశ్రగతులలో నడచు వృత్తములు. నన్నెచోడని కవిత్వములో నన్నయ చూపని చమత్కృతి ఒకటి మనోజ్ఞమయినది కలదు. రసభావములకు అనురూపములగు పేళ్లుగల ఛందములను నన్నెచోడుడు ఎన్నుకొనెను. ఉ॥ కుమారసంభవము వలన కలిగిన ఉత్సాహమును తెలియజేయుటకు ఉత్సాహ వృత్తమును, శివునికి పార్వతి స్వాగత మనునప్పుడు స్వాగత వృత్తమును, చుక్కల వెలుగు వర్ణించినప్పుడు మణిగణనికరవృత్తమును, క్రౌంచపక్షుల నడకలను వర్ణించుటకు క్రౌంచపద వృత్తములు మత్తేభముల క్రీడలను వర్ణించుటకు మత్తేభ విక్రీడితావృత్తమును, మత్తకోకిలలను వర్ణించుటకు మత్తకోకిల వృత్తమును రచించెను. ఈ ప్రబంధమందు చిత్రబంధగర్భకవితారీతులు కూడ కలవు. ఇంద్రుడు కుమారున కోడి

మహాదేవు శరణుజొచ్చి అతనివలన అభయుంబువడసి యీశ్వరుని - "నాగాంశరణు, నాగబంధ మురజబంధంబులన్ బ్రస్తుతించుటయు..." అనుచోట నా యీ బంధకవిత్వములను ఈ విధముగా సందర్భోచితముగా గర్భకవిత్వమును, చతుర్విధ కందములను (చతుర్విధ పురుషార్థములవలన గలుగు నానందమునకు సూచనగా) రచించెను.

ఛందోరీతుల విషయము చెప్పునప్పుడు దేశి యనదగు ఛందములకు సాహిత్య గౌరవము తెచ్చి మార్గదర్శకుడైన కవి వాస్తవముగా పాల్కురికి సోమనాథుడు. శ్రీ నిడదవోలు వేంకటరావుగారు చెప్పినట్లు అతడు సృష్టించిన ఛందస్సు చాల గొప్పది. కాని నన్నయ కవితామార్గమునకు అలవడిన పండితులకు ద్విపద కవిత్వము నెడల ఆదరము లేకపోయినది. ద్విపదలు, సీసములు, రగడలు మొదలయినవి ఎన్నెన్నిరీతుల, ఎంత ప్రౌఢముగా కవిత్వమందలి జిగిబిగితో రచించుటకు అవకాశము గలదో సోమన రచనచేసి చూపించెను. సంస్కృత ఛ్ఛందోరీతులయెడల గల గౌరవము దేశి ఛ్ఛందోరీతులయెడల మన పండితులకును కవులకును లేదు. దేశి ఛ్ఛందముల యెడల ఆదరము గలవారు లేకపోలేదు. ఇప్పుడిప్పుడు దేశి మార్గమున గేయరచన సాగించువారు అధికమగుచున్నారు.



## ఐదవ ప్రకరణము

# వడి, ప్రాస

తెలుగులో ఛందోరీతులను పరిశీలించునపుడు వడి, ప్రాస నియములను గూర్చి చెప్పుట కూడ కావలసినదే. నడక (గతి) ఛందోరీతిని తెలియజేయును. ఆ నడకను తెలిసికొనుటకు మాత్రాగణ ములును, సూర్యేంద్ర చంద్ర గణములును, వృత్తములందు త్రిక ములు వాడినను అందు లీనమై స్పష్టముగాను గుప్తముగాను తెలియ జేయు నడక,గణములును ఎట్లు ముఖ్యములని యెంచివానిని పరిశీలించి తిమో అట్లే పద్యముల నడకను నిరూపించుటలో వడి ప్రాసములు కూడ కొంత తోడ్పడును కనుక వడి ప్రాస నియమములనుకూడ పరిశీ లించక తప్పదు. క్రౌంచపదము మొదలయిన వృత్తములలోను, లయ గ్రాహి మొదలయిన పద్యములలోను, (శ్రీ) నిడుదవోలు వేంకట రావుగారు పాల్కురికి సోమనాథుని ద్విపదలకు చెప్పినట్లు ద్విపదల లోను ప్రాసములవల్ల పద్యముల నడక శోభిల్లును కనుక ప్రాసములు కూడ పరిశీలింపదగిన విషయమే కాని వడి, ప్రాస భేదములు కూలంకషముగా ఇక్కడ వివరింప బనిలేదు. ఇందు మత భేదములను సూచింతునే కాని విపులముగా చర్చింపను. నూతన విషయములను మాత్రము విశదపఱతును. నా యీ గ్రంథమునకు అప్రధానము లయిన వడి భేదములు, ప్రాస భేదములు మొదలయినవి సూచింతునే కాని ఉదాహరణములతో వివరించను. ఇవన్నియు సమగ్రముగా వివరించినయెడల ఇది మఱియొక గ్రంథ మగును.

## వడి

" యతి పర్యాయ పదములలో వడి యనునది తెలుఁగు. దాని వ్యుత్పత్తియూహ్యము " అని కీ. శే. జయంతి రామయ్య పంతులు గారు కవిజనాశ్రయ పీఠికలో వ్రాసినారు. వారు వ్రాసినట్లు 'వడి' యే కాదు, 'వళి' కూడా (ఆ యర్థమందే) తెలుగు పదమే. దీని వ్యుత్పత్తి 'వడు' అను తమిళ పదమే యని కాని, ఆ తమిళ పదముతో సంబంధము గల ద్రావిడ పదమని కాని యనుకొనవచ్చునని నా యభిప్రాయము. యతి, విరతి మొదలయిన పర్యాయపదము లతోపాటు వడి (వళి) అను పదమును తెలుగు లాక్షణికు లందఱును వ్యవహరించుచున్నను దీనికి ఒక అర్థవిశేష మున్నట్లు కనబడును. " ఆద్యోవళిః " అని ఆంధ్రశబ్ద చింతామణిలోను, అందు కనువాద ములుగా నున్న తెలుగు లక్షణ గ్రంథములలోను, వడి (వళి) అనియే వాడుక :—

1. చరణాద్యక్షరమే వడి — కవిజనాశ్రయము.
2. పాదప్రథమాక్షర ముత్పాదితమగు వళి యనంగ - కావ్యా లంకార చూడామణి.
3. వాసన గల మొదలి వ్రాయి వడి యనఁబరగున్ - ఛందో దర్పణము.
4. చరణ చరణమున కాద్యక్షరములు వళులయ్యె — అప్ప కవీయము.

ఈ సందర్భమున వడి (వళి) యను పదమే కాని తక్కిన యతి, విరతి మొదలయిన పర్యాయపదములలో మఱి యేదియు

వాడకూడ దనునట్లు తోచును. సంస్కృత శ్లోకములలో పాద మధ్యమునందు విశ్రాంతి మాత్రమే ఉండును కాని తెలుగు పద్యము లలో నున్నట్లు అక్షరమైత్రి ఉండదు. కనుకనే కాబోలు వడి యను తెలుగు మాట తెలుగు ఛందస్సులో వాడవలసివచ్చినది. వడు అంటే మార్గమని యర్థము. పద్యపాదము విశ్రాంతి ననుసరించి రెండు భాగములు కాగా ఆ రెండు భాగముల మొదటి యక్షరములును పాద భాగములకు మార్గము చూపించునట్లుండుటవలనను, మొదటి భాగముయొక్క మొదటి యక్షరముతో (అనగా పాదాద్యక్షర ముతో) రెండవ భాగముయొక్క మొదటి యక్షరము మైత్రి గలదిగా ఉండవలెనను నియమము కలదు కనుకను, వడి (వళి) యను పదము వాడుట అవసరమయినదని నా యభిప్రాయము. పెద్ద పాదములందు అనగా తరువోజ, స్రగ్ధర, మహాస్రగ్ధర, అష్టమూర్తి మొదలయిన పద్యములందు మూడు నాలుగు వడులు ఒక్కొక్క పాదమందున్నను ఖండాద్యక్షరములే వడిస్థానము లగును.

## వడి స్థలము

సంస్కృత శ్లోకములలో విశ్రాంతి మాత్రమే చాలు. అనగా పాద మధ్యమునందు ఎక్కడనో ఒకచోట - అనగా సాధార ణముగా పాద మధ్యమందు, సరిగా తూచినట్లు నట్టనడుమనే కా నక్కఱలేదు. రెండక్షరములు ముందుగానో లేక అవలనో శ్రావ్యతకు అనుగుణముగా విశ్రాంతి తీసుకొనుటకు అనుకూలముగా విడిగా నుండు పదముగాని సమాసములో నుండు పదముగాని పూర్తిగా కావలెను, ఉ॥ రాముడు అను పదము పూర్తి కావలెను. కాని, 'రా' తర్వాతను విశ్రాంతి ఉండరాదు; 'ము' తో కాని 'డు' తో

కాని రెండవ భాగము ప్రారంభింపరాదు. 'సీతాకళ్యాణము' వంటి సమాసములో 'సీతా' తర్వాత విశ్రాంతి ఉండవచ్చును.

ఈ విశ్రాంతి స్థలములు భాషను బట్టి కొద్దిగా ఇటూ అటూ మారుటకు అవకాశమున్నది కనుక కొన్ని వృత్తముల విషయములో చిన్నచిన్న మార్పులు కలిగినవి :—

**ఉదాహరణములు :—**

1. భుజంగ ప్రయాతములో — సంస్కృతములో 6 అక్షరముల తర్వాత విశ్రాంతి. తెలుగు భుజంగ ప్రయాతములో 7 అక్షరముల తర్వాత 8 వ అక్షరమునకును పాదాద్యక్షరమునకును వడి (అక్షర మైత్రి). కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రి గారు సంస్కృత పండితులు కనుక సంస్కృత లాక్షణికులు చెప్పిన నియమమే పాటించినారు.

2. పంచచామరము—సంస్కృతంలో 8 తర్వాతను; తెలుగులో 9 తర్వాతను (1C వ అక్షరము) మైత్రి గలది.

ఈ వ్యత్యాసము ఎందుకు కలుగునో ఇక్కడ తెలియజేయవలెను.

1. భుజంగ ప్రయాతం - భుజంగ ప్రయాతం (సం॥ సరిగా రెండు ఖండములు), తెలుగులో రెండవ ఖండము ఎదురుగా నడచే IUU గణముతో ప్రారంభించ వలసివచ్చును. అది తెలుగు వారికి ఇష్టము కాదు కనుక గురువుతో ప్రారంభించిన చోట ద్వితీయ ఖండమును ఎత్తుకొందురు.

ఉ॥ 1. భుజంగే పర్యంక - పూర్ణానురాగున్

ఆ విధముగానే పంచచామరములో కూడ—

ఉ. 2. ప్రరూఢమైనఁ బద్మనాభ - పంచచామరంబగున్

3. శిఖరిణి — సం. 6 తర్వాత, మధ్యనున్న (IIIIIU) అక్షరములున్ను సంస్కృతములో రెండవ ఖండమున చేరినవి. తెలుగులో మొదటి ఖండమున చేరినవి.

ఈ విధముగా సంస్కృతమునకును తెలుగునకును ఇంకను మఱి కొన్ని వృత్తములలో ఈ వ్యత్యాసము కనబడును. తెలుగు కవులలో కొందఱు సంస్కృత మర్యాదను, మఱి కొందఱు తెలుగు మర్యాదను పాటించిరి.

4. పృథ్వి—సంస్కృతములో 8తర్వాత; ఈనియమమును పాటించినవారు అప్పకవి, అనంతుడు, విన్నకోట పెద్దన్న, కవిజనాశ్రయకర్త, పెద్దన్న. 11 తర్వాత నన్నయ, రామరాజభూషణుడు మొదలగువారు. తాతంపాట్లు మతమున 13 తర్వాత.

5. కవిరాజ విరాజితము— అప్పకవి మొదలయిన లాక్షణికులు పాదమందలి మొదటి యక్షరముతో 8 వది, 14 వది, 20 వది మైత్రి గలిగి ఉండుననిరి. కవిజనాశ్రయములో 'కామనిభా' అనుచోట వడి తప్పినది (ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి ముద్రిత ప్రతిలో) కాని నా వద్దనున్న ప్రతిలో సరిగా రామనిభాయని ఉన్నది. కవిజనాశ్రయము వడిని గూర్చి ఏమీ చెప్పలేదు కనుక పరిషత్తు వారికి బాధలేక పోయినది కాని, మొదటి పాదమున వళ్లు తక్కిన లాక్షణికులు

చెప్పినట్లే ఉండుటవలన ఈ పాదమందును అట్లే ఉండవచ్చునని మన మూహింపవచ్చును.

కంకటి పాపరాజు మొదలయిన కవులు ఈ నియమమును ఇట్లే పాటించినారు. కాని నన్నయ, పెద్దన, ఐక్కన్న మొదలయిన వారు కొందఱు పాదమధ్యమున ఒక్కచోటనే వడి నిల్పిరి.

7. మధ్యాక్కర – యుద్ధమల్లుని శాసనములోను, నన్నయ మధ్యాక్కరలోను 4- వ గణమయిన తర్వాత వడి నిల్చినది. నన్నయ తర్వాతి కవులందఱును, అనంతుడు అప్పకవి మొదలయిన లాక్షణికు లును, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మొదలయిన నేటి కవులున్ను మూడు గణముల తర్వాతనే వడి పాటించుచున్నారు. ఇదే మన చెవులకు శ్రావ్యముగా నుండగలదు. కాని నన్నయకు ఈ శ్రావ్యత అక్కఱ లేకపోయిన దనగలమా? ఆ కాలములో ఈ మధ్యాక్కరను నడపించే విధానములోనే భేదమున్నదని నేను అనుకొందును. మొదటి నాలుగు గణములు ఒక పట్టుగా ద్విపద వలె నడపించి శేషించిన రెండు గణములును రెండవ పట్టుగా చదివిన యెడల వినసొంపుగానే ఉండును. దీనికొక దృష్టాంతము: బొబ్బిలిపాట పాదములలో పాద మునకు 26 మాత్రలు. అందు మొదటి ఖండములో 8 లఘువుల గణ ములు రెండు అనగా 16 మాత్రలు గలది ఒక ఖండము, 10 మాత్రలు కలిగినది రెండవ ఖండము.

విజయనగరమూ। ఏలేవాడూ। ॥ విజయరామ రాజూ ॥

మధ్యాక్కరలు కూడ చివర అక్షరము కొంత పొడిగించి గురువుచేసి పాడుకునే వారు కాబోలు అప్పుడు ఒక్కొక్క పాదము 26 మాత్రలు గలది కాగలదు :—

తన దివ్య । శక్తి నఃప్రాశముల్ । విడిచి ॥ తన్మునినాథుఁ ।
అరిగె నీఃశాను దిక్కునకు నీ । యనుజుఁ ॥ డనిలవేగమున ।

సంస్కృత శ్లోకములలో అక్షరమైత్రి పాటించక పోయినను విశ్రాంతి పాటింతురు కనుక పద్యము నడక విశద పడుచుండును. పద్యగతి అంత స్పష్టముకాక కొద్దిగానైనను గుప్తముగా నుండ వలె నను అభిప్రాయముతో కాబోలును వడి స్థలము వద్ద పదము పూర్తి కాక పదాంతమందు నుండు వర్ణము అక్షరమైత్రి గల చోటికి దాటు కొని పోవునట్లు మన తెలుగు కవులు రచింతురు. అట్లు రచించుటే ప్రౌఢత్వము జూపునని వడి స్థలమందేకాక పాదాంత మందును పదము నాపరు. రెండవ పంక్తిలోనికి దాటుకొని పోవునట్లు పదములు కూర్తురు. కొన్నిచోట్ల "గోఃమాయువు గోరు చందమున" అనునట్లు పద్యము నడచును. అంతేకాదు. పద్యమునందు గల సాధారణ గతిని తప్పించి మఱియొక గతిని నడపించి క్రొత్త ఒయ్యారమును కూడ చరణ గతులకు ఒనగూర్తురు :—

ఉ॥ 1. మాలతికున్న చక్కదనమా ? గుణమా ? ధనమా ? పటుత్వమా ?

2. నాకు మనోహరంబగు మనంబు గుణంబు సుఖంబు గాపలెన్ ॥

ఇట్టి రచనలు కనబడి నప్పుడు సంస్కృత శ్లోకములలో గల విశ్రాంతి నియమమును తెలుగు కవులు పాటింప కుండుట లోప ముగా నుండదు సరేకదా, మేలుగా కూడ కనబడును. త్ర్యస్ర, చతు రస్ర, ఖండ, మిశ్రగతులతో నడచు పద్యములుకూడ ఆ యా నడ కలను గుప్తముగా నుంచి రచితములయి నప్పుడే ఎక్కువ చక్కగా నుండును. లేకున్న తప్పెట వాద్యముల వలెనే వినబడి ఒక్కొ క్కప్పుడు పేలవముగా నుండును. అదియొక కళా చతురత.

## వడి భేదములు

వడి భేదములు (అక్షరమైత్రి) ఎన్ని విధములు? కవిజనాశ్ర యములో పది విధములయిన వళ్లు మాత్రమే కలవు. కావ్యాలంకార చూడామణిలో పండ్రెండును, అనంతుని ఛందోదర్పణములో ఇరువది నాలుగును, అప్పకవీయములో నలువది యొకటియును వడి భేద ములు కనబడుచున్నవి. ఈ విధమున వళ్ల సంఖ్య అధికమగుచునుండు టకు కారణ మేమయి ఉండునను ప్రశ్న పుట్టుట సహజముగదా? తక్కువగా వళ్లు పేర్కొన్నవారికి పరిశీలన లోపించినదా? లేక, ఎక్కువగా చెప్పినవారు అనవసరముగా వళ్ల సంఖ్య పెంచినారా? లేక కవులు స్వతంత్రించి క్రొత్త క్రొత్త ప్రయోగములు చేయుట వలన ఆతర్వాతి లాక్షణికులు వళ్ల సంఖ్య ఎక్కువ చేయవలసివచ్చి నదా? ఈ విషయము చక్కగా విమర్శించవలసియున్నది కనుక కవిజనాశ్రయము, కావ్యాలంకార చూడామణి, ఛందోదర్పణము, అప్పకవీయము—ముఖ్యములయిన ఈ నాల్గింటిలో ఉన్న వళ్ల భేదము లను ఒక పట్టికలో చూపింతును:-

| కవిజనాశ్రయము-10 | కావ్యాలంకారచూడామణి-12 | ఛందోదర్పణము-24 | అప్పకవీయము-41 |
| --- | --- | --- | --- |
| 1 స్వరయతులు | 1 స్వరజులు | 1 స్వరయతులు | 1 స్వరమైత్రి |
| | 2 వృద్ధి | | 2 సర్వప్రధానవళి |
| | | 2 గూఢస్వర | 3 లుప్తవిసర్గవళి |
| | | | 4 వృద్ధివళులు |
| | | 3 ఋకార స్వరూప | 5 ఋవళి |
| | | 4 రివిరమము | 6 ఋత్వసంబంధవళి |
| | | 5 లకార | 7 ఋత్వసామ్యవళి |
| 2 వ్యంజనయతులు | | | 8 ప్రాణి వళి |
| వర్గ | 3 వర్గ | 6 వర్గ | 9 వర్గ వళి |
| 3 పోలిక | 4 ముకార | 7 పోలిక | 10 మువిభక్తి |
| | | | 11 ముకార వళులు |

| కవిజనాశ్రయము-10 | కావ్యాలంకారచూడామణి-12 | ఛందోదర్పణము-24 | అప్పకవీయము-41 |
| --- | --- | --- | --- |
| 4 సరస | 5 ఇతరేతర | 8 సరస | 12 సరస వళులు |
| | | | 13 ఋ జు వళులు |
| | | | 14 ఊష్మ వళులు |
| 5 బిందు | 6 సబిందు | 9 అనుస్వార | 15 బిందు వళులు |
| | | | 16 అనుస్వారసంబంధవళ్లు |
| | | | 17 అనునాసికాక్షరవళ్లు |
| | | 10 మకార | 18 మవర్ణ వళులు |
| 6 ఎక్కటి | 7 ఏకతర | 11 ఎక్కటి | 19 ఏకతర వళులు |
| 7 సంయుక్తాక్షర | | 12 సంయుక్త | 20 సంయుక్త వళి |
| | | 13 తద్భవవ్యాజ | 21 తద్భవవ్యాజవళి |
| | | | 22 విశేష వళి |
| | | 14 భిన్న | 23 భిన్న వళి |

| కవిజనాశ్రయము-10 | కావ్యాలంకారచూడామణి-12 | ఛందోదర్పణము-24 | అప్పకవీయము-41 |
| --- | --- | --- | --- |
| | | | 24 ప్రత్యేక వళులు |
| | | | 25 అంత్యాప్మసంధి వళి |
| | | 15 వికల్ప | 26 వికల్పసంధి వళి |
| | | 16 యుక్తవికల్ప | |
| | | 17 అభేద | 27 అభేద వళి |
| | | 18 రేఫయుత | 28 అభేదవర్గ వళులు |
| **ఉభయవళులు :-** | | | |
| 8 ప్రాది | 8 ప్రాది | 19 ప్రాది | 29 ప్రాది వళులు |
| 9 ప్లుత | 9 ద్వ్యక్షర త్ర్యక్షర ప్లుతాక్షర వడి | 20 కాకుస్వర | 30 కాకుస్వర వళులు |
| | | | 31 ప్లుతాక్షర వళులు |
| | 10 ఆదేశ | 21 నిత్యసమాస | 32 నిత్యసమాస |
| | 11 దేశీయ వళి | | 33 దేశ్య నిత్యసమాస |

| కవిజనాశ్రయము-10 | కావ్యాలంకారచూడామణి-12 | ఛందోదర్పణము-24 | అప్పకవీయము-41 |
|---|---|---|---|
| | | 22 ప్రభునామాంతర | 34 నామాఖండ |
| | 12 ప్రచ్ఛురాదులు | | 35 రాగమ |
| 10 అఖండ | | 23 విభాగ | 36 విభాగ |
| | | 24 నిత్య | 37 నిత్య |
| | | | 38 యుష్మదస్మచ్ఛబ్ద |
| | | | 39 పరరూప |
| | | | 40 పంచమీవిభక్తి |
| | | | 41 ప్రాస విశ్రాంతి |

వళ్ల భేదములన్నియును సమాకలనము చేసికొని గుర్తులుంచి తెలియజేయుదును :—

1. అ=ఐ=ఔ=హ=య (=మైత్రికి గుర్తు. హ్రస్వస్వరమును బట్టి దీర్ఘస్వరము కూడ ఉన్నట్లే తెలిసికొనవలెను.)

2. ఇ=ఎ<br>ర్ + (ఇ; ఎ) } =ఋ=కృ=వృ ము. (ఋకారమే వ్యంజనముపైనున్నను విడిగా నున్న స్వరమువలెనే పాటింపవచ్చును.)

3. ఌ=ల్, ళ్ (ఇ;ఎ.) (ఇ ఎ లం గూడిన లళలే అని అర్థము.)

4. ఉ=ఒ

5. క్ష్క్ (5 వర్గులకు ఇట్లే) (క్ష అనునాసికములు కాక తక్కిన వర్గాక్షరములు నాలుగు అని తెలియజేయు గుర్తు. ఈ నాలుగును అన్యోన్య మైత్రి గలవని అర్థము.)

6. క్ష్చ్=శ్=ష్=స్

7. క్ష్ంక్=జ్

8. క్ష్ంచ్=ఞ్

9. క్ష్ంత్=క్ష్ంట్=న్=ణ్

10. క్ష్ంప్=క్ష్ంయ్=మ్ (క్ష్య్ అనగా య ర ల వ శ ష స హ లు 8న్ని.)

11. ఁప్ (ఉ;ఒ.) = మ్ (ఉ;ఒ.)

12. ఁప్ = ఫ్

13. జ్ఞ = ఁచ్ = న్ = ఁక్ (ఁక్. ఉ॥ జ్ఞానికి నుపదేశవిధి ప్రకాశము గాఁగన్)

14. ల్ = ళ్ = డ్

15. హాయలకు స్వరమైత్రి - హాయలపై నున్న స్వరములకు విడిగా నున్న స్వరములలో సజాతీయము లయిన స్వరములకు వడి చెల్లును.

16. గూఢ స్వరమైత్రి (ఉ॥ దానోఽహం. అన్యోఽన్యలో గల అ; వనౌకసలో ఓ. జగజ్జనకుడులో త్. వాగ్ఘరిలో హ)

17. సంయుక్త వ్యంజనములలో ఏ వ్యంజనమునకు వడి ఉంచినను చాలును; కాని పాదమున మూడు నాల్గుచోట్ల (స్రగ్ధరాది పాదములలో) వడి పాటించునప్పుడు అన్నిటను ఒకే వ్యంజనమునకు మైత్రి.

18. ప్రాస వడి.

19. ఉభయ వళులు; అఖండ వడి (దీనిని గూర్చి ప్రత్యేకించి వ్రాయ వలసిన అవశ్యకత గలదు.)

20. రల లకు మైత్రి కొందఱు సమ్మతించిరి. ఉ॥ రాయంచ కాళ్లు దౌ-ల కయమున్నఁ (వసుచరిత్ర) కొందఱు (అప్పకవి మొ॥) సమ్మతింపరు; తమ మతమునకు అనుకూలముగా కన బడిన పాఠములను దిద్దివేయుటకు పూనుకొందురు.

పైని పేర్కొన్నవానిలో 1, 4, 5, 6, 7, 8, 11, 15, 17 అగు వడులు సర్వలాక్షణిక సమ్మతములు. తక్కిన వడులలో మత భేదము గలదు;—

2-వ దానిలో ఇ ఈ ఎ ఏ ఋ ౠ లకు మాత్రమే మైత్రి కలదని కవిజనాశ్రయములోను, కావ్యాలంకార చూడామణిలోను కలదు. ఇందులో మిగిలిన మూడున్ను అనంతుడు అప్పకవి చెప్పినారు. అప్పకవి ఈ మూడును మూడు వేర్వేఱు వడులుగా చెప్పెను. అనంతుడు రెంటిలో సరిపుచ్చెను.

8-వది— అనంతుడు మాత్రమే చెప్పెను. తక్కిన లాక్షణికులు దీనిని గూర్చి ఏమియును చెప్పలేదు. నిషేధింపనులేదు కనుక ఈ వళి మైత్రి ఒప్పుకొనవచ్చును. రల లకు మైత్రి చెల్లు ననువారు ఈ ఋ ల మైత్రి కూడ ఒప్పుకొనవలెను.

9-వది— క్రింత్ = న్; క్రింట్ = ణ్ అని బిందు యతులక్రిందను. న్-ణ్ అని సరస యతులక్రిందను అందఱును చెప్పినారు. ఇవి కాక, క్రింత్ — ణ్, క్రింట్ = న్, క్రింత్ = క్రింట్ ఇవి వేఱె భేదములుగా అప్పకవి చెప్పెను కాని అనవసరము. బిందు సరస వళ్లలో చేరియున్నవి.

10-వది- క్రింప = మ అని మాత్రము బిందు యతిక్రింద అందఱును చెప్పిరి: క్రింయ = మ అను మకార యతి అనంతుడు అప్పకవి చెప్పిరి. చిన్నకోట పెద్దన చెప్పలేదు. అప్పకవీయములో ఈ వళికి లక్ష్యముగా భీమన చాటుపద్యము

(చ. గరళపు...) ఉన్నది. ఈ భీమనే కవిజనాశ్రయకర్త అయినచో ఈ వళి భేదము ఇతడు తన లక్షణ గ్రంథమం దెందుకు పేర్కొనలేదు?

12-వది— భారతములో ప్రయోగములున్నను కవిజనాశ్రయములో గాని, కావ్యాలంకార చూడామణిలో గాని ఏమీ చెప్పి యుండలేదు. అనంతుడు వపలకు మాత్రమే మైత్రి చెప్పి దీనికి అభేదనిరతి అని పేరుపెట్టెను. వబలకు అభేదమున్నది కాని, వపలకు లేదుగదాయని అప్పకవి వబలకు అభేద విరతి యనియు, ఞపవలకు అభేదవర్గ యతులనియు పేళ్లు పెట్టి రెండు వేర్వేఱు వడులక్రింద పేర్కొనెను. కాని రెండవ దానిలో మొదటిది గతార్థము కనుక ఞపవల మైత్రి (అభేదవర్గయతి) ఒక్కటిగా చెప్పిన చాలుగదా?

13-వది— కవిజనాశ్రయములో గాని, కావ్యాలంకార చూడామణిలో గాని కనబడదు. జ్ఞనలకు మాత్రము వడి గలదని అనంతుడు చెప్పెను. జ్ఞ ఞక లకు కూడ వడి గలదని తిక్కన సోమయాజి ప్రయోగము "జ్ఞానికి నుపదేశవిధి ప్రకాశము గాఁగన్" ఆధారముగా తీసికొని అప్పకవి చెప్పెను. కాని సోమయాజి మఱి యెక్కడను ఈ వడి గల ప్రయోగము చేయకపోవుటచేతను ఈ చోట గల పాఠము సరియైనది కాదని 'ప్రకాశము' అనుటకు మాఱుగా 'ప్రజనితము' అని ఉండునని కొందఱనిరి. ప్రాచీనకాలమందు జ్ఞకారము జ ఞ ల సంయుక్తముగానే ఉచ్చరించిరి కాని అర్వాచీనుల ఉచ్చారణలో కంఠ్యము వినబడుచున్నది. కనుకనే సంజ్ఞ సన్నయే కాక సైగ

కూడ అయినది. ఉత్తరాంధ్రకవులు (కంఠోచ్చారణ కలవడినవారు) ఏక జ్ఞ.లకు మైత్రి నిలిపిరి.

14-వది- దీనిని గూర్చి స్పష్టముగా చెప్పినవాడు అప్పకవి. అనంతుడు స్పష్టముగా చెప్పకపోయినను శడల మైత్రి తన పద్యములలో పాటించుటచేత అతని కీ మైత్రి ఇష్టమే. (చూ. 3–95). దీనిని గూర్చి కవిజనాశ్రయములో గాని కావ్యాలంకార చూడామణిలో గాని ఏమీ చెప్పియుండ లేదు. నన్నయ ప్రయోగ మున్నది కనుక సమ్మతమే కావలెను.

16-వ దానిలో నాలుగు అంశములు కలవు. రెండు విధములయిన సంధి కార్యములవలన స్వరమున్ను, మఱి రెండు విధము లయిన సంధి కార్యములవలన వ్యంజనమున్ను గూఢముగా నుండును. ఈ నాలుగును నాలుగు వేర్వేఱు వడులుగా అప్పకవి పేర్కొనెను. (లుప్త విసర్గ, వృద్ధి, అంత్యోష్మ, వికల్ప సంధి). ఇందులో స్వరసంబంధము గలవి రెండును ఒకటిగా చేర్చి అనంతుడు మూడు వడి విశేషములను పేర్కొనెను. విన్నకోట పెద్దన వృద్ధి వళులను గూర్చి లక్షణము చెప్పి ఆదేశ యతికి లక్ష్యముగా ఇచ్చిన పద్యములో లుప్త విసర్గవళికి కూడ పరిపోవునట్లు అన్యోన్య మందలి గూఢ స్వరమునకు అకారముతో వడి కూర్చినాడు. గూఢముగా నున్న వ్యంజనమును గూర్చి ఏమి

యును చెప్పలేదు. కవిజనాశ్రయములో ఈ అంశములను గూర్చి ఏమియును లేదు. నన్నయ భారతమందు గాక తక్కిన ప్రాచీనాంధ్ర కావ్యములలో పెక్కింట నీ వడులకు లక్ష్యములు గలవు.

18-వది– ప్రాస వడి. గీతాద్యుపజాతులలో తప్ప మఱి యెక్కడను దీని ప్రయోజనము లేదు కనుకను అక్షరమైత్రితో సంబంధము లేదు కనుకను దీనిని పూర్వ లాక్షణికు లెవరును వడులలో పేర్కొనలేదు. వడికి మాఱుగా వచ్చును కనుక ఇదియును ఒక యతి భేదమే యని అప్పకవి పేర్కొనెను. (క్రౌంచపదములో నున్న ప్రాసము దీనిక్రింద రాదు).

19-వది- అఖండ వడిని గూర్చి అభిప్రాయభేదములు గలవు.

అఖండ వడి అగ్రాహ్యమని చాలమందికి భ్రమ, వ్యాకరణ విషయమై చిన్నయసూరి బాలవ్యాకరణ సూత్రములు అప్రతిహతములని (పరిశీలన లేకపోవుటవలన) భ్రమపడినట్లే అప్పకవి లక్షణము (ఛందశ్శాస్త్రములో) వేదవాక్యముగా పండితులు శిరసావహించుటవలన అఖండ వడికి వెలి వచ్చినది. ఆ వెలి పోగొట్టవలెనని 1920 సంవత్సరమున వెల్వడిన 'తెలుగు' అను పత్రిక సంచికలు 9-10 లో ఒక పెద్ద వ్యాసము వ్రాసి కవిజనాశ్రయములోను, సులక్షణసారములోను, ముద్దరాజువారి కవిలోకసంజీవినిలోను, చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహములోను, కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహములోను అఖండ వడి కలదని ఇచ్చిన లక్ష్యలక్షణ పద్యము

లను కవిత్రయ శ్రీనాథ, పోతనాది మహాకవుల గ్రంథములనుండియు, ఇతరుల గ్రంథములనుండియు వందలకొలదిగా ప్రయోగములను ఎత్తి చూపించినాను. ఆ గ్రంథమంతయు సుమారు 20 పెద్ద పుటలు గలది. అది ఇక్కడ ఎక్కించుటవలన ఈ గ్రంథము ఎక్కువగా మఱి పది పండ్రెండు పుటలవఱకును విస్తరిల్లును. అదిగాక ఛందోరీతులను విషయమునకు అఖండ వడి చర్చ సన్నిహితమయినది కాదు. అనుక ముఖ్యమయిన విషయములు రెండు మాత్రము గ్రంథసౌష్ఠవము కోసము వివరింతును. కవిజనాశ్రయములో "ఉ॥ మానుగ విశ్రమాఖ్య సమన్వితమై స్వర మూదినన్ దదీయాను గుణాక్షరంబె కొనియైనను జెప్పఁగనొప్పు నీక్రియన్, భాను సహస్రభాసి వృషభాధిపు డన్నటు లర్థయుక్తమై పూనినచో నఖండ వడి పొల్పగు నాదికవి ప్రణీతమై॥

ఈ అఖండ వడి ఒప్పుకొనకపోవుటవలన అవి కనబడినప్పుడు వానిని ఉభయ వళులలో చేర్చి చెప్పుటవలన ఈ ఉభయ వళుల సంఖ్య అప్పకవి ఎక్కువగా పెంచవలసి వచ్చినది. అయితే, అఖండ వడి ఒప్పుకొన్నను ప్రాదులు, నిత్యసమాసములు, నామాఖండములు మొదలయినవి కొన్ని పేర్కొని అందులో స్వరము సంధిగతమయిన దని చూపింపవలసిన అక్కర లేకపోలేదు. అవి అన్నియు స్వరమునకు వళి గలవి యగుటవలన స్వరయతులే, వ్యంజనమునకు వడి గలవి అఖండ వడులే. అఖండ వడులలో వ్యంజనము స్పష్టముగా వినబడు చుండుటవలన ఆ వడి శ్రావ్యముగా నుండును. అప్పకవి పేర్కొన్న వడులకంటె అఖండ వడి ఎక్కువ శ్రావ్యముగా నుండును. చూడుడు-

ధర్మసంరక్షకుండు సజ్జనుండు దలంప — ఇది గ్రాహ్యమా ?

తల్లిదండ్రుల విమల చిత్తాబ్జములకు — ఇది అగ్రాహ్యమా ?

యాదవుని జూచి పలికె దాసోహ మనుచు —

ఇది గ్రాహ్యమా ?

చూవె! మనంబునన్ దలంచుచుండుదు... —

ఇది అగ్రాహ్యమా ?

సూవె మనంబునం దలంచుచుండుదు నేనున్ (ఆది V.IB 5) ఇక్కడ అఖండ వచ్చినదని అప్పకవి లక్షణము ప్రమాణముగాగొని "- దలంతు సుందరి యెపుడున్ " అని ఒకరును, "- ఁజొలవక యేనున్ " మరి యొకరును దిద్దినారు!

18. వడి ప్రాసవడి - వృత్తములు మొదలయిన పద్యములలో పాదము లందలి ద్వితీయాక్షరములలో నుండు ప్రాస ములకు గల నియమములే వడికి మారుగానుండు ప్రాస వడికిని చెల్లును. సాధారణముగా ప్రాస వడులలో సమ ప్రాసములే కనబడుచుండును. తక్కిన ప్రాసభేదములు కూడ అక్కడక్కడ కనబడుచుండును.

ఈ ప్రాస వడి విషయము ప్రస్తావించునప్పుడు శ్రీ నిడుద వోలు వేంకటరావుగారు పరిశోధన - పాల్కురికి సోమనాథ సంచి కలో ప్రకటించిన 'సోమన సృష్టించిన ఛందస్సు' అను వ్యాసమందు

'ప్రాసయతి - గేయ లక్షణము' అను వ్యాస ఖండమందు వ్రాసిన వాక్యములు గుర్తింపదగినవిగా నాకు కనబడుటవలన ఆ వాక్యము లను ఇక్కడ ఉదాహరింతును :—

'ద్విపద కవితకు సంబంధించిన గేయరచనయే కావున ప్రాస యతి పాటించిన తాళ లయానుగుణముగా నుండి శ్రవణపేయముగ నుండును.

" నిక్కమెట్లన విను - మొక్క విన్నపము
ముక్కంటి నీకు నే - దక్కిన బంట

—పుట 138.

పై ద్విపదలలో ప్రాస యతి యుండగానే తాళము పడుటకు వీలుగ నుండును. 'నిక్కమెట్లన విను - నే విన్న వింతు' అని యతి యుండిన తాళగతి కనుకూలముగా నుండదు. ప్రాసయతి యెట్లు తాళగతి కనుకూలముగ నుండునో సంగీత సాహిత్య కళా సార్వ భౌముడగు భట్టుమూర్తి వసుచరిత్రమున సీసపద్యములలో చూపి యున్నాను.

1. ఒక చాయ నవపాయ పిక గేయ

2. లలనా జనాపాంగ వల నా వసదనంగ -

పై వాని యందలి ప్రాసయతులు తాళానుగతికొంఱకే ప్రయు క్తములైనవి.'

## ప్రా స ము లు

'ఆద్యోవర్ణద్వితీయో వర్ణః ప్రాసోఽత్రపాద పాదేషు'

అనగా పద్యపాదమునకు తొలి యక్షరము వళి అనియును, దాని తర్వాత నున్న రెండవ యక్షరము ప్రాసమనియును సంజ్ఞ కలవని అర్థము.

విహితమయిన ఈ ప్రాసము కాక, అలంకార తుల్యములయిన ప్రాసములు - సుకర, దుష్కర, ద్వి, త్రి, చతుప్ప్రాస, అనుప్రాస, అంత్యప్రాసములను ఏడింటిని అప్పకవి పేర్కొనినాడు. వీనిలో మొదటివి గాక తక్కిన ఆరింటిని అనంతుడు తన ఛందోదర్పణ మందు పేర్కొనెను. చతుప్ప్రాసము గాక తక్కిన యారును కవి జనాశ్రయములోను, కావ్యాలంకార చూడామణిలోను గలవు. చతు ప్ప్రాస లక్షణము కావ్యాలంకార చూడామణిలో లక్షణపద్యమందు కనబడకపోయినను దానికి లక్ష్యముగా త్రిప్రాస లక్ష్యపద్యమునకు తర్వాత ఒక పద్యము కనబడుచున్నది. అది ప్రక్షిప్తము కాబోలును.

ప్రధాన ప్రాస భేదములలో లళడ ఋక్రాంత పద్యములు మూడు కవిజనాశ్రయములో ఉన్నవి. ఈ పద్యములే కావ్యాలంకార చూడామణిలో కూడ గలవు. ఇంతకు మించి ప్రాస భేదములు ఈ లక్షణ గ్రంథాలలో లేవు. ఈ లక్షణ గ్రంథకర్తలు నన్నయ భారత మందలి పద్యములలో గల ప్రాస భేదములను చక్కగా పరిశీలింప లేదని చెప్పవలెను.

అనంతుడు సమప్రాస విధులు చూపించి మరి 11 విధములైన ప్రాసములను గూర్చి చెప్పెను, అనంతుడు చెప్పిన 12 విధములే కాక మరి యేడు విశేషములను అప్పకవి వివరించెను :

1. పేఁడు, పండ్లకు,
2. లోక, (భా)షాక్లిష్టకు;
3. సషలకు;
4. తమ్ముఁలు, (భ)క్తిమ్ముర (భక్తిన్ + ముర) లకు;
5. దధలకు, ంద, ంధ, లకు;
6. లఘ్వలఘు యకారములకు,
7. లడలకు.

ఈ ప్రాసములలో కొన్ని అనంతునికి పూర్వము ప్రసిద్ధులైన కవులు వాడిరి. కనుక అనంతుని పరిశీలనలో కొంత లోప మున్నదని చెప్పక తప్పదు.

అద్యంత ప్రాసములు రెండును పద్యముల నడకకు, శ్రావ్యతకు ఎక్కువగా తోడ్పడును. ద్రావిడ భాషల పద్యములలో అన్నిటను పాదాదులందు ప్రాసమున్నది. తెలుగులో లయగ్రాహి, లయహారి, లయ విభాతిలో గల ప్రాసము తెలుగులో ఛందోరీతులందు చెప్పతగినది. ఆ విధముగానే రగడలందు గల అంత్యప్రాసము మనోహారమయినది. భట్టుమూర్తివంటి సంగీత సాహిత్య విశారదులయిన కవులు తమ ప్రబంధములలో వర్ణనలకు రగడలను కూర్చిరి, (శ్రీ) నిడుదవోలు వేంకటరావు గారు ప్రకటించిన ఉదాహరణ వాఙ్మయ మంజిలి ఉదాహరణములను ఎన్నిసార్లయినను చదువుటకు మనోజ్ఞములుగ నుండుననిన అందుకు తక్కిన సుగుణములతోపాటు ఈ అంత్యప్రాసములే గొప్ప కారణము. అందులో వేంకటరావుగారి ఉపోద్ఘాతములో ఈ విశేషము చక్కగా తెలియజేయబడినది.

వళ్లును ప్రాసములును అలంకారతుల్యములనియు నవి విడిచి పెట్టిన బాధ లేదనియు నేటి కవులు కొందఱందురు. కాని వీనివలన తెలుగులోని ఛందోరీతులకు ఎంత మాధుర్యము, శ్రావ్యత పెంపొందినవో చూడవలసినదని నా ప్రార్థన.

దండకము మనోహరముగా నుండుటకును, పట్టు పట్టునకును ప్రాసములు వినబడుచుండుటయే కారణము. సంస్కృతములో శ్యామలా దండకము మొదలయినవి పెక్కు గలవు. అన్నియును ఈ ప్రాసములవలన నెక్కువ హృద్యములుగా నున్నవి. ఇది గాక జగద్విజయచ్ఛంద మనుపేర పదేపదే ప్రాసములు వచ్చు సంస్కృత గ్రంథ మొకటి కలదు. కొన్ని సమాసములు గడచువఱకును ఒకే విధమయిన ప్రాసము. ఆ తర్వాత మరియొక ప్రాసము. ఇందు 'ండ' మొదలుకొని 'అహ' వఱకును అంత్య ప్రాసములతో వంద ఖండములు గల గ్రంథము రచితమయినది. ఉదాహరణకు :

జయజయ చందద్యుతి జయచండ ప్లుతరిపుచండ భ్రంశిత చండ ప్రణుదిత చండక్ష్మాతల దండ స్కందనదండ...క్షితి మార్తాండ స్తుతమార్తాండ స్థితజగ దండ...క్షితి నవఖండ ప్రగలిత ఖండ స్ఫుర మణి షండ ప్రవిహిత దుండ...హుత కేదార జ్వలనకదార ప్రదర మదార...స్థితి కైలాస...ప్రేమ నివాస...క్రథన విలాస...క్రోశిత భాస...స్నాత విభాస...ప్రతిహత కాల క్షురదఘజాల ప్రముఖ కరాల ద్రుహిణ బిడాల ప్రఖరతమాల...క్షితితలవర్మ శ్రుతిశతశర్మ ప్రద శుభ ధర్మ ప్రవి తర ఘర్మ క్షయ కర పాహి స్వకజనమేతం భక్తి సమేతమ్॥

ఇది విద్వత్ కవితా వినోద విశేషము; ఛందోరీతులలో నొక టిగా ఎన్నుకోదగినదే. ఇటువంటి ప్రాసభూయిష్ఠమయిన ఛందో రీతి తెలుగులో దండకమందే కలదు. రామాయణ మంతయును దండకములో రచించినవారును కలరు.

తెలుగులో గల ఛందోరీతులందు పేర్కొనదగినది శతక వాఙ్మయము. ఇది ఉదాహరణ వాఙ్మయమువలె సాహిత్య మందొక ప్రత్యేక శాఖగా పరిణమించినది. ఏ యే ఛందములలో తమ శత కములను రచింపగోరుదురో కవులు ముందుగానే నిర్ణయించు కొందురు. ఎవ్వరిని సంబోధించి శతకము రచింపబూనుదురో వారి నామధేయము ఏ పద్యమందు కడపటి చరణములో నిర్దిష్ట స్థలమున-సాధారణముగా కడపటి భాగమున అందును కడపటి గణమందు లేదా కడపటి గణములందు-పొందించుటకు సాధ్యమగునో ఆ పద్య చ్ఛందమును ఎన్నుకొని రచింపవలసి యుండును. ఉదాహరణకు: 'శ్రీ కాళహస్తీశ్వరా!' అనునది మత్తేభ శార్దూల విక్రీడితలందే తఱచుగా సాధ్యమగును. కనుక ఆ శతకమును ధూర్జటి ఆ వృత్తములందే నడపించెను. 'దాశరథీ కరుణా పయోనిధీ!' శతకము ఉత్పలమాలా చంపకమాలా వృత్తములలోనే నడపింపవలెను. "భారతీ" శతకము శార్దూల మత్తేభములలోను, ఉత్పలమాలా చంపకమాలలలోను నడ పింపవచ్చును. " విశ్వదాభిరామ వినుర వేమ " అనునది ఆటవెలది పాదము కనుక ఆ శతకమంతయును ఆటవెలదులలోనే నడచును. ఈ విధముగానే శతకము లన్నియును వివిధ ఛందోరీతు లలో రచితము లైనవి.

గర్భబంధ చతుర్విధ కందాది వినోద కవిత్వములు కూడ తెలుగులో గల ఛందోరీతులలో చెప్పదగినవి. ఏ ఛందములో ఏ యే పద్యములు గర్భగతములు కాగలవో ముందుగా నిర్ణయించుకోవలసి యుండును. ఆ విధముగానే ఏ యే పద్యములలో ఏ యే అక్షరములు ఎక్కడెక్కడ నిల్చునో, ఒకే అక్షరము రెండు మూడు నాల్గుసార్లు ఎక్కడెక్కడ నిల్చునో గుర్తించుకోవలెను. గర్భమందు గల కందము, గీతులు వడి ప్రాస నియమము గలవి కనుక ఆ పద్యములందలి గణము లకే కాక వడి ప్రాసములకుకూడ భంగము కలుగజేయరాదు. ఇంకను తెలుగులో గల ఛందోరీతులు ఎన్నో కలవు. గ్రంథము ఇంతకంటె అధికముగా పెంచుటకు స్థలము చాలనందున ముఖ్యమయినవి మాత్రమే వివరించితిని.

అప్పకవీయములో ఎన్ని లోపము లున్నను తెలుగులో గల ఛందోరీతులను వివరించుటలో దానిని మించిన లక్షణ గ్రంథ మింకొకటి లేదు. కవిజనాశ్రయమునాటనుండి వచ్చుచుండిన సంప్రదాయ మును అతడు అనుసరించెను. తమిళులు భాష యెడలను, ఛందోరీతుల యెడలను స్వాభిమానము గలవారు గనుక గణముల ప్రస్తారము గణముల పేళ్లు మొదలుకొని పద్యములవఱకును సంస్కృత ఛ్ఛంద స్సుతో సంబంధము పెట్టుకొనకపోవుటవలన వారి ఛందోరీతులు వారివిగానే పరిణమించినవి. కన్నడ తెలుగు ఛందస్సులు సంస్కృత మార్గమును త్రొక్కినవి. ఈ రెంటిలోను సంస్కృత ఛ్ఛందోరీతులను ఎక్కువగా అనుకరించినది తెలుగు ఛందస్సే. అయినను అప్పకవి తెలుగులో గల ఛందోరీతులను విడిచిపెట్టలేదు. చిత్రకవిత్వమందలి అనులోమ, విలోమ, నిరోష్ఠ్య-అక్షరవిలోప, పద్యభ్రమక, ఏకపాది, ద్విపద, త్రిపద లతో పాటు కేవలము తెలుగునకే సంబంధించిన

తలకట్లు, గుడులు, కొమ్ములు గల పద్యములును గూడ ఉదాహరించెను. ఏకాక్షరి, ద్వ్యక్షరి, త్ర్యక్షరి పద్యములు సాధ్యమైనంత వఱకు తెలుగు పదములతోనే కూర్చెను.

ఇట్టి చిత్ర విచిత్ర రచనలను వినోదార్థము చేసినవారు నేడును గలరు. ఉ వాఙ్మయ మహోధ్యక్ష వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు తమ 'మానవతి' లో డకారాను ప్రాసముతో రచించిన సర్వలఘు కంద పద్యము చూడుడు:—

(...కేశముల్ తిమిర ఝర్ఝరిణీ లహరీ విధానమై)

క॥ నిడుపుగ చిడిముడి వడి విడ
వెడద యెడద కడరు వడిగ - వెడలుచు నడవన్
గడచి గడననిడు విడిముడి
గడిచి నడచె నడుగడుగుకుఁ - గడియము లడలన్॥

"సరిగమపదని" అను స్వరాక్షరములతో వినోదార్థమే నేను నొక కంద పద్యము రచించితిని :—

క॥ పరిగాగ నీమగని ద
ద్దరి మరిమరి గసరి సాగ-దగదమ్మా! నీ
గరిమమ్మా! సమ్మదమా!
పరిపరి నీ పాపదారి - పని దగదమ్మా! ॥

దేశి కవిత్వము, దేశి చ్ఛందము, దేశి లక్షణము పెంపొందించుటకు ఛందఃప్రక్రియనే మార్చవలసినదని నా యభిప్రాయము. అక్షరసంఖ్యా నిబద్ధములయిన వృత్తములవలనను, వృత్తపాదములను త్రికములయిన గణములచేత వివరించుటవలనను ప్రయోజనము లేదు.

ఈ ప్రక్రియవలన పద్యముల నడక తెలియదు కనుక పద్యములను త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ గతులక్రింద వివరించుట మంచిది. ప్రచారములో నుండిన వృత్తములను మనము పోగొట్టు కొన నక్కఱలేదు. ఈ క్రొత్త వర్గీకరణమునందు ఆ యా వృత్తము లకు ఆ యా గతుల వర్గములో స్థలము కలదు. ప్రతి వర్గమందును ప్రత్యక్షముగా కనబడు గతియును గుప్తముగా నుండు గతి యును రెండు శాఖలుగా ఉండగలవు. వడి, ప్రాసములకు కావలసి నంత అవకాశముండును, స్వేచ్ఛ కూడ ఉండును. చరణములలోని గణములు త్రికములు కాక నడక ననుసరించినవి యుండును. ఎన్ని అట్టి గణము లుండవలె నను విషయము కవికే విడిచిపెట్టవచ్చును. అవి సాధారణముగా నాలుగు మొదలు ఎనిమిది వఱకును ఉండ గలవు. లయవిభాతి, రగడలు మొదలయిన పద్యములు ఇందుకు మార్గదర్శకములుగా నుండగలవు. పాడుకొనుటకు తగినట్లు రచి తము లయిన గేయములనుండియే చదువుకొనుటకు తగిన పద్య ములు ఎన్నైనను ఉత్పన్నములయి పైని సూచించిన ఛందోవర్గము లందు చేరగలవు. ఇది నా సూచన. దీనిని ఆదరించి, దీని విషయము ఆలోచించి, పెద్దలు తెలుగు సంప్రదాయమునకు అనుకూలముగా ఒక విధానమును కూర్తురు గాక యని నా ప్రార్థన. మిత్రులు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ప్రధాన కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు, శ్రీ తాపీ ధర్మారావు, శ్రీ అబ్బూరి రామకృష్ణా రావు, శ్రీ నిడుదవోలు వేంకటరావుగార్లు కోరిన మేరకు నే నా విధానమును ఆఱవ ప్రకరణముగా నీ గ్రంథమును పెంచి సూక్ష్మ ముగా వివరించుచున్నాను.



# ఆరవ ప్రకరణము

## దేశిచ్ఛందము

దేశి కవితకు అనుగుణమైన ఛందోలక్షణము ప్రత్యేకించి చెప్పునప్పుడు గణలక్షణము మొదలుకొని క్రొత్తగా చెప్పవలెను. సంప్రదాయసిద్ధములైన త్రికములు దేశిచ్ఛందమునకు నిరర్థకములు. సూర్యేంద్ర చంద్రగణములలో చంద్రగణముల ప్రయోజనము కన్నడమునుండి వచ్చిన యక్కరలకు తప్ప తక్కిన తెలుగు పద్యములలో కనబడదు. అక్కరలోనైనను ఒక్క మధ్యాక్కర మాత్రమే నన్నయయు, అతనిని జూచి మఱి కొలది మందియు అక్కడక్కడ విరలముగా వాడినారు. తక్కిన యక్కరలు ఎక్కడనో మచ్చుటగా వాడినవి లెక్కకు రావు. మధ్యాక్కరలలో చంద్రగణ ప్రసక్తి లేదు. అందుచేత, సూర్యేంద్ర గణములనే మనము మన దేశిచ్ఛందమునందు చేర్చుకోదగినవి. ఇందులో సూర్యగణములు నగణ, హగణములు రెండును మూడు మాత్రల గణములే అయినవి. ఇంద్ర గణములలో భ, నల గణములు రెండును నాలుగు మాత్రలు గలవిగాను, ర, త, సల, నగ గణములు నాలుగును అయిదుమాత్రలు గలవిగాను ఉన్నవి. వీటిలో నాలుగు మాత్రల గణములకంటె అయిదు మాత్రల గణములే సీసాద్యుపజాతి పద్యములకు నిండుగాను శ్రావ్యములుగాను ఉండగలవు.

మార్గకవితలో గల వృత్తములందు తెలుగు కవులు తెచ్చుకొన్న వృత్తములలో మాత్రాగణములకు లొంగి పూర్తిగా ఏదేని నొక తాళమునకు గాని, లయకు గాని అనుగుణము లయిన వృత్త

ములే ఎక్కువ ప్రచారములోనికి వచ్చినవి. కనుక, దేశిచ్ఛందమునకు కావలసిన గణములు మాత్రానిబద్ధములయిన గణములే కాని త్రిక ములు కావు. మాత్రాగణములలో "రామ, రాముడు, రాముండు, రామచంద్రులు" వలె అనులోమగతిని నడచు గణములును, 'రమా, హిమాద్రి, రవీంద్రా, నమశ్శివాయ' వలె విలోమగతిని నడచు గణ ములును గలవు. వీటిలో అనులోమగతి గణములే కాని విలోమగతి గణములు తెలుగు పద్యములకు అనుకూలింపవు. కాని, విలోమ గతియే ఉద్దిష్టమయిన చోట్ల ఈ విలోమగతి గణములును కావలెను గనుక, వీటిని గూడ చేర్చుకోవలెను.

ఈ మాత్రాగణములు త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణాదులు. తెలుగు పద్య గేయరచనలకు కావలసిన గణములను మూడు మొదలు తొమ్మిది వఱకును గల మాత్రల సంఖ్యనుబట్టి గణ ములు వివరించి పేర్కొందును. పేళ్లు పెట్టుటలో సౌలభ్యము ప్రధానము కనుక, తెలుగు పేళ్లతోపాటు సుప్రసిద్ధములయిన త్ర్యస్రాది నామములను ఆయా గణముల వర్గములకును, వర్గము లందలి గణములకు మ, య, ర, స, త, భ, జ, న ము లను త్రికముల పేళ్లను; సూర్యేంద్రగణముల పేళ్లను, అందులో ( UI ) హగణ, ( IU ) వగణములను పేళ్లను వాడుదును. ఇంద్రగణములలో నాలుగు మాత్రల గణవర్గమునకు 'సురపతి' గణవర్గ మనియు, అయిదు మాత్రల గణవర్గమునకు 'దేవేంద్ర' గణవర్గ మనియు పేర్కొందును. నలమునకు సురపతి గణ మనియు, సలమునకు సురనాథగణ మనియు పేర్కొందును.

## మాత్రాగణ వర్గములు

1. త్ర్యస్రములు – మూడు మాత్రలు గలవి :-

III—నగణము } సూర్యగణములు
UI—హగణము }

IU—వగణము—విలోమగతి గణము.

2. చతురస్రములు – నాలుగు మాత్రల గణములు :-

IIII—నలము; సురపతి గణము.

UII—భగణము.

IIU—సగణము.

IUI—జగణము; రవీంద్ర గణము—విలోమగతి గణము.

UU – గగ

అయిదును కందమునకు చెప్పిన గణములు. వీటిలో మొదటి రెండును ఇంద్రగణములందు నాలుగు మాత్రల గణములు.

3. ఖండగతి గణములు – అయిదు మాత్రలు గలవి :-

IIIII—నలలము; తక తకిట గణము

UIII—భలము; తా తకిట గణము

UUI—తగణము; త త్తకిట గణము }
UIU—రగణము, త త్తకా గణము } ఇంద్ర గణములలో
IIIU—నగము; తకిటతా గణము } 5 మాత్రలు గలవి.
IIUI—సలము; తకతాక గణము }

IUII—జలము; తకా తక గణము } విలోమగతి
IUU—యగణము; తకాతా గణము } గణములు.

గీత సీసాద్యుపజాతి పద్యములందు నలల, భలములకును స్థానము కలదని నా మతము.

4. రూపకతాళ గతి గణములు - ఆఱు మాత్రలు గలవి :-

IIIIII—నన గణములు; తకిట తకిట, తక కిట తక గణము
IIUII—నలలము; తక తాకిట గణము
IIIIU—నవము; తకిట తకా; కిట తకతా గణము
IIUU—సగము; కిట తాతా గణము
IIIUI—నహము; తకిట తాక గణము
UIIII—భలలము; తాకిట తక గణము
UUII—తలము; తాతా కిట గణము
UIUI—రలము; హహము; తాక తాక గణము
UIIU—హవము; తాకిటతా గణము
UUU—మగణము; తాతాతా గణము
IUIII—జలలము; వసము; తకా తకిట గణము
IUUI—యలము; వహము; తకా తాక గణము
IUIU—జగము; వవము; తకా తకా గణము
(పై మూడును) విలోమగతి గణములు.

5. మిశ్రగతి గణములు - ఏడు మాత్రలు గలవి :-

ఇవి 3 + 4గా విభక్తము లయినపుడు త్రిపుటకును, 2 + 5గా విభక్తము లయినపుడు ఖండజాతి రూపకమునకును సరిపడును.

IIIIIII—ననలము; తకిట-కిటతక; తక-తకతకిట
IIUIII—సనము; తక-తా తకిట
IIUUI—సహము; తక-తాతాక

||U|U—పవము; తక-తాతకా

|||||U—నసము; తకిట-కిటతా; తక-తకిటతా

||||U|—నజము; తక-తక తాక

|||U||—నభము; తకిట-తాతక

|||UU—నగగము; తకిట-తాతా

U|||||—భనము; తాక-కిటతక; తా-తక తకిట

UU|||—తలలము; తా-తాక తక

UUU|—మలఘు; తా-తాతాక

UU|U—తగము; తా-తాతకా

U|||U—భవము; తాక-కిటతా; తా-తకిటతా

U||U|—భహము; తా-తక తాక

U|U||—రలలము; హాభము; తాక-తాతక

U|UU—రగము; తాక-తాతా

|U||||—జనము; తకా-కిటతక

|UU||—యలలము; వభము; తకా-తాతక

|U||U—జవము; వసము; తకా-కిటతా

విలోమగతి గలవి.

|UUU—యగము; తకా-తాతా

|U|U|—జహము; తకా-తతాక

7. ఆదితాళ గతి గణములు – ఎనిమిది మాత్రలు గలవి :–

ఇవి 4 + 2 + 2 గా విభక్తము లయినపుడు ఆదితాళమునకును, 3 + 2 + 3 గా విభక్తము లయినపుడు త్ర్యస్రజాతి మఠ్యతాళమునకును, 5 + 1 + 2 గా విభక్తము లయినపుడు ఖండజాతి జంపెతాళమునకును చక్కగా సరిపడును. 3 + 5 గా విభక్తము లయినను

మొత్తము 8 మాత్రలకు పదములు విభక్తము లగునట్లు రచన సాగించినయెడల చతురస్రగతి గణములతో కలిపి ఆదితాళ గతిని నడప వచ్చును.

IIIIIII—ననలలము; కిటతక కిట తక (4 + 2 + 2);
తకిట కిట తకిట (3 + 2 + 3);
తకతకిట త కిట (5 + 1 + 2).
UIIIII—భనలము; తాకిట కిటతక (4 + 2 + 2);
తాక తక తకిట (3 + 2 + 3).
IIUIIII—సనలము; తకతా కిట తక (4 + 2 + 2);
తకతాక త కిట (5 + 1 + 2).
UUIIII—తనము; తాతా కిట తక (4 + 2 + 2);
IIIIUII—నజలము; కిటతక తా కిట )4 + 2 + 2).
UIIUII—భభము; తాకిట తా కిట (4 + 2 + 2).
IIUUII—సభము; తకతా తా కిట (4 + 2 + 2).
UUUII—మలలము; తాతా తాకిట (4 + 2 + 2).
IIIIIIU—ననగము: కిటతక తకి టా (4 + 2 + 2);
తకిట కిట తకా (3 + 2 + 3);
తకతకిట త కా (5 + 1 + 2).
UIIIIU—భసము; తాకిట తకి టా (4 + 2 + 2);
తాక తక తకా (3 + 2 + 3)
IIUIIU—ససము; తకతా తక తా (4 + 2 + 2);
తకతాక త కా (5 + 1 + 2).

UU||U—తవము; తాతా తకతా $(4+2+2)$;
తా తాక త కా $(5+1+2)$.

||||UU—నయము; కిటతక తా తా $(4+2+2)$.

U||UU—భగగము; తాకిట తా తా $(4+2+2)$.

||UUU—సగగము; తకిటా తా తా $(4+2+2)$.

UUUU—మగము; తాతా తా తా $(4+2+2)$.

|||U|||—నభలము; తకిట తా తకిట $(3+2+3)$

U|U|||—రనము; తాక తా తకిట $(3+2+3)$

|||||U|—నసలము; తకిట కిట తాక $(3+2+3)$

U|||U|—భజము; తాక కిట తాక $(3+2+3)$.

|||UU|—నతము; తకిట తా తాక $(3+2+3)$.

U|UU|—రహము; తాక తా తాక $(3+2+3)$.

|||U|U—నరము; తకిట తా తకా $(3+2+3)$.

U|U|U—రవము; తాక తా తకా $(3+2+3)$.

ఈ క్రింది ఎనిమిది విలోమగతి గణములు.

|U|||||—జనలము; తకా తక తకిట $(3+2+3)$.

|UU|||—యనము; తకా తా తకిట $(3+2+3)$.

|UUU|—యహము; తకా తా తాక $(3+2+3)$.

|UU|U—యవము; తకా తా తకా $(3+2+3)$.

|U|||U—జసము; తకా తక తకా $(3+2+3)$.

|U||U|—జజము; తకా తక తాక $(3+2+3)$.

|U|U||—జభము; తకాత తా కిట $(4+2+2)$.

|U|UU—జగగము; తకాత తా తా $(4+2+2)$.

పైని పేర్కొన్న గణములలో 3 + 2 + 3 గా విభక్తము లయిన వాటియందు క్రింది గీట్లు గలవి 5 + 1 + 2 గా కూడ విభక్తములు కాగలవు.

8. సంకీర్ణగతి గణములు—తొమ్మిది (4 + 5; 5 + 4)మాత్రలు గలవి.

ఎనిమిది మాత్రలు గల గణములను ప్రస్తరించి పేర్కొన్న రీతిగానే తొమ్మిది మాత్రల గణములనుకూడా ప్రస్తరించి పేర్కొనవచ్చును. ఇవికూడా మూడు విధములుగా విభక్తములు కావచ్చును. 3 + 3 + 3గా విభక్తములయినప్పుడు ఇవి మూడు త్ర్యస్రగతి గణములే అగును; 2 + 7గా విభక్తములయినప్పుడు ఇవి మిశ్రజాతి రూపకగతి గణములగును; 4 + 5గా కాని, 5 + 4గా కాని విభక్తములయినప్పుడు సంకీర్ణగతిగణములగును. ఇట్టి గణముల ప్రయోజనము అంతగా తెలుగు పద్యములందు లేదు. అందుచేత గణములను వివరించి పేర్కొనలేదు.

ఇంతకంటెను ఎక్కువ మాత్రలు గల గణము లున్నవి. ఉ॥ "లక్ష్మీనారాయణ"లో 10 మాత్రలు గలవు. అవి 4 + 2 + 4గా విభక్తములు కాగలవు. అప్పుడవి చతురస్రజాతి మఠ్య తాళములో నడచును. ఈ విధముగానే 35 తాళములలో ఏ తాళమునకు సరిపడునట్లు ఏ పద్యము నడచునో తెలిసికొనవచ్చును. ఈ 35 తాళములే కాక 108 తాళములుకూడా కలవు. ఏ పద్యమందయినను పాదములు ఒకే విధముగా గణముల కూర్పుగలిగి ఉన్నయెడల ఇంపయిన గతికనబడగలదు; ఏదో ఒక తాళమునకు లొంగ గలదు. ఒకొక్క పద్యమందు—ఆట వెలదిలో ఉన్నట్లు— మొదటి పాదమును మూడవ పాదమును ఒక విధముగాను, రెండవ పాదము నాల్గవ పాదము మఱియొక

విధముగాను ఉండును. అట్లున్నను సాదృశ్య లక్షణమును బట్టి ఆ పద్యమింపుగానే నడచును. అందుగల గణములపొందిక పైని పేర్కొన్న వర్గము లందలి గణముల పొందికకు భిన్నముగా నుండును. అయినను పునరావృత్తి విశేషమువలన శ్రావ్యముగానే ఉండును. ఇందుకు చిత్రలేఖనము నందలి సాదృశ్యమును చూడుడు. ఒక కొంకిరి గీత గీచి చూచినప్పుడు అది అందముగా నుండక పోవచ్చును. అట్టిదే విలోమముగా దానికి జోడించి చూడుడు. ఆ రెండు గీతలును కలిసినప్పుడు అందులో అందము కనబడును. ఆ విధముగానే నడక సొంపు కనబడని "వాడొక్క గుఱ్ఱమెక్కి దౌడుతీశాడు" అనే వాక్యమునకు "వీడొక్క సైకిలెక్కి వెంటబడ్డాడు" అను వాక్యము జోడించి చూడుడు. విడిగానున్న వాక్యమునందు లేని నడక సొంపు కొంచెమయినను ఆ జంట వాక్యములందు గోచరింపగలదు.

ఇక త్ర్యస్రాది గణ వర్గములకు లక్ష్యములు కాదగిన పద్య గేయములను ఉదాహరింప వలసియున్నది. తాళము ననుసరించి పాడుకొనుటకు వీలుగా నుండగలవి గేయములే. అవి యైనను విశ్రాంతి స్థలములందు ఆగి తాళ ప్రక్రియ ముగించి ఆ తర్వాతి సాహిత్య పదములను పాడుటకు వీలులేని యెడల ఆ గేయములు లయ ననుకూలింప గలవే కాగలవు గాని తాళము పాటించి పాడుకొనుటకు వీలు గలవి కావు. ఇక పద్యములందు ఉత్సాహ, మత్తకోకిల, లయగ్రాహి మొదలయిన వాటిలో లయ స్పష్టముగా కనబడుచుండును. ఉత్పలమాల, చంపకమాల, శార్దూల విక్రీడిత, మత్తేభ విక్రీడిత మొదలయిన వృత్తములందు లయ గుప్తముగా నుండును. సంస్కృత వృత్తములలో విశ్రాంతి స్థలములందును

పదము పూర్తి కావలెనే కాని నడుమను తెగిపోరాదన్న నియమ మొుండుటవలన అందుగల నడక ఉద్దిష్ట లయకు అనుగుణముగా నుండగలదు. తెలుగు వృత్తములందు అట్టి నియమములేక అక్షరమైత్రి మాత్రమే ఉండుట వలన ఉద్దిష్టమైన లయ మఱింత గుప్తమగును. ఇదే పద్యరచనా ప్రౌఢత్వమును తెలియజేయు నని కొందఱందురు. కాని, ఉద్దిష్టమయిన లయను మఱుగు పఱచునని ఒప్పుకొనక తప్పదు. లయ కనుగుణమైన రచనలేని పద్యమును సంస్కృత వృత్తమును పాడినట్లుగా పాడినను, చదివినట్లు చదివినను అసందర్భముగా నుండును. పాటలో "వాతాత్మజాదుల చెంత నే" అను పట్టున వాతాత్మజా వద్ద తాళముకోసము నిలిపి "దులచెంత నే" అని పాడి నప్పుడు ఎంత కటువుగా నుండునో పద్యమందు "గోమాయువు గోరు చందమున" అను పట్టున పాదాంతమున గోవద్ద నిలిపి "మాయువు గోరు చందమున" అని చదువునప్పుడు అంత కటువుగా నుండును. అర్థము ననుసరించి "గోమాయువు" అన్నయెడల ఆ పద్యమందు ఉద్దిష్టమయిన నడక గోచరింపదు. పాటలందు పాటింపవలసినది తాళమేకాని అర్థము కాదని గాయకులును, పద్యములందు పాటింప వలసినది అర్థమేకాని తాళము, లయ కాదని కవులును అర్థమునకును లయకును గల పొందికను చెడగొట్టుచున్నా రనుటలో సత్యము లేక పోలేదు.

ప్రతి వర్గమునకును మూడు విధములయిన లక్ష్యములను చూపింప వలెను—1. తాళమునకుగాని లయకుగాని అనుగుణము లయిన గేయములు; 2. లయ స్పష్టముగా నున్న పద్యములు; 3. లయ గుప్తములుగా నున్న పద్యములు. ఈ లక్ష్యములను తొలుతటి ప్రకరణములందు చూపించితిని గనుక మఱల నిక్కడ చూపించుట

పునరుక్తి యగును. అందుచేతను ఇక్కడ ఈ ప్రకరణ సౌష్టవముకొఱకు వాటిని సూచించుట మాత్రమే చేసి ఆధునిక రచనలనుండి కొన్ని క్రొత్తవి ఉదాహరింతును.

1. త్ర్యస్ర గణవర్గము

1. గేయములు - చూ. పుటలు 68–71 ; 72.

దురితాలను ఎపుడును మా
దరినిజేర నివ్వకుమా!
పరమభద్ర పుంజం మా
పరంకాగ నివ్వుమా

× × × ×

అసాధ్యుడై అనంతుడై
విరాజలెడి పరాత్పరుడు

× × ×

అనాథుడై సునాథుడౌ
జనాలకూ ధనాలకూ —.

* * *

చరా చరాత్మరూపకా
సమస్త జగద్దీపకా
అజ్ఞానతిమిరనాశకా
సృష్టిలోకజాలకాల
సర్వస్వం నీ వశమై
సంచరించు పరమాత్మా॥-
వ. గో. కృ- * వేదనాదముల నుండి

ఇందులో 'దురితాలను'-(సమ)స్త జగద్దీ(పకా)అను పట్టులందు మూడు మాత్రలకు గణము విరుగదు; అయినా 2 + 2 + 2గా గాని 2 + 4గా గాని 4 + 2గా గాని విరుగుచు, మొత్తము ఆఱు మాత్రలు కలవియై రెండేసి త్ర్యస్ర గణము లగుటచే త్ర్యస్ర గతిలోనే నడచు నవవచ్చును. కడపటి చరణములలోను విలోమ గణము లున్నవి. అవియును వాద్యమందలి ఎదురు దెబ్బవలె శ్రుతి సుఖముగానే ఉండును.

వృత్తములు; పద్యములు:— చూ. పంచ చామరము పు. 33; విచికిలిత పు. 37; సుగంధి మొ॥ 71-72; హాయ ప్రచారాది రగడలు పు. 71, ఉపజాతి గీతాలు పు. 72.

ఉల్లాస ద్వ్యృత్త్యము- (అయ గుప్తమయినది)

భవానీ శంకరుఁడుగా - భవ్య నిజరూప మరయన్
అవేళన్ గూడ తమికా - హ్లాదమువనేదు ప్రియునా
నివాసమ్మందు పతిప - న్నీరజముతే మతిసదా
యెవేళన్ నిల్పెడితదీ - యేశ్వరిని నారసి వడిన్॥ * మానవతి.

2 చతురస్ర గణవర్గము

1. గేయములు— చూ. పు. 73—78; 80—81

రోగంవచ్చిన - రొష్టువచ్చినా
కష్టంవచ్చిన - నష్టంవచ్చిన
కరువు వచ్చినా - కాటక మొచ్చిన
పగవా రెక్కువ— బల వంశులుగా
పలు పాట్లకులో - బరచే వేళను
అధికారుల ని-న్నాగ్రహించినా
మృత్యుదేవతే- ముంచుకొచ్చినా
అభయ మొసగుతూ - అండ దండగా
అంటి పెట్టుకొని— కంటికి రెప్పగ
కాచినవారే- గర్భ బంధువులు
కావని వారే— గర్భ శత్రువులు॥ * ప్రజానీతి.

* వాఙ్మయ మహోద్యమ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు.

2. వృత్తములు; పద్యములు - చూ. 34; 78 - 80; 106 - 108
112–119 125 - 155.

లయ గుప్తముగానున్న వృత్తాలు- ఉత్పలమాలా చంపక మాలాదులు; నేను రచించిన మాధవ వృత్తము, మహోదయ వృత్తము, ( విశ్రాంతి మొ॥ చూ. పు. 45-48.

చతురస్రములో నడచే వృత్తాలే కొన్ని ఆదితాళ, రూపక తాళ గతిక నడపించ వచ్చును.

## 2. ఖండగతి గణవర్గము

(1) గేయములు– చూ. పు. 68; 88–89

ఈ విశ్వసర్వస్వ - మేలు ఆ ''పరమాత్మ''
ప్రణతులకు అర్హుడౌ - ప్రణుతులకు నర్హుడగు
వేదమంత్రజ్ఞాన - విషయాలతో అతని
పొంది మోక్షానంద - మందండి పొందుగా॥

వ. గో. కృ.- వేదనాదములు

1 నిదురపో– హాయిగా నిదురపో!
కనుమూసి హాయిగా నిదురపో:
నిదురలో కలల లోకమ్ములో తేలిపో!–

రజని– శతపత్రసుందరి.

2. వృత్తము, పద్యములు– చూ. పు. 35; 38; 41; 49; 83; 87.

శైలజవృత్తము- కంపించుగాద్గదిక - కంఠస్వరమ్ముతో
సొంపైన వాతెరల - సొమ్మైన నవ్వుతో

రంపిల్లు కనో్కలకు - లన్ జారునీటితో
గంపంత సద్హృదయ - గాంభీర్య దీక్షతో
వ. గో. కృ.-మానవతి

భోగినీవృత్తము— హృచ్చిన్మయానంద - మెసగి పైకొన్నట్లు
నిచ్చంపు టో్ష్ఠాల - నిలిచి నాట్యమ్మాడు
నచ్చంపు చిర్నవ్వు - లలరు కుప్పల్ నాగ
నచ్చిన్ని భూపాలి - నట నిడె న్నొండొండు॥
వ. గో. కృ.—మానవతి.

## 4. రూపకతాళగతి వర్గము

1. గేయము — చూ. త్ర్యస్రగణములందు 2 + 4 గా విభక్తము లయినవి.

నాటక యవనిక లాంటిది
నాలో జారిన స్వప్నం
ఖండిత నాయిక విగళత్
కైశిక భారం లాంటిది
శర్వరి పెదవుల తొణికిన
శంపాహాసం లాంటిది॥
సి. నారాయణరెడ్డి—స్వప్నప్రశస్తి.

2. వృత్తములు, పద్యాలు — చూ. పు. 47; 49.

కందపద్యము కూడ రూపక తాళములో పాడవచ్చును. దేసి సరి చరణముల రెంటను ఎనిమిది 4 మాత్రల గణములున్నవి. అనగా 32 మాత్రలు గలవు. తుదను 4 మాత్రల కాలము పొడిగించినయెడల 6 అవృతులలో నడచును.

## 5. మిశ్రగతి గణవర్గము

గేయములు — చూ. పు. 90; 95-96; 99-100.

గురజాడ అప్పారావు రచించిన ముత్యాల సరములు—

ఆకులందున అణగి మణగీ
కవిత కోకిల పలుకవలెనోయ్ ।
పలుకలను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయ్॥

ఘనిక రచనలో -

ప్రాణ మానములందు నరునకు
ప్రాణ పుంజముకన్న మానమె
మిన్న అన్నిట మున్నె లేవోయ్
మిన్నె విరిగిన మీద పడినను

*　　*　　*

కోట్లకొలదిగ పాల్లె రానీ
నిట్టనిలువున నిండుప్రాణము
లైన నీయుము కాని మానము
వదలబోకుము వదరబోతుగ
చెదరబోకుము బెదరబోకుము॥

వ. గో. కృ.-మనిషి మహర్షి నుండి.

ఈ మిశ్రగతిలో తత్త్వాలు అనేకముగా జానపద గేయాలలో కలవు. అందులో "నీళ్లు లేవి నిండు జలధిలో తానమాడిరి బాలలూ ఫీలు లేనీ వల్లు పన్నిరి జ్ఞానులూ" అనే తత్త్వాన్ని చూచి, వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు ఈ క్రింది తత్త్వాన్ని రచించినారు :—

మబ్బులేకా కుండపోతగ కురిసె వానల ధారల్లూ ।
కాడిలేకా చాళ్లు దున్నెను కోడెలూ॥
ముడుపుకట్టని అడవి ధాన్యము విత్తనాలను జల్లగా ।
మొలకలెత్తని ఆకుమళ్లూ మొలకలొచ్చి మునుగగా॥

× × × చూ. ఆంధ్రప్రభ 3-9-1950.

2. వృత్తములు, పద్యాలు — చూ. 35, 39, 42, 91-93, 95, 99.

## 6. ఆదితాళ గణవర్గము

1. గేయములు — చూ. చతురస్ర గేయములు.

ఆదితాళ మనగా చతురస్రజాతి త్రిపుట — 4 + 2 + 2 = 8 మాత్రలు గలది. అయినను 3 + 5 గా గాని 5 + 3 గా గాని 3 + 2 + 3 గా గాని విభక్తమైనను ఆదితాళమునకు సరిపోవును. 3 + 2 + 3 గా విభక్తమయినపుడు త్ర్యస్రజాతి మఠ్యతాళములో కూడ పాడవచ్చును.

2. వృత్తములు, పద్యాలు — చూ. మహోదయ వృత్తము పు. 46; కవికాంత పు. 48.

ఈ విధముగా తక్కిన తాళములలో పాడుటకు గాని ఆ తాళము లయకు సరిపడునట్లు చదువుటకు గాని అనుగుణములగు గేయములను, వృత్త పద్యములను రచింపవచ్చును.

ఇక్కడ సంగ్రహించి చెప్పదల[illegible] గనుక, ఈ విషయము ఇంతటితో ముగింతును.